శ్రీమతే రామానుజాయ నమః



# తిరునారాయణపుర వైభవం

**( యాదవగిరిచరిత్ర, మాహాత్మ్యవిశేషాలు, యదుగిరినాయకీ స్తవం, యదుగిరినారాయణస్తవం - ఆంధ్రవివరణం )**


పండితరత్న, వేదాంతవాచస్పతి, సత్సంప్రదాయసుధాంబుధి

**ఉ॥వే॥ శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**


సమర్ప్యతే సపర్యేయం యాదవాద్రీశపాదయోః ।
గోపాలకృష్ణమూర్త్యాఖ్యదాసేన నతమౌళినా ॥

**12వ ఉభయవేదాంత పండితసభల జ్ఞాపిక**

సమర్పణము

**శ్రీమతి పి.అలిమేలుమంగ,**
**శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి దంపతులు**


**మే, 2016**

# తిరునారాయణపుర వైభవం

**(యాదవగిరిచరిత్ర, మాహాత్మ్యవిశేషాలు, యదుగిరినాయకీ స్తవం, యదుగిరినారాయణస్తవం - ఆంధ్రవివరణం)**

**ఉ॥వే॥ శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**


| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణము | - | మే, 2016 |
| ఆవిష్కరణము | - | 28-05-2016 |
| వేదిక | - | అహోబిలమఠం (తిరునారాయణపురం) |
| ప్రతులు | - | 300 |
| వెల | - | అమూల్యము |
| హక్కులు | - | రచయితవే |
| ముఖచిత్రం | - | తిరునారాయణస్వామి (మూలవర్) ఉత్సవమూర్తి, రామప్రియులు, ఉభయదేవేరులతో యదుగిరి నాచ్చియార్ (మూలమూర్తి, ఉత్సవమూర్తి) |


**హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీమతి పి.అలిమేలుమంగ, శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తి దంపతులు తిరునారాయణపురంలో మేనెల 28వ, 29వ తేదీలలో నిర్వహించే ఉభయవేదాంత పండితసభల జ్ఞాపికగా, వారు భక్తితో సమర్పించిన పవిత్ర ద్రవ్యంతో ఈ గ్రంథం ముద్రింపబడింది.**


| | | |
|---|---|---|
| డి.టి.పి. | - | శ్రీమతి జయలక్ష్మి, శ్రీచంద్రశేఖర్ |
| ప్రింటింగ్ | - | సి.యన్. ప్రింటర్స్, తిరుపతి |




## మున్నుడి

తిరునారాయణపురవైభవాన్ని, అచట వేంచేసి ఉండే మూలమూర్తి, తిరునారాయణస్వామి, ఉత్సవమూర్తి యతిరాజసంపత్కుమారస్వామి (రామప్రియుల) వైభవాన్ని సంగ్రహంగా తెలిపే ఈ గ్రంథం "మేల్కోటవైభవం" అనేపేరుతో 2012సం॥లో ఆదర్శాచార్య ఉ.వే. శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయస్వామివారి ఆదేశానుసారంగా రచింపబడి, వారు అందించిన ద్రవ్యంతో ముద్రింపబడి, దీపావళి పండుగనాడు తిరునారాయణపురంలో భగవత్సాన్నిధ్యంలో పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరాజమానుజజీయర్ స్వామివారిద్వారా ఆవిష్కరింపబడింది. ఆ గ్రంథంలో యదుగిరినారాయణస్తవం, యదుగిరి నాయకీస్తవం- అనే రెండు స్తోత్రాలు చేర్చబడలేదు. ఇపుడు ఆరెండు ఆంధ్ర వివరణంతో ప్రకటింపబడుతున్నందున ఈ ముద్రణకు ఒక ప్రత్యేకత ఉన్నది.

యదుగిరినారాయణస్తవం, యదుగిరినాయకీస్తవం అనే ఈ స్తుతులు కౌశికగోత్రులైన తిరుమలాచార్యుల (శ్రీశైలార్యుల) వారిచే రచింపబడినవి. ఈ కవి, కర్ణాటక రాజ్యాన్ని పాలించిన నాల్వడి కృష్ణభూపతికి ముందున్న చిక్కదేవరాజ భూపతికి సమకాలీనులు, స్నేహితులు, ఆ రాజు ఆస్థానవిద్వాన్. సర్వతంత్ర స్వతంత్ర బిరుదభూషితులు, మంత్రిపదవిని కూడా అలంకరించారు. వీరి వాసస్థానం శ్రీరంగపట్టణం. ఈ కవి క్రీ.శ. 1645-1706 సం॥ల మధ్య జీవించి ఉండవచ్చు. ఈ శ్రీశైలార్యుల తండ్రిపేరు అళహియశింగరాచార్యులు. వీరు చిక్కదేవరాజ భూపతికి అభిమానపాత్రం. ఆస్థానపౌరాణికులు. శ్రీరంగపట్టణనివాసి. శ్రీశైలార్యుల తల్లి, దొడ్డదేవరాజభూపతి- ఆస్థానంలో ప్రధానమంత్రిపదవిని అలంకరించిన అప్పాజియార్యుల కుమార్తె శింగమ్మ.

ఈకవి యదుగిరి నారాయణస్తవం, యదుగిరినాయకీ స్తవం, లక్ష్మీనృసింహ స్తవం, మంజుళకేశవస్తవం, రాజగోపాలస్తవం, పరవాసుదేవస్తవం, గోపాలస్తవం, పశ్చిమరంగరాజస్తవం, ఏకాదశీనిర్ణయం, సచ్ఛూద్రాధికార నిర్ణయమనే గ్రంథాలను రచించారు. వీటిలో చివరి మూడు ఇపుడు దొరకడంలేదు.

ప్రకృతం యదుగిరినారాయణస్తవం, యదుగిరినాయకీస్తవం- అనే రెండు తాత్పర్యంతో ప్రచురింపబడుతున్నాయి. ఇవి వరుసగా పరాశరభట్టార్యకృతాలైన

శ్రీరంగరాజస్తవ పూర్వశతక, శ్రీగుణరత్నకోశాలనే స్తోత్రాలను అనుకరిస్తున్నాయి. తిరునారాయణపురంలోని భగవన్మందిరంలో మంత్రపుష్పసమయంలో ప్రతిదినం **"ఏధతామ్, అస్తి స్వస్తి, సమింధే, ఈక్షే, పరేషామ్"** ఇత్యాది శ్లోకాలలో ఏదో ఒక శ్లోకం అనుసంధింపబడుతున్నది. సంక్రాంతి, యుగాది సమయాలలో **"క్షమాలక్ష్మీ"** ఇత్యాది శ్లోకం పఠింపబడుతున్నది. అందువల్ల ఈ స్తవాల శిష్టపరిగ్రహత్వం స్పష్టం. యదుగిరినారాయణ స్తవానికి ఆ స్తవాన్ని రచించిన తిరుమాలాచార్యుల అనుజుడు, వారి సన్నిధిలో సకలశాస్త్రాలను నేర్చిన శింగరాచార్యులు సంస్కృతంలో ఒక రుచిర వ్యాఖ్యను రచించారు. ఈ వ్యాఖ్య చాలాకాలంక్రితం తెలుగులిపిలో జగ్గా వేంకటా చార్యస్వామివారిచే ప్రకటింపబడింది. ప్రకృతవివరణం ఆ వ్యాఖ్యను సారంగా రచింపబడింది.

నిరంతరం భగవద్రామానుజసిద్ధాంత ప్రచారపరిరక్షణలను గ్రంథప్రచురణ ద్వారా, ఉభయవేదాంతపండిత సభానిర్వాహణం ద్వారా పెద్దలు మెచ్చే రీతిలో నిర్వహించే భగవద్భాగవతాచార్య కైంకర్యధురీణులు, హైదరాబాద్ వాస్తవ్యులు, శ్రీమతి అలుమేలుమంగ, శ్రీమాన్ పి. గోపాలకృష్ణమూర్తి పుణ్యాదంపతులు తిరునారాయణపురంలో ఈ ఏడు మే 28వ, 29వ తేదీలలో జరుపుతున్న పన్నెండవ ఉభయవేదాంతపండిత సభల స్మృతిచిహ్నంగా ఈగ్రంథం వారు సమర్పించిన పవిత్ర ధనంతో ప్రచురింపబడుతున్నది. ఈ సందర్భంలో ఈ దంపతులను ఇద్దఱిని నేను హార్దంగా అభినందిస్తూ, వారి సంప్రదాయసేవ యదుగిరి నాయకీ సమేత యదుగిరినారాయణస్వామి కృపవల్ల మఱింత శోభిల్లాలని మంగళా శాసనాలను చేస్తున్నాను, నాకీ గొప్ప అవకాశాన్ని ఇచ్చిన వారిద్దఱికి కార్తజ్ఞ్య సమర్పణాన్ని చేసికొంటున్నాను. చాలా తక్కువ సమయంలో సిద్ధపఱచిన ఈ గ్రంథంలో నా అజ్ఞాన ప్రమాదాలవల్ల చోటు చేసికొన్న స్ఖాలిత్యాలను సహృదయ పాఠకులు పాఠకులు క్షమిస్తారని భావిస్తాను. స్వస్తి.

తిరుపతి
14-5-16

ఇట్లు
భాగవతవిధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**



# మేల్కోట వైభవం

**శ్రీరంగమంగళమణిం కరుణానివాసం**
**శ్రీవేంకటాద్రి శిఖరాలయకాలమేఘమ్ ।**
**శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వల పారిజాతం**
**శ్రీశం నమామి శిరసా యదుశైలదీపమ్ ॥**

కరుణకు నివాసమైనవాడు, శ్రీరంగం క్షేత్రంలో శుభకరమైన రత్నంవంటి వాడు, శ్రీవేంకటాచలశిఖరాన్ని నివాసం కల నల్లని మేఘంవంటి వాడు, శ్రీహస్తిశైల శిఖరంపై గొప్పగా ప్రకాశించే పారిజాతంవంటివాడు, యాదవాద్రిపై వెలిగే దీపం వంటివాడైన శ్రియఃపతిని శిరసా నమస్కరిస్తున్నాను.

**కిమపి కిమపి కృత్వా వ్యాజ మవ్యాజబంధుః**
**సకలభువనరక్షాసావధానైః కటాక్షైః ।**
**స ఖలు యదుగిరిస్థః పక్షిణో వా పశూన్ వా**
**శమితనిఖిలతాపః త్రాయతే చక్రపాణిః ॥**

**(నారదీయే-యాదవగిరిమాహాత్మ్యే - 8-99)**

(నిరుపాధిక బంధువైన, శ్రీసుదర్శనాన్ని ధరించిన, యదుగిరిలో ఉంటే ఆ తిరునారాయణస్వామి, ఏదో ఒకవ్యాజాన్ని కల్పించి దానిని పురస్కరించుకొని సమస్తలోకాలను రక్షించడంలో శ్రద్ధనుకల కటాక్షాలతో పశుపక్ష్యాదులను సైతం వారి తాపాలను అన్నిటినీ పోగొట్టి రక్షిస్తాడు.)

**భగవానుని రూపాలు అయిదు విధాలు :**

**"మమ ప్రకారాః పంచేతి ప్రాహు ర్వేదాంతపారగాః, పరో వ్యూహశ్చ విభవో నియంతా సర్వదేహినామ్, అర్చావతారశ్చ తథా దయాళుః పురుషాకృతిః, ఇత్యేవం పంచధా ప్రాహుర్మాం వేదాంతవిదో జనాః"** (వేదాంతంలో పూర్ణమైన జ్ఞానం కలవారు నా రూపాలు అయిదు విధాలంటారు. అవి - పరరూపం, వ్యూహం, విభవం, సమస్త ప్రాణులలో నియంతగా ఉండే అంతర్యామి. మిక్కిలి దయను కల్గినది, పురుషాకృతిని కల్గిన అర్చామూర్తి - అర్చావతారం అనేవి - అని వేదాంతశాస్త్రజ్ఞులు అంటారు) అని భగవానుడే స్వయంగా తన రూపాలు పరవ్యూహవిభవ అంతర్యామి

అర్చారూపాలుగా అయిదు విధాలని తెలిపాడు. వీటిలో, పరరూపం- పరమపదంలో నిత్యముక్తులకు అనుభావ్యమై, లక్ష్మీభూనీళాదేవీసహితుడై ఉండే రూపం. వ్యూహమనేది అవతారకందంగా చెప్పబడేది, సృష్టిస్థితి సంహారాల నిర్వహణకోసం, సంసారిసంరక్షణకోసం, ఉపాసకులను అనుగ్రహించడంకోసం సంకర్షణ-ప్రద్యుమ్న- అనిరుద్ధరూపంలో వేంచేసి ఉండే రూపం. విభవం- మత్స్యకూర్మ రామకృష్ణాద్యవతారాలుగా భూమిపై సాధుపరిత్రాణ- దుష్కృద్వినాశ - ధర్మసంస్థాప నార్థం పరిగ్రహించిన రూపం. ఇది గౌణముఖ్యరూపంలో రెండు విధాలు. భగవదవతారాలు భగవత్కల్యాణ గుణాలవలె అసంఖ్యాకాలు. అంతర్యామి రూపం- సకలప్రాణులలో లోపల ప్రవేశించి నియంతగా ఉండే రూపం. అర్చావతారం- భక్తుల అభిమతానుసారంగా, దేశకాలాధికారినియమాలు ఏవీ లేకుండా, అర్చకపరాధీనుడై, సర్వసహిష్ణువై, కోవెలలోను, గృహాలలోను వేంచేసి ఉండేరూపం.

## దివ్యదేశాలలో నాల్గు ప్రధానమైనవి :

భగవానుడైన శ్రియఃపతి అర్చారూపంలో వేంచేసి ఉండే దివ్యదేశాలలో నాల్గింటిని మిక్కిలి ప్రధానమైన క్షేత్రాలుగా పూర్వాచార్యులు నిర్ణయించారు. అవి- కోయిల్ అనబడే శ్రీరంగం, తిరుమల అనబడే వేంకటాచలం, పెరుమాళ్ కోయిల్ అనబడే హస్తిగిరి (చిన్నకంచి), తిరునారాయణపురమనబడే యాదవాచలం. వీటిలో మొదటి మూడు దివ్యదేశాలు ఆళ్వార్లచే సాక్షాత్తుగా మంగళాశాసనం చేయబడగా, తిరునారాయణపురం భగవద్రామానుజుల అభిమానానికి నోచుకొని, ఈ మూడిటితో సమానమైన, గౌరవాన్ని ప్రాధాన్యాన్ని పొందింది. ఈ నాల్గు క్షేత్రాలు వరుసగా **భోగమంటపం, పుష్పమంటపం, త్యాగమంటపం, జ్ఞానమంటప**మనే నామాలతో సంప్రదాయంలో ప్రసిద్ధి చెందాయి. ఈనాల్గు క్షేత్రాల వైభవం వాచామగోచరమైనది. వేదేతిహాస పురాణాగమ దివ్యసూరి పూర్వాచార్య సూక్తులద్వారా వీటి మహిమను కొంతవరకు మనం గ్రహించే అవకాశం ఉన్నది. యాదవగిరి మహిమ నారదపురాణం జ్ఞానకాండంలోను, మత్స్యపురాణంలోని క్షేత్రఖండంలోను, కాశీమాహాత్మ్యంలోను, పాద్మపురాణంలోను, పాంచరాత్రాగమానికి చెందిన శ్రీసాత్త్వతసంహితలోను తెలుపబడింది. రెండువేల మూడువందలకు మించిన శ్లోకాలతో కూడిన ఈ యాదవగిరిమాహాత్మ్య గ్రంథం సర్వజిత్ నామసంవత్సరం క్రీ.శ. 1896 సంలో ముద్రింపబడింది. ఇందులో యాదవాద్రికి చెందిన పలు



విశేషాలు వర్ణింపబడ్డాయి. ముఖ్యంగా, నారదీయ పురాణాంతర్గతమైన మాహాత్మ్య భాగంలో చాలా అద్భుతమైన విశేషాలు కన్పిస్తాయి. **"రఘుపతిచాపకోటి దృఢకుట్టన విస్ఫుటితోపలచ్ఛలద్విమలఝరీషు కృష్ణబలరోపితకల్పమహీజరాజిషు, యతిపతిపాదరేణుపరిమర్శ పవిత్రశిలాసు నిర్ఝరాః యదుగిరిసానుసీమసు రమేమహి సాభిమతా స్వమా శ్శతమ్"** అని యాదవాద్రిని స్తుతిస్తూ తిరుమలై అయ్యంగార్ అనే కవి యదుగిరినారాయణస్తవంలో పల్కిన ఈ శ్లోకం ప్రకృతంలో అనుసంధేయం.

## తిరునారాయణపురం భౌతికస్వరూపస్వభావాలు :-

మేల్కోట అనబడే తిరునారాయణపురం సముద్రమట్టానికి సుమారు 3589 అడుగుల ఎత్తుగల యాదవగిరిపై ఉండే చిన్న నగరం. ఇది కర్ణాటక రాష్ట్రంలోని మాండ్యాజిల్లాలో, పాండవపురతాలుకాలో, బెంగళూరుకు నైఋతిదిశలో 157 కిమీ దూరంలో, మైసూరుకు వాయవ్యదిశగా 48కి.మీ. దూరంలో ఉన్నది. సారవంతమైన, సస్యశ్యామలమైన లోయలను, కొండ చఱియలను కల్గిన పర్వతం ఈ యాదవగిరి. చుట్టూ ఉండే చిన్న చిన్న జలాశయాలేకాక తొండనూర్‌లో గల పెద్ద చెఱువు ఇక్కడి కృషికి దోహదం చేస్తున్నాయి. తొండనూర్‌లోని చెఱువు అందాన్ని, చరిత్ర ప్రసిద్ధిని కల్గినది. ఈ యాదవగిరి అతిప్రాచీనమైన పర్వతపంక్తులకు కల్గినది - అని భూగర్భశాస్త్రజ్ఞుల అభిప్రాయం. వైజ్ఞానికంగా మేల్కోటై పర్వతశ్రేణుల కాలం ఇంకా ఇదమిత్థంగా నిర్ణయింపబడలేదు. మైసూర్ ప్రాంతంలోని పర్వతశ్రేణులు వేయి మిలియన్ల సంవత్సరాల కంటే ప్రాచీనమని కూడా శాస్త్రజ్ఞుల అభిప్రాయం. (మిలియన్ అంటే పదిలక్షలు) అందువల్ల పురాణాలలో, ఆగమాలలో ఈ పర్వతం అతిప్రాచీనమని, ఈ క్షేత్రం కృతయుగానికి, శ్వేతవరాహకల్పానికి చెందినదిగా చెప్పబడిన సంగతి వైజ్ఞానికంగా ఋజువైనది. యాదవగిరిమాహాత్మ్యంలో ఈ క్షేత్రం **"త్రిక్రోశకృతవిస్తారః క్రోశేనైకేన చోన్నతః"** అని తెలుపబడింది. అంటే ఇది మూడు క్రోసుల దూరం విస్తరించినది, ఒక క్రోసు ఎత్తు (ఔన్నత్యాన్ని) కల్గినది- అని అర్థం. క్రోసు అంటే ఇంచుమించు రెండు మైళ్ళ దూరం. అందువల్ల ఈ క్షేత్రవిస్తారం రెండు యోజనాలు. అంటే - సుమారు 18 మైళ్ళు. అష్టతీర్థోత్సవంనాడు చేసే ప్రదక్షిణలోని దూరంకూడా సుమారు 18 మైళ్ళుకావడం ఈ సాంప్రదాయిక ప్రమాణాన్ని బలపరుస్తున్నది. శ్రీవేదాంతదేశికులు తమ సంకల్ప సూర్యోదయ

నాటకంలో ఈ క్షేత్రాన్ని **"కర్ణాలంకృతివిభ్రమం భజతి యః కర్ణాటదేశశ్రియః"** అని అంటూ కర్ణాటక దేశలక్ష్మికి ఈ నగరం కర్ణాభరణంవలె ఉన్నదని అన్నారు. నిజానికి ఈ ప్రాంతసన్నివేశం మానవుని కర్ణాకృతిలో అమరి ఉండడం గమనించ దగినది. చాలా శీతలవాయువులు వీచే ఇచటి వాతావరణాన్నిగూర్చి కూడా దేశికులు **"సహ్యపర్వతప్రత్యాసత్తేః అసహ్యపవనః"** అని అన్నారు.

ఈ నగరాభివృద్ధిని, క్రమవికాసాన్నిగూర్చి పరిశోధించిన చారిత్రకపరిశోధ కులు భగవద్రామానుజుల కాలంనుండి లభించిన కొన్ని ఆధారాలనుబట్టి, ఈ నగరం పరిణామాన్ని అభివృద్ధిని ఆఱు దశలుగా విభాగించారు. మొదటి దశలో తిరునారాయణస్వామి ఆలయ నిర్మాణం, దాని పరిసరాలలో పరిమితసంఖ్యలో కొందఱు శ్రీవైష్ణవబ్రాహ్మణుల నివాసంతో ఈ నగరవికాసం ఆరంభం కాగా, తరువాత దశలో నగరాభివృద్ధి కల్యాణపుష్కరిణివరకు వ్యాపించింది. మూడవ దశలో నగరం కల్యాణతీర్థం దాటి వ్యాపించింది. నాల్గవ దశలో చేనేత కులాలవారు కూడా ఈ నగరంలో నివాసం ఏర్పరచుకొన్నారు. వ్యాపారకేంద్రంగా కూడా ఈ నగరం వృద్ధిచెందింది. అయిదవ దశలో మహావిద్యాలయ, సంస్కృత పరిశోధనసంస్థ ఆవిర్భావం, ఆఱవ దశలో పలు నూతనసంస్థల ఆవిర్భావాన్ని, మఱింత నగరవ్యాప్తిని కల ప్రస్తుత సన్నివేశం అనేది ఈ నగరవికాసక్రమానికి చెందిన సంగ్రహరూపం.

**తిరునారాయణపురానికి గల పలు నామాలు :**

హరివంశ, నారదీయ, మాత్స్య, పాద్మాది పురాణాలనుబట్టి, పాంచరాత్రా గమానికి చెందిన ఈశ్వరసంహితనుబట్టి ఈ నగరానికి పలు నామాలు ఉన్నట్లు తెలుస్తున్నది. **1. పద్మకూటం, 2. పుష్కరం, 3. పద్మశేఖరం, 4. ఆనందమయం, 5. యాదవగిరి, 6. నారాయణగిరి, 7. వేదగిరి, 8. యతిశైలం, 9. ఇందిరాక్షేత్రం, 10. విద్యామంటపం (జ్ఞానమంటపం), 11. దక్షిణబదరికాశ్రమం, 12. గోమంతగిరి** అనే పేర్లు ఈ క్షేత్రానికి ఉన్నాయి. ఈ నామాలే కాక, ఇటీవలి కాలంలో **మేల్కోటై, భూలోక వైకుంఠ, దొడ్డ గరుడనహళ్ళి, దొడ్డగురుగలహళ్ళి** అనే పేర్లుకూడా ఉన్నట్లు తెలుస్తున్నది.

నారదీయపురాణం ఈశ్వరసంహితలనుబట్టి, యాదవగిరి కృతయుగంలో నారాయణాద్రి అనే పేరుతో వ్యవహరింపబడినదని తెలుస్తున్నది. భగవదనుగ్రహం వల్ల బ్రహ్మకు లభించిన తిరునారాయణస్వామి అర్చామూర్తిని అతడు తన కుమారుడైన సనత్కుమారునకు అతని ప్రార్థనపై ఇవ్వగా, సనత్కుమారుడు ఆ మూర్తిని మొదట భూలోకంలోని బదరికాశ్రమానికి తీసికొని వచ్చి ప్రతిష్ఠించాడు. ఆ తరువాత ఆనందమయ విమానసహితంగా ఆ మూర్తిని అతడు ఈ గిరిపై కల్యాణపుష్కరిణీతీరంలో ప్రతిష్ఠించాడు. అందువల్ల ఈ పర్వతానికి **"నారాయణ గిరి"** అనే పేరు వచ్చింది. దత్తాత్రేయమహర్షి ఈ పర్వతంపైననే వేదపుష్కరిణీ తీరంలో నాల్గు వేదాలను ప్రబోధించి వైదికధర్మాన్ని పునరుద్ధరించాడు. అందువల్ల ఈ గిరికి **"వేదగిరి"** అనే పేరు త్రేతాయుగంలో కల్గింది. దత్తాత్రేయుడు ఇక్కడే సన్న్యాసాశ్రమ స్వీకారాన్ని కూడా చేశాడు. అతడు సన్న్యాసాన్ని స్వీకరించే ముందు ఇక్కడ ఉండే పరిధానశిలపై దండకాషాయాలను పెట్టినట్లు ఐతిహ్యం. ఈనాటికీ గృహస్థులు సన్న్యాసాన్ని స్వీకరించేటపుడు ఈ శిలపై ముందుగా దండకాషాయా లను పెట్టి ఆ తరువాత సన్న్యాసాన్ని స్వీకరిస్తారు. సన్న్యాసాశ్రమాన్ని వేఱొక సన్న్యాసి నుండి స్వీకరించాలనే నియమం ఇక్కడ లేదు. శ్రీరామానుజులు కూడా ఈ శిలపై కాషాయాన్ని పెట్టి, తరువాత ధరించినట్లు వారి చరిత్ర తెల్పుతున్నది. **"అర్చితః కృష్ణరామాభ్యాం తత్రాహం ద్వాపరే యతః, తేన యాదవశైలోఽయ మితి లోకేషు కథ్యతే"** అని నారద పురాణంలోని భగవదుక్తి. శ్రీకృష్ణబలరాములు ద్వాపర యుగంలో తాము ఆరాధించే శెల్వనారాయణస్వామి ఉత్సవమూర్తిని ఇక్కడకు తీసికొనివచ్చి ప్రతిష్ఠించారని, యాదవులైన వారిచే ఇక్కడమూర్తి ప్రతిష్ఠింపబడి నందున ఈ గిరికి **"యాదవగిరి"** అనే పేరు వచ్చిందని నారదీయపురాణ కథనం. **"మయా పురా సృష్టః శైలో మద్వదచంచలః, మద్రూపైః పాపరహితైః పుణ్యైక నిలయస్సదా, పద్మకూట ఇతి ఖ్యాతః సజ్జనైకసమాశ్రయః, కావేర్యా ఉత్తరే తీరే యోజనే వినివేశితః, త్రిక్రోశకృతవిస్తారః క్రోశేనైకేన చోన్నతః"** అనే కాశీమాహాత్మ్యాంతర్గత యాదవగిరి మాహాత్మ్యవచనంవల్ల ఈ గిరికి పద్మకూటమనే పేరు ఉన్నదని తెలుస్తున్నది. ఈ పర్వతానికి పుష్కర, పద్మశేఖర, ఆనందమయం, యాదవగిరి అనే నామాలు వరుసగా కృతయుగాది నాల్గు యుగాలలో ఉన్నట్లు తెలుస్తున్నది. **"అస్య నామాని ఖ్యాతాని పురాణేషు పృథక్ పృథక్, పుష్కరస్తు కృతే బ్రహ్మన్! త్రేతాయాం పద్మశేఖరః, ద్వాపరే చ మహాభాగ! హ్యానందమయ నామవాన్, కలౌ చ యాదవగిరిః"** అని కాశీమాహాత్మ్యసూక్తి. ఈ పర్వతంపై లక్ష్మీదేవి **"అహి"** అనే రాక్షసుని సంహరించి, బ్రహ్మదేవుని ప్రార్థనపై ఇక్కడే భగవానునితోపాటు వేంచేసి

ఉన్నందున దీనికి **"ఇందిరాక్షేత్ర"**మనే పేరు కల్గినట్లు కాశీమాహాత్మ్యంలో తెలుపబడిన యాదవగిరిమాహాత్మ్యంవల్ల తెలుస్తున్నది. **"యదుభూధరమాశ్రిత్య తేనైతత్ క్షేత్రముత్తమమ్, ఇందిరాక్షేత్ర ముద్దిష్టం సర్వసంపత్ప్రవర్ధనమ్, సహస్రశిఖర స్సోஉయం సాక్షాచ్ఛేషాత్మకో గిరిః"** అని అందలిసూక్తి. ఈ పర్వతం సాక్షాత్తు ఆదిశేషుని రూపమేననికూడా నారదపురాణ కథనం. భగవద్రామానుజులు చోళరాజువల్ల కల్గిన ఉపద్రవం కారణంగా ఇక్కడ సుమారు 12 సం॥ల పాటు వేంచేసి ఉన్నందున **"యతిశైల"**మనే ప్రసిద్ధి కూడా దీనికి శ్రీవైష్ణవసంప్రదాయంలో ఉన్నది. **"కలౌ యుగే తు సంప్రాప్తే యతినా పూజిత స్తతః యతిశైలమితి ప్రోక్తం నామధేయాంతరం స్మృతమ్"** అని సాత్త్వతసంహితా వచనం, శ్రీరంగం భోగమంటపమని, తిరుమల పుష్పమంటపమని, హస్తిగిరి (కంచి) త్యాగమంటప మని ప్రసిద్ధి ఉన్నట్లే తిరునారాయణపురానికి **"జ్ఞానమంటప"**మనే పేరున్నట్లు పాంచరాత్రానికి చెందిన జయాఖ్యసంహిత తెల్పుతున్నది. క్రీ.శ.1458 సం॥లోని శాసనంలో దీని ప్రసక్తి కూడా గోచరిస్తున్నది. తిరునారాయణపురంలోని ఆలయంలో ఆరాధన, ఉత్సవాదులన్నీ ఈశ్వర (సాత్త్వత) సంహితప్రోక్త క్రమానుసారంగా నిర్వహింపబడుతున్నాయి.

**"మేల్కోటై"** అనే పదానికి కన్నడంలో పైన ఉండే కోట (**మేల్ = పైభాగం, కోటై** = కోట- అని అర్థం.) ఈ ప్రాంతం సహజంగానే పర్వతపైభాగంలో ఉన్నది కదా. అంతేకాక, ఇక్కడ కోటయొక్క అవశేషాలుకూడా ఈనాటికీ గోచరిస్తున్నాయి. మేల్కోటకు సమీపంలో గల తొండనూర్ చాలా అధఃప్రాంతం. చాలా పల్లంలో ఉండే చోటు) కనుక, అది హోయసల ప్రభువులకు రాజధాని అయినందున, ఎత్తుగా ఉండే ప్రదేశమైన తిరునారాయణపురానికి **"మేల్కోటై"** అనే పేరు వచ్చింది అని, ఈ పేరును దీనికి భగవద్రామానుజుల కాలంలో హోయసల ప్రభువైన విష్ణువర్ధనుడు పెట్టాడని సాంప్రదాయికమైన ప్రసిద్ధి. ఈ పేరు క్రీ.శ. 1337 సంలో వ్రాయబడిన ఒక శిలాశాసనంలో ఉట్టంకింపబడింది. ఈపేరు ద్రావిడనామంగా కూడా గ్రహించి వివరింపబడుతున్నది. మేల్కోటై ప్రాంతం ద్రావిడదేశానికి పడమటి దిశలో ఉన్నందున, తమిళంలో **"మేఱ్కు"** అంటే పడమర దిక్కు అని, **"కోటై"** అంటే కోట- అని అర్థం కనుక, చోళరాజ్యానికి పడమటి దిక్కులో గల ప్రాంతానికి **"మేల్కోటై"** అనే పేరు వచ్చిందనికూడా వివరింపబడింది.

భూలోకవైకుంఠమనే పేరు క్రీ.శ. 1582 సంలోని శిలాశాసనంలో కన్పిస్తున్నది.



వైకుంఠవర్ధనక్షేత్రమనే నామం యాదవగిరిమాహాత్మ్యంలో గోచరిస్తున్నది. ఈ పేరు క్రీ.శ. 1416సం॥లో వ్రాయబడ్డ శాసనంలో కూడా ఉన్నది.

దక్షిణబదరికాశ్రమమనేకూడా ఈ క్షేత్రానికి ఉన్నది. తిరునారాయణపురం లోని ఆలయానికి ఎదురుగా బదరీవృక్షం (రేగుచెట్టు) ఉండడం కూడా గమనించవచ్చు. ఈ నామప్రసక్తి మాత్స్యపురాణంలో కన్పిస్తున్నది కూడా. క్రీ.శ.1458వ సంలోని శాసనంలో ఈ పేరు ప్రస్తావింపబడింది.

ఇక, **"దొడ్డగరుడనహళ్ళి"** అనే నామం కన్నడభాషలోని పేరు. శ్రవణ బెలగోలకు చెందిన చారిత్రకప్రమాణాలనుబట్టి ఈ పేరు తిరునారాయణపురానికి ఉన్నట్లు తెలుస్తున్నది. ప్రాణం పోయే చివరి క్షణంవరకు ప్రభువుకోసం పోరాడే యోధునకు గరుడుడనే పేరు వ్యవహరింపబడేదని, విష్ణువర్ధన ప్రభువు సైన్యంలో ఉండే గరుడునివంటి గొప్ప వీరులు ఈ ప్రాంతంలో నివసించినందున దీనికి ఈ పేరు వచ్చిందని అంటారు. ఇదేవిధంగా **"దొడ్డగురుగలహళ్ళి"** అనే పేరు గొప్ప ఆచార్యులైన భగవద్రామానుజులు ఇక్కడ వేంచేసి ఉన్నందున కల్గినట్లు తెలుస్తున్నది. ఈ పేరు కన్నడ జానపదసాహిత్యంలో ప్రసిద్ధిచెందింది. (**"దొడ్డగురు"** అంటే గొప్పగురువు).

ఇపుడు యాదవగిరి మాహాత్మ్యంలోని ఈ క్షేత్రానికి సంబంధించిన కొన్ని విశేషాలు ప్రస్తావింపబడుతున్నాయి.

## వ్యాసాది మహర్షులు బదరికాశ్రమంలోని నారాయణుని ప్రశ్నించడం :

వ్యాసుడు, వసిష్ఠుడు, కపిలుడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు మొదలైన పలువురు మహర్షులు పూర్వం ఒకానొక సమయంలో బదరికాశ్రమంలో తపస్సు చేసికొంటూ వేంచేసి ఉండే నారాయణుని సన్నిధిని చేరి- **"భగవన్! దేవదేవేశ! నమో నారాయణాయ తే... కలిరద్య మహీం సర్వామాక్రమ్య ఖలు వర్తతే, అతస్తద్దోషనిర్ముక్తం స్థానం త్వం వక్తు మర్హసి"** - (భగవన్! దేవదేవేశ! నారాయణా! నీకు నమస్కారం. ఇపుడు కలి ఈ భూమిలో అంతటా ఆక్రమించాడు. ఆ కలిదోషం సోకని చోటును మాకు నీవు తెలియజేయాలి) అని ప్రార్థించగా, అపుడు నారాయణుడు - **"అస్తి దక్షిణదేశీయః కశ్చిదాస్తికసంశ్రయః, నారాయణగిరి ర్నామ సంసారార్ణవతారకః"** - (దక్షిణ దేశంలో ఆస్తికులకు నిలయమైనది, సంసారసముద్రం

నుండి దాటించేది అయిన నారాయణగిరి అనేది ఉన్నది) అని ఆరంభించి ఆక్షేత్ర మహిమను క్లుప్తంగా పలికాడు. అపుడు మహర్షులు ఆ క్షేత్రమహిమను ఇంకా వివరించమని ప్రార్థించగా క్షేత్రవైభవాన్ని తెలుపగలవాడు నారదమహర్షియే అని, త్వరలో అతడు ఇచటికి రాగలడని పల్కి భగవానుడు అంతర్ధానుడయ్యాడు. ఆ రీతిలోనే నారదమహర్షి అక్కడకు రాగా మహర్షులు అతనిని యాదవాచల క్షేత్రమహిమను విస్తృతంగా తెలుపమని అతనిని అడిగారు. నారదమహర్షి అపుడు యాదవాచల క్షేత్రమహిమను వారికి వివరించాడు.

## తిరునారాయణస్వామి మూలమూర్తి ఆవిర్భావవృత్తాంతం :-

ప్రళయసమయంలో జీవులందఱు చిరకాలం అచేతనప్రాయులై, ప్రకృతిలో లీనమై ఉండడాన్ని చూచిన పుండరీకాక్షుడైన భగవానునకు - **"కరుణా కాఽప్యజాయత"** అనే రీతిలో ఆకస్మికమైన కృప కల్గింది. ఆ విధంగా కృపావిశిష్టుడైన భగవానుడు జీవులకు కరణకళేబరప్రదానాన్ని చేసి, వారిని ధర్మాచరణంలో ఆసక్తిని కలవారినిగా చేయాలని తలచి, సృష్టిని ఆరంభించాడు. ముందుగా బ్రహ్మాండాన్ని సృష్టించి అందులో తన నాభికమలంనుండి ఉద్భవించిన చతుర్ముఖ బ్రహ్మకు ప్రణవంతో కూడిన అష్టాక్షరీ మహామంత్రాన్ని, దానితోపాటు నాల్గు వేదాలను ఉపదేశించి, బ్రహ్మాండంలో వ్యష్టిసృష్టిని చేయడానికి అధికారాన్ని ప్రదానం చేశాడు.

ఈసందర్భంలో భగవానుడు బ్రహ్మకు నారాయణనామవైభవాన్ని, అష్టాక్షరీ మంత్రప్రభావాన్ని ఈక్రింది విధంగా ఉపదేశించాడు.

"ఇదం హి శుద్ధిర్వచసాం శ్రుతీనామవలంబనమ్, సూరీణామపి సర్వేషాం కర్ణేష్వమృతసేచనమ్, నారాయణపదం యస్య జిహ్వాగ్రే వర్తతే సదా, నారాయణః శ్రియా సార్ధం నైవ ముంచతి తం క్షణమ్, అర్థం వినాఽపి శబ్దోఽ యం త్రాయతే మహతో భయాత్, కిం పునః జ్ఞాయమానార్థః కృతినాం పాదసేవయా, ఆపో హి నారశబ్దార్థాః నారా విష్ణోః సముద్భవాః, అయనం తా యదస్యాసం స్తేన నారాయణః స్మృతః, నారం సరోరుహం ప్రోక్తం జ్వలద్యోనిమయం పురా, యస్య నాభౌ సముత్పన్నం స వై నారాయణః స్మృతః, అక్షరత్వాన్నరా జీవా నారా స్తేషాం సముచ్చయః, తేషామయనతాం యాతి తేన నారాయణః స్మృతః, నరశ్చ భగవాన్ విష్ణుః తజ్జా స్తద్యోగినోఽపి వా, నారా స్తస్యాయనం వ్యాప్యం తేన నారాయణః స్మృతః, అథవా నేతృభూతోఽయం నరో నారం చరాచరమ్, వాసస్థానమిదం



తస్య తేన నారాయణః స్మృతః, జ్ఞానశక్త్యాదయో యద్వా గుణా నారా ఇతి స్మృతాః, షాడ్గుణ్యపరిపూర్ణోఽయం తేన నారాయణః స్మృతః."

**(యాదవగిరిమాహాత్మ్యం - ద్వితీయాధ్యాయం)**

(ఈ నారాయణ నామం వాక్కులకు పవిత్రతను కల్గిస్తుంది, వేదాలకు ఆలంబనమైనది. పండితులందఱి చెవులకు అమృతసేచనం. ఎవరి జిహ్వాగ్రంలో నారాయణనామం ఎల్లప్పుడు ఉంటుందో అతనిని లక్ష్మీసహితుడైన నారాయణుడు ఒక్కక్షణం కూడా విడువడు. అర్థం తెలియక పోయినా నారాయణ శబ్దం మాత్రమే గొప్ప భయంనుండి రక్షిస్తుంది. ఇక మహాత్ముల పాదసేవవల్ల అర్థాన్ని గ్రహిస్తే చెప్పవలసినది ఏమున్నది? (1) విష్ణువునుండి పుట్టిన జలాలు నారశబ్దంచేత వ్యవహరింపబడుతున్నాయి. ఆ నారాలు ఈ విష్ణువునకు అయనం అంటే- వాసస్థానం. కనుక ఇతడు నారాయణుడనబడుతున్నాడు. (2) జ్వలించే యోనిరూపమైన నాభీపద్మం (నీటినుండి పుట్టినది కనుక) నారమని చెప్పబడుతున్నది. అది విష్ణువు నాభిలో పుట్టినది కనుక అతడు నారాయణుడు (నారానికి నాభీపద్మానికి- ఆధారభూతుడు) అని అనబడుతున్నాడు. (3) నరులు (జీవులు) నశింపనివారు కనుక నరశబ్దవాచ్యులు. నారాలంటే జీవసమూహం. ఆ నారాలకు- అంటే - జీవసమూహానికి ఆధారభూతుడు. కనుక భగవానుడు నారాయణుడనబడుతున్నాడు. (4) నరుడంటే భగవానుడైన విష్ణువు. అతని నుండి పుట్టినందువల్ల కాని, అతని సంబంధాన్ని కల్గి ఉన్నందువల్లగాని చిదచిత్తులు నారాలనబడుతున్నాయి. అవి అతనికి అయనాలు - అంటే - వ్యాప్యాలు కనుక భగవానుడు నారాయణుడనబడుతున్నాడు. (5) లేక, నరుడంటే నేత అయిన భగవానుడు. నారమంటే చరాచరసమూహం. ఇది ఆ భగవానునకు వాసస్థానం కనుక నారాయణుడనబడుతున్నాడు. (6) జ్ఞానం, శక్తి మొదలైన ఆఱు గుణాలు నారాలనబడుతున్నాయి. ఈ నారాలనబడే షాడ్గుణ్యంతో పూర్ణుడు కనుక భగవానుడు నారాయణుడనబడుతున్నాడు.)

## భగవానుడు ఉపదేశించిన అష్టాక్షరీమంత్రమహిమ

"తతః ప్రసాదసంపుల్లలోచనః పద్మలోచనః, అష్టాక్షరస్య మంత్రస్య ప్రభావమపి చాబ్రవీత్, బ్రహ్మన్నష్టాక్షరో మంత్రః శ్రుతీనాం దృష్టిరిష్యతే, ధర్మార్థకామమోక్షాణాం చతుర్ణామపి సాధనమ్, కృతం బహువిధైః మంత్రైః కృతం యంత్రైః నియంత్రితైః, కృతం చ కర్మణాం తంత్రైః యత్రాష్టాక్షరసన్నిధిః, సాధారణో హ్యయం మంత్రః సర్వాస్వపి చ మూర్తిషు, అన్యానుకూలతాం యాంతి మూర్తి మంత్రాః

సహస్రశః, వ్యాపకేష్వపి మంత్రేషు త్రిష్వప్యేష పరో మతః, వ్యాప్యవ్యాపకయో రత్ర విశేషేణావబోధనాత్, తతో హి విష్ణుగాయత్ర్యా మాద్యోఽయం మంత్ర ఉచ్యతే, మంత్రోఽయం సద్గురోరేవ శ్రోతవ్యో నాన్యతోఽపి చ, న ఖల్వంధస్య జాత్యంధః ప్రదాతుం యష్టిమర్హతి, యథా మే శ్రీనివాసత్వ మసా ధారణ మిష్యతే, తథా నారాయణపదం త్రయ్యంతేషు నిగద్యతే, నారాయణపదం లోకే నామ యస్య ప్రకీర్త్యతే అపవర్గో హి తన్మాతు రయత్నాదేవ సిద్ధ్యతి."

**(యాదవగిరిమాహాత్మ్యం - ద్వితీయాధ్యాయం)**

(తరువాత, కరుణతో విచ్చిన కన్నులను కలవాడు, పద్మనయనుడు అయిన భగవానుడు అష్టాక్షరీ మంత్ర ప్రభావాన్ని ఈ విధంగా బ్రహ్మకు తెలిపాడు.

అష్టాక్షరీ మంత్రం వేదాలకు నేత్రంగా చెప్పబడుతున్నది. ధర్మార్థకామ మోక్షాలనే నాల్గు పురుషార్థాలకు ఇది సాధనం. అష్టాక్షరీమంత్రం ఉంటే ఇక పలు విధాలైన మంత్రాలతో పనిలేదు. పలు విధాలైన నియంత్రింపబడిన యంత్రాలతో పనిలేదు. పలు నియమాలతో కూడిన ప్రయత్నాలతో పనిలేదు. ఈ మంత్రం అన్ని మూర్తులకు సాధారణం. వేలాది మూర్తిమంత్రాలు ఈ నామం పట్ల ఆనుకూల్యాన్ని పొందుతున్నాయి. (వ్యాప్యవ్యాపక మంత్రాల అర్థం కూడా దీని ద్వారా తెలియబడుతున్నందున) వ్యాపకమంత్రాలు మూడింటిలో ఇది గొప్పది. ఈ మంత్రాన్ని సదాచార్యుని సన్నిధిలోనే వినాలి. వేఱొకరివల్ల వినరాదు. అంధునకు ఇంకొక జాత్యంధుడు చేతికర్రను ఊతంగా ఇవ్వలేడుకదా. లక్ష్మీపతిత్వం ఏవిధంగా భగవానుని అసాధారణ లక్షణమో, ఆ రీతిలోనే ఈ నామం భగవానునకు అసాధారణం. ఈ నారాయణనామం వేదాంతాలలో పఠింపబడుతున్నది. ఎవరి పేరు నారాయణనామంతో కీర్తింపబడుతున్నదో అతని తల్లికి మోక్షం అప్రయత్నంగా సిద్ధిస్తుంది.)

భగవానుడనుగ్రహించిన నాల్గు వేదాలను బ్రహ్మ తన నాల్గు ముఖాల ద్వారా అనుసంధిస్తూ, తద్ద్వారా కల్గిన విజ్ఞానం ద్వారా సృష్టికార్యాన్ని నిర్వహించ సాగాడు. నిత్యం తాను ఆరాధించుకోవడానికి వీలుగా తనకొక అర్చామూర్తిని అనుగ్రహింపవలసినదిగా ఒకనాడు భగవానుని అతడు ప్రార్థించగా, అపుడతని చెవులకు ఒక మంగళవాద్యధ్వని విన్పించింది. బ్రహ్మ తన కళ్ళను తెఱచి చూచాడు. కంటికి ఎదురుగా ఒక దివ్యవిమానం సాక్షాత్కరించింది. అందులో ఒక దివ్యమైన భగవదర్చామూర్తి గోచరించింది. అదే -తిరునారాయణస్వామి మూర్తి, ఆ మూర్తితో కూడి ఉండే ఉన్నతమైన ఆనందమయ దివ్యవిమానం. ముందుభాగంలో మంగళవాద్యాలను మోగించేవారు సాగుతూ ఉండగా, అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులు మార్గదర్శకులై నడుస్తూ ఉండగా, మఱికొందఱు దివ్యసూరులు ఛత్రచామరాది రాజచిహ్నాలను ధరించి ఉపచారాలను చేస్తూ ఉండగా ఆ ఆనంద మయదివ్యవిమానానికి మధ్యలో కుడివైపున శ్రీసుదర్శనమూర్తిని, ఎడమవైపున లక్ష్మీదేవిని కల్గిన శ్రీమన్నారాయణమూర్తి బ్రహ్మదేవునకు దర్శనమిచ్చాడు. ఎంతో ఆనందించిన బ్రహ్మ ఆ స్వామిని పలు రీతులలో స్తుతించాడు. అపుడు ఆ స్వామి **"అభ్యర్చ్య మామిహ బ్రహ్మన్! యుగానా మయుతం భవాన్, కారయిష్యసి పుత్రాద్యైః వసుధాయాం మమార్చనమ్"** అని అంటూ భూలోకంలో జరుగబోయే తన ఆగమనాన్ని సూచించాడు. ఆ అర్చామూర్తిని తన ధర్మపత్ని సరస్వతితో కలసి సత్యలోకంలో చిరకాలం ఆరాధించాడు.

## తిరునారాయణస్వామి అర్చామూర్తి భూలోకానికి వేంచేయడం :

ఒకానొక సమయంలో సనత్కుమారుడు బ్రహ్మవద్దకు వచ్చి, **"దేవం నారాయణం భక్త్యా భవతాఽర్చిత మర్చితుమ్, అతో మే దేహి దివ్యం తత్ విమాన మతులం ప్రభో!"** అని అంటూ బ్రహ్మ ఆరాధించే భగవదర్చామూర్తిని ఆరాధించడంకోసం తనకు అనుగ్రహించమని అర్థించాడు. బ్రహ్మమొదట భగవద్విశ్లేషానికి సందేహించినా చివరకు సనత్కుమారునకు ఆ అర్చామూర్తిని ఇచ్చాడు. అపుడు అతని మనస్సులోని సంకోచాన్ని గమనించి భగవానుడు **"మా విషీద మహాభాగశేఖరాయ ప్రయచ్ఛ మామ్, ఇదం మే రూప మన్యత్తే దదామి హృదయోద్భవమ్"** అని అంటూ అతనిని విచారించవద్దని, సనత్కుమారునకు ఆమూర్తిని ప్రదానం చేయమని పల్కి, అతనికి శ్రీభూదేవులతో కూడిన అందమైన ఉత్సవమూర్తిని తన హృదయంనుండి సృష్టించి బ్రహ్మకు ఇచ్చాడు. తరువాత బ్రహ్మదేవుడు సనత్కుమారునితో **"అస్తి సహ్యగిరేః పూర్వః పుణ్యః కశ్చన భూధరః, శుద్ధసత్త్వమయీ తత్ర దృశ్యతే శుభమృత్తికా, తత్రైతత్ స్థాపయిత్వా త్వం విమానం వత్స! వైష్ణవమ్, నారాయణపదాంభోజపరిచర్యాపరో భవ"** అని పల్కి, తాను ఇచ్చిన ఆ అర్చామూర్తిని భూలోకంలోని పవిత్రమైన యాదవగిరిపై ప్రతిష్ఠించమని పలికాడు. అతడు అదేవిధంగా ఆ మూర్తిని భూలోకానికి తీసికొనివచ్చి, కొంతకాలం మేరుపర్వతశిఖరంపై, తరువాత కైలాసపర్వతంపై, అనంతరం హిమవత్పర్వత

ప్రాంతంలో గల బదరీకాశ్రమంలో నిలిపి ఆరాధించాడు. తరువాత, అతిపవిత్ర ప్రదేశంగా బ్రహ్మచే చెప్పబడిన ప్రాంతం దక్షిణభారతంలో ఉన్నదని స్మరించిన అతడు ఆనందమయవిమానంతోపాటుగా తిరునారాయణమూర్తిని ఉత్తరబదరినుండి తీసికొనివచ్చి కల్యాణతీర్థం, అష్టతీర్థాలను కల్గిన, వేదాద్రి అనే పేరును కల తిరునారాయణపురంలో (మేల్కోటెలో) తూర్పుముఖంగా ప్రతిష్ఠించాడు. బ్రహ్మ లోకంలో పంచలక్షయోజనాల ప్రమాణంతో ఉండే ఆ ఆనందమయవిమానం అపుడు యాదవగిరిపై అత్యాశ్చర్యకరంగా పంచపురుషప్రమాణ మాత్రంగా పరిణమించింది.

## యాదవాద్రిపై శ్రీరాముడు తిరునారాయణమూర్తిని ఆరాధించడం :

శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలసి వనవాసం చేసే సమయంలో లక్ష్మణుడు యాదవగిరి ప్రాంతంలో సంచరిస్తూ అక్కడ ఉండే కల్యాణతీర్థాన్ని, ఆనందనిలయవిమానంలో వేంచేసి ఉండే తిరునారాయణమూర్తి దర్శించి, ఆ విషయాన్ని శ్రీరామునితో **"అస్త్యేతస్య గిరేరగ్రే సరో మానసనిర్మలమ్, తస్య చాస్తి తటే దివ్యం విమానం సుమనోహరమ్, మధ్యే విమానం మహితా విష్ణోర్మూర్తిశ్చ దృశ్యతే, సమాభ్యధికనిర్ముక్తం తస్యాః సౌందర్యమీక్ష్యతే, భవతా సదృశం తస్య మయా రూపం విలోక్యతే, యది తే ద్రష్టు మిచ్ఛాస్తి భవాన్ వీక్షితు మర్హతి"** (ఈ పర్వతానికి అగ్రభాగంలో మానససరస్సువలె నిర్మలమైన ఒక సరస్సును, దాని తీరంలో ఒక అందమైన విమానాన్ని చూచాను. ఆ విమానంలో ఒకానొక అందమైన అర్చామూర్తి దర్శనమిస్తున్నది. ఆ మూర్తిరూపం నీ రూపంతో పోలి ఉన్నది. సాటి లేని మేటి అందాన్ని కల ఆ మూర్తిని దర్శించాలనే కోరిక నీకు ఉంటే దర్శించవచ్చు) అని అన్నాడు. అపుడు శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలసి కల్యాణసరస్తీరంలో విలసిల్లే తిరునారాయణమూర్తిని సేవించి, కొన్ని మాసాలపాటు అక్కడే ఉండి ఆ మూర్తిని అర్చించాడు ఈవిధంగా తిరునారాయణస్వామి మూలమూర్తి కూడా శ్రీరామునిచే అర్చింపబడినవాడే.

## తిరునారాయణపురంలోని ఉత్సవమూర్తి ఆవిర్భావ వృత్తాంతం :

బ్రహ్మ తాను నిత్యం ఆరాధించే తిరునారాయణమూర్తిని ఆనందమయ విమానంతో పాటుగా సనత్కుమారునకు ఇచ్చిన తరువాత భగవానుని విశ్లేషానికి చాలా వ్యాకులాన్ని పొందాడు. అతని విచారాన్ని గమనించిన భగవానుడు తన హృదయంనుండి శ్రీదేవి, భూదేవులతో కూడిన ఇంకొక తామ్రమయమైన



అర్చావిగ్రహాన్ని సృష్టించి బ్రహ్మకు ఇచ్చాడని పూర్వోక్తమే కదా ! ఆ శెల్వనారాయణ మూర్తి ఉత్సవ విగ్రహాన్ని బ్రహ్మ ప్రతిదినం సరస్వతీ, సావిత్రీ దేవులతో కలసి భక్తిశ్రద్ధలతో ఆరాధిస్తూ వచ్చాడు. త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు తన పట్టాభిషేకం తరువాత తాను నిత్యం ఆరాధించే కులధనమైన శ్రీరంగనాథుని అర్చామూర్తిని తన ప్రియభక్తుడైన విభీషణునకు కానుకగా ఇచ్చాడు. తన నిత్యారాధనకోసం వేఱొక అర్చామూర్తి లేదని శ్రీరాముడు తలచే ఆ సమయంలో బ్రహ్మ అచటకు వచ్చి పూర్వం భగవానుడు తనకు అనుగ్రహించిన తామ్రమయ మైన, శ్రీభూసహితమైన శెల్వనారాయణస్వామి అర్చామూర్తిని శ్రీరామునకు సమర్పించాడు. ఆ మూర్తిని శ్రీరాముడు అత్యంతం ప్రీతితో ఆరాధించాడు. అందువల్ల ఆ ఉత్సవతామ్రమూర్తికి **"శ్రీరామప్రియ"** అనే నామం కల్గింది. ఈ వివరాలు అన్నీ నారదపురాణోక్త యాదవగిరి మహాత్మ్యంలోని- **"విప్రయోగాసహత్వేన విధావన్తర్విషీదతి, భగవాన్ పుండరీకాక్షో భక్తవాత్సల్యవారిధిః, అమృతస్యందిభిః వాక్యైరాహ పంకజసంభవమ్, ఇదం రూప మన్యత్తే దదామి హృదయోద్భవమ్, ఇత్యుక్త్వా కమలాకంఠభూషణాంకన శాలినా, కరేణ కాంతరూపం తత్ దదౌ పుత్రాయ వేధసే, తతః ప్రీతమతిః బ్రహ్మా తరుణం రూపమద్భుతమ్, సహితం పద్మయా భూమ్యా సముత్థాయ సమాదదే".... "విభీషణే గతే రామో రంగనాథే చ దూరగే, విషీదన్నివ తత్రత్యైః పౌరైః క్షణ మదృశ్యత, అత్రాంతరే విమానేన బ్రహ్మలోకాదుపాగతః, అబ్రవీత్ రఘుశార్దూలం బ్రహ్మా లోకపితామహః, నారాయణాచలస్థేన కాకుత్స్థకులనందన ! అర్చితస్స త్వయా పూర్వం విష్ణోరంశోఽ య మద్భుతః, మా విషీద గృహాణ త్వం రూపమేతన్మయాఽర్చితమ్, సహసోత్థాయ పరయా భక్త్యా కౌతుహలాన్వితః, గృహీత్వా రఘునాథస్తాం మూర్తిం పద్మాసనార్చి తామ్"** ఇత్యాది శ్లోకాలవల్ల తెలుస్తున్నది.

బ్రహ్మదేవునివల్ల తనకు లభించిన ఉత్సవ మూర్తిని గమనించిన శ్రీరాముడు ఆ ఉత్సవమూర్తిరూపం తాను పూర్వం యాదవాద్రిపై ఆరాధించిన మూల మూర్తితో పోలి ఉండడాన్ని గమనించి లక్ష్మణునితో "లక్ష్మణా ! నేను పూర్వం అరణ్యంలో యాదవాద్రిపై ఆరాధించిన మూర్తి, ఈ మూర్తి రెండూ ఒకటే సందేహం లేదు'' అని అన్నాడు శ్రీరాముని మాటలను విని అక్కడే ఉన్న హనుమానుడు ఆ మూర్తి ఎక్కడ ఉన్నది? అని అడిగాడు. లక్ష్మణుడు ఆ మూర్తి యాదవాద్రిపై ఉన్నది- అని అన్నాడు. వెంటనే హనుమంతుడు యాదవాద్రికి పోయి అక్కడ వేంచేసి

ఉండే తిరునారాయణమూర్తిని సేవించి తిరిగి వచ్చి శ్రీరామునితో ఆ రెండు మూర్తులు సామ్యాన్ని కల్గి ఉన్నాయని అన్నాడు. శ్రీరాముడపుడు **“యథా మాం సేవసే వీర! తథా తత్రాపి సేవయ, కాలే కాలే చ లక్ష్మీశం పరితోషయ మారుతే!”** అని అంటూ నన్ను సేవించినట్లే ఆ అర్చామూర్తిని సేవించమని హనుమంతునితో పలికాడు. శ్రీరాముని ఆజ్ఞను అనుసరించి ఈనాటికీ ఆంజనేయుడు యాదవాద్రిపై తిరునారాయణస్వామిని సేవిస్తున్నాడు. **“నియోగం రఘునాథస్య ధారయన్ పవనాత్మజః, అద్యాపి కురుతే సేవా మాంజనేయస్తు తద్గిరా”** అని అంటూ ఈ విషయాన్ని నారదపురాణంలోని యాదవగిరి మాహాత్మ్యం తెల్పుతున్నది.

## శెల్వనారాయణమూర్తి అర్చావిగ్రహాన్ని శ్రీకృష్ణుడు ఆరాధించడం :

శ్రీరామచంద్రుడు తన అవతార సమాప్తి సమయంలో **“అన్దు శరాశరజ్గళై వైకున్దత్తు ఏ*ఱ్ఱి*”** అనే, **“నఱ్పాల్ అయోత్తిల్ వా*ఴు*మ్ శరాశరమ్ ము*ఱ్ఱ*వుమ్ నఱ్పాలుక్కుయ్త్తనన్”** అని చెప్పబడినట్లుగా అయోధ్యలోని చరాచరాలను అన్నిటిని పరమకృపతో శ్రీవైకుంఠానికి చేర్చాడు. ఆంజనేయస్వామిమాత్రం **“స్నేహో మే పరమో రాజన్ ! త్వయి నిత్యం ప్రతిష్ఠితః, భక్తిశ్చ నియతా వీర ! భావో నాన్యత్ర గచ్ఛతి”** అని అంటూ ఈ లీలావిభూతిలోనే ఉంటూ శ్రీరామకల్యాణగుణానుభవాన్ని పొందాలని ఆశపడ్డాడు. అపుడు శ్రీరాముడు తన ప్రతినిధిగా తాను నిత్యం ఆరాధించే శెల్వనారాయణస్వామి అర్చామూర్తిని హనుమానునకు ఇచ్చాడు. **“సిషేవే రఘునాథ స్తాం మూర్తిం విష్ణోర్ముదాన్వితః, సాకం లక్ష్మ్యా చ భూమ్యా చ సాకేతకుల దైవతమ్, చరాచరం యదా నైషీద్దివ్యం ధామ స రాఘవః, తదా హనుమతో హస్తే ప్రాదాదాదిమదైవతమ్”** అనే యాదవగిరిమాహాత్మ్యవచనాలు ఈ వృత్తాంతాన్ని తెల్పుతున్నాయి.

## శెల్వనారాయణస్వామిని శ్రీకృష్ణుడు అర్చించడం :

శ్రీరామచంద్రుడు అనుగ్రహించిన శెల్వనారాయణ స్వామి ఉత్సవవిగ్రహాన్ని హనుమానుడు కొంతకాలం అర్చించి, తరువాత దానిని శ్రీరాముని పుత్రుడైన కుశునకు ఇచ్చాడు. కనకమాలిని యదువంశంలో జన్మించిన యదుశేఖరుడనే రాజును వివాహమాడడంవల్ల శెల్వనారాయణస్వామిమూర్తి ఆమెతోపాటు యదువంశాన్ని చేరింది. పరంపరగా యాదవరాజులచేత ఆరాధింపబడిన ఆ అర్చామూర్తిని ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుకూడా ఆరాధించాడు. వసుదేవుని



భవనంలో పూజింపబడిన శెల్వనారాయణస్వామి శ్రీకృష్ణుడు అవతారంనుండి ప్రదర్శించిన దివ్యలీలలను అన్నిటిని వీక్షిస్తూ ఆనందించాడు. **“యదువంశ క్రమేణాథ భగవాన్ భక్తవత్సలః, వసుదేవస్య భవనే వాసం చక్రే తతః పరమ్”** ఇత్యాది యాదవగిరి మాహాత్మ్యవచనాలు దీనిని తెల్పుతున్నవి.

## వజ్రకిరీట వృత్తాంతం :

ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు. అతడు తండ్రివలె విష్ణుభక్తుడు. ఒకానొక సందర్భంలో అతడు క్షీరసాగరంలో యోగనిద్రలో శయనించి ఉండే భగవానుని సేవించడానికి వెళ్ళాడు. అక్కడ భగవానుని సేవిస్తూ ఉండే మునులు యోగనిద్రలో ఉండగా, కాలవశంచేత దుర్బుద్ధిని పొందిన విరోచనుడు భగవానుని శిరస్సును అలంకరించే దివ్యవజ్రకిరీటాన్ని అపహరించి, అక్కడనుండి పాతాళానికి పారిపోయాడు. క్షీరాబ్ధిలోని భక్తులు, మునులు కళ్ళు తెఱచిచూడగా స్వామి శిరస్సుపై వజ్రకిరీటం కన్పించలేదు. విరోచనుడుకూడా అక్కడ కనబడనందున అతడే దానిని అపహరించాడని భావించిన వారు అపుడు అక్కడికి వచ్చిన గరుత్మంతునకు ఆ సంగతిని అక్కడ తెలియజేశారు. అతడు విరోచనుని వెదకుతూ పాతాళలోకాన్ని చేరి, విరోచనునితో పోరాడి జయించాడు. వజ్రకిరీటాన్ని తీసికొని వేగంగా ఆకాశమార్గంద్వారా క్షీరాబ్ధికి తిరిగి వచ్చేటపుడు దారిలో ఒకచోట అతని గమనం నిలచిపోయింది. ఒక అడుగుకూడా ముందుకు పోలేని గరుడుడు ఆశ్చర్యంగా క్రిందికి చూడగా బృందావనప్రాంతంలో శ్రీకృష్ణుడు వేణుగానం చేస్తూ పశువులను మేపుతున్న సన్నివేశం కన్పించింది. వెంటనే కిందకు దిగి గరుడుడు శ్రీకృష్ణుని సేవించి, అతడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడేనని తెలిసికొని తాను తీసికొనివచ్చే వజ్రకిరీటాన్ని అతని శిరస్సుపై అలంకరించాడు. చాలా ఆశ్చర్యకరంగా అంత పెద్ద గొప్ప కిరీటం శ్రీకృష్ణుని శిరస్సుకు సరిపోయింది. గరుడుడు శ్రీకృష్ణుని కీర్తించి, అక్కడనుండి క్షీరాబ్ధిని చేరి జరిగిన వృత్తాంతాన్ని క్షీరాబ్ధిలో వేంచేసి ఉండే అనిరుద్ధునకు విన్నవించాడు.

## మాత్స్యపురాణాంతర్గతమైన వేఱొక కిరీటాహరణవృత్తాంతం :

ఒకానొక సందర్భంలో నారదమహర్షి సుతలమనే అధోలోకానికి పోయి అక్కడ ఉండే బలిచక్రవర్తిచేత పూజింపబడ్డాడు. బలి నారదుని యాత్రా విశేషాలను

అడుగగా, అతడు క్షీరాబ్ధివైభవాన్ని, అక్కడ వేంచేసి ఉండే భగవానుని దివ్యమంగళ విగ్రహసౌందర్యాన్ని, ఆ మూర్తికి అలంకరింపబడి ఉండే దివ్యకిరీటాన్ని వర్ణించి చెప్పాడు. **"కిరీటవరమాహాత్మ్యం కిం వక్ష్యామి మహాబలే !, తత్రైవ వస్తు మిచ్ఛామి గచ్ఛామి"** (దివ్యకిరీటమాహాత్మ్యాన్ని ఏమని చెప్పగలను. "ఓ మహాబలీ ! నేను అక్కడే ఉండాలని అనుకుంటున్నాను అక్కడికి వెడుతున్నాను'') అని అంటూ నారదుడు అక్కడ నుండి వెళ్ళిపోయాడు.

నారదుని మాటలచే ప్రభావితుడైన బలి ఆ దివ్యకిరీటాన్ని పొందాలనే ఉత్సాహంతో క్షీరాబ్ధికి పోయి స్వామిని సేవించి కీర్తించాడు. **"దేవదేవ! సురశ్రేష్ఠ! కిరీటం రత్నభూషితమ్, యాచే నాథాయ నాథస్త్వమ్"** అని కిరీటాన్ని అనుగ్రహించమని ప్రార్థించి దానిని పొంది అక్కడనుండి వేగంగా వెళ్ళిపోయాడు. ఆ సమయంలో గరుడుడు అక్కడ లేడు. తరువాత అక్కడకు వచ్చిన గరుడుడు కిరీటం లేకుండా ఉండే స్వామిని చూచి, **"కిమిదం కిమిదం కేన హృతమ్"** అని కోపంగా ప్రశ్నించి ఆకాశంలోకి ఎగిరి నాల్గు వైపుల చూడగా, కిరీటాన్ని తీసికొనిపోయే బలి కన్పించాడు. గరుడుడు అతనివద్దకు వెళ్ళి అతనితో పోరాడి జయించి కిరీటాన్ని తీసికొని క్షీరాబ్ధివైపు బయలుదేరాడు. దారిలో గోమంతగిరిపై ఋషులతో పాటు ఉండే శ్రీకృష్ణుని దర్శించి అతడే హరి అని గుర్తించి కిందకు దిగి అతనివద్దకు వచ్చాడు. వేలాది ఇంద్రనీలమణులు, వందల కొలది గోమేధికరత్నాలు, పద్మరాగాలు, నీలమణులు, పుష్యరాగాలు, ప్రవాళాలు పొదిగిన, దివ్యమైన బంగారుతో చేయబడిన ఆ కిరీటాన్ని శ్రీకృష్ణుని శిరస్సుపై అలంకరించాడు. ఆ సన్నివేశాన్ని దర్శించిన బ్రహ్మ, మునులు, గంధర్వులు, దేవతలు అందఱు శ్రీకృష్ణుని స్తుతించారు. గరుడుడుకూడా బహుధా శ్రీకృష్ణుని కీర్తించాడు. అపుడు భగవానుడు గరుడునితో తానక్కడ గోమంతక పర్వత ప్రాంతంలో కొంతకాలం ఉండదలచినట్లు, క్షీరసాగరానికి పోయి అక్కడి నుండి తీర్థాన్ని, శ్వేతద్వీపమృత్తికను, కల్పవృక్ష సముదాయాన్ని తీసికొనిరమ్మని ఆదేశించాడు. వెంటనే గరుడుడు కూడా ఆ విధంగానే క్షీరాబ్ధికి పోయి వాటిని శ్రీకృష్ణభగవానుడు వేంచేసి ఉండే గోమంతగిరి ప్రాంతానికి తీసికొనివచ్చాడు. భగవానుడపుడు అక్కడ ఉన్న బ్రహ్మాదులను, మునులను ఉద్దేశించి పల్కుతూ ఇకపై, ఆ గోమంతపర్వతం యాదవాద్రిగా ప్రసిద్ధి చెందుతుందని, క్షీరాబ్ధితీర్థం కల్యాణసరస్సుగా, పిలువబడుతుందని, తాను ఆ పర్వతంపై అర్చారూపంతో నెలకొని ఉంటానని పల్కి అర్చారూపాన్ని పొందాడు.



**"ఇతఃపరం తు హే విప్రాః గోమంతో గిరిసత్తమః, యాదవాద్రిరితి ఖ్యాతో భవిష్యతి న సంశయః, క్షీరాబ్ధితీర్థోఽపి మహాన్ కల్యాణీతి మహత్ సరః,.... అత్రైవ నివసిష్యామి హ్యర్చారూపేణ దేవతాః!"** ఇత్యాది మాత్స్యపురాణవచనాలు ఈ విషయాన్ని తెలుపుతున్నాయి.

తరువాత బ్రహ్మ విశ్వకర్మను పిలచి, అతనిద్వారా ప్రాసాదగోపురాలతో కూడిన దివ్యమందిరాన్ని ఆ అర్చామూర్తి వెలసిన చోట నిర్మింపజేశాడు. ఆ దివ్యమూర్తికి మహోత్సవాన్ని జరిపింపదలచి, అందుకోసం దేవగంగను స్మరించాడు. వెంటనే దేవగంగ గోమంతపర్వతానికి ఉత్తరభాగంలో ధారారూపంలో అవతరించింది. బ్రహ్మాదులు అందులో స్నానం చేసి పరిశుద్ధులయ్యారు. ఉత్సవం నిర్వహించడానికి కావలసిన దివ్యవిమానం లేదని బ్రహ్మ చింతించే సమయంలో "బ్రహ్మదేవా! చింతించకు. వైకుంఠంనుండి దివ్యవిమానం రాగలదు'' అనే ఆకాశవాణి అతనికి వినిపించింది. బ్రహ్మ ఆశ్చర్యంతో పైకి చూడగా మెఱుపువలె ప్రకాశించే గొప్ప, దివ్యరత్నభూషితమైన విమానం అతనికి గోచరించింది. దివ్యమైన ముహూర్తంలో ఆ విమానాన్ని బ్రహ్మ అక్కడ ప్రతిష్ఠ చేశాడు. **"అహో బ్రహ్మవిమానం తదహో యాదవభూధరః, అహోఽతి సుకుమారోఽసౌ దేవో నారాయణః ప్రభుః, అహో నారాయణ క్షేత్రం కల్యాణం చ శుభోదకమ్, అహో గంగా మహాపుణ్యా కల్పభూరుహ ఏవ చ"** అనే కోలాహలాన్ని దేవతలు, మానవులు అంతా ఆశ్చర్యంగా చేశారు. తరువాత బ్రహ్మ **"ఫాల్గునస్యామలే పక్షే నవమ్యామథ కర్కటే, ఆరభన్నుత్సవం బ్రహ్మ దశరాత్రమ్"** అనే రీతిలో ఫాల్గుణమాసం శుక్లపక్షనవమినుండి ఆరంభించి పది దినాలపాటు మహోత్సవాన్ని ఆ అర్చామూర్తికి జరిపించాడు. ఈ విశేషాలన్నీ మాత్స్యపురాణాంతర్గతమైన యాదవగిరి మాహాత్మ్యంలో తెలుపబడ్డాయి. ఈనాటికీ ఈ క్షేత్రంలోని బ్రహ్మోత్సవాలు పంగునిమాసంలో జరగడం విశేషం.

**బలరామశ్రీకృష్ణులు శెల్వనారాయణస్వామి ఉత్సవమూర్తిని యాదవాద్రికి తీసికొనిరావడం :**

శ్రీకృష్ణుడు తన శిరస్సుపై గరుడుడు అలంకరించిన కిరీటాన్ని తాను ఆరాధించే శెల్వనారాయణునకు అలంకరించగా, ఆ మూర్తికి చక్కగా సరిపోయింది. బలరాముడు ఒకానొక సందర్భంలో తీర్థయాత్రా సందర్భంగా నారాయణాద్రికి (యాదవాద్రికి) వచ్చి, కల్యాణతీర్థసమీపంలోని ఆనందమయవిమానంలో వేంచేసి ఉండే తిరునారాయణస్వామి మూలమూర్తిని సేవించాడు. ఆ మూర్తి, తాము నిత్యం

ఆరాధించే శెల్వనారాయణస్వామి మూర్తిని పోలి ఉండడాన్ని గమనించి ఆశ్చర్యపడి, ద్వారకకు తిరిగి చేరిన తరువాత ఆ విషయాన్ని శ్రీకృష్ణునకు, తన బంధువులందఱికి తెలిపాడు. మొదట ఆ విషయాన్ని వారు విశ్వసించలేదు. అపుడు బలరాముడు వారిని అందఱిని నారాయణాద్రికి తీసికొనివచ్చి తిరునారాయణస్వామిని దర్శింపజేయగా, ఆ రెండు మూర్తులు ఒకేవిధంగా ఉండడాన్ని అందఱు గమనించారు. ఆ మూర్తులు రెండు ఒకే చోట వేంచేసి ఉండడం తగినదని భావించిన అందఱు శెల్వనారాయణస్వామి ఉత్సవమూర్తిని కిరీటసహితంగా తీసికొని వచ్చి, తిరునారాయణమూర్తి వేంచేసి ఉండే ఆనందమయ విమానంలో వేంచేపుచేసి, సకలవిధమహోత్సవాలు వైభవంగా జరిగే ఏర్పాట్లను చేశారు. ఈ విధంగా యాదవులైన బలరామకృష్ణులచేతనే కాక, పరంపరగా అందఱు యాదవ ప్రభువులచే ఆరాధింపబడడంవల్ల ఈ పర్వతానికి "యాదవాద్రి" అనే పేరు స్థిరపడింది. ఈ వృత్తాంతం నారదపురాణాంతర్గత యాదవగిరి మాహాత్మ్యంలోని సప్తమాధ్యాయం తెల్పుతున్నది.

## విశ్వామిత్రాది మహర్షులు దర్శించిన తిరునారాయణస్వామి దివ్యరూపం

విశ్వామిత్రాది మహర్షులు దర్శించిన తిరునారాయణస్వామి దివ్యరూపాన్ని యాదవగిరి మాహాత్మ్యం ఈ క్రిందివిధంగా వర్ణించింది.

"తతస్తే మునయ స్సర్వే హర్షోత్ఫుల్లవిలోచనాః, కల్యాణసరసి స్నాత్వా కృత్వా పౌర్వాహ్ణికీః క్రియాః, ఆనందమయమధ్యస్థం నారాయణ మనామయమ్। దదృశు ర్భక్తినమ్రాస్తే సౌందర్యామృతవారిధిమ్, లక్ష్మీలాలితపాదాబ్జం రత్నమంజీరభూషితమ్, ఆబద్ధపీతవసనం బద్ధకౌశేయకోజ్జ్వలమ్, మధ్యేజఠర మాబద్ధసౌవర్ణోదరబంధనమ్, ఉత్తరీయోపవీతాభ్యాముత్తరోత్తర మద్భుతమ్, శ్రీవత్సవైజయంతీభ్యాం శ్రియా చోల్లసితోరసమ్, కనకాంగదభూషాణాం భుజానాం భూషణాంతరైః, శంఖచక్ర గదాపద్మై రామోదితజగత్త్రయమ్, విలసద్వదనాంభోజం విస్ఫారితవిలోచనమ్, ఉల్లసద్గండఫలకం రత్నకుండవిలోచనమ్, రత్నైః విభ్రాజమానేన మకుటేన విరాజితమ్, ఆపాదచూడ సౌందర్యలహరీలంఘునాక్షమైః, అక్షిభిః నిగమాంతనా మభితః పరివారితమ్, పద్మాయాః పరమం భాగ్యం పశ్యతాం నేత్రపారణమ్, శ్రుతీనాం మానసీం మూర్తిం సూరీణాం కులదైవతమ్, అగ్రస్థితం ఫలం పుంసా మపవర్గాభిలాషిణామ్, అనుభూయ సమస్తాస్తే భగవంతం సనాతనమ్, వవందుః ననృతు శ్చాపి విధూతాశేషకల్మషాః." (యాదవగిరిమాహాత్మ్యం - 12వ అధ్యాయం)



(అనంతరం ఆ మునులు అందఱు ఆనందంతో విప్పారిన నేత్రలను కలవారై, కల్యాణ సరస్సులో స్నానం చేసి పూర్వాహ్ణంలో నిర్వర్తించవలసిన క్రియలను నిర్వర్తించి, ఆనందమయ విమానంమధ్యలో వేంచేసి ఉన్నవాడు, మహనీయుడైన నారాయణుని భక్తిలో వినమ్రులై దర్శించారు.

ఆ నారాయణుడు లక్ష్మీదేవిచేత సేవింపబడే పాదపద్మాలను కలవాడు, రత్నాలతో అలంకరింపబడ్డ మంజీరాలతో అలంకరింపబడినవాడు, పీతాంబరాన్ని ధరించినవాడు. ధరించిన పట్టువస్త్రంతో ఉజ్జ్వలంగా వెలుగుతున్నవాడు. నడుమున బంగారు మొలనూలు దాల్చినవాడు. ఉత్తరీయంతో, ఉపవీతంతో మిక్కిలి ఆశ్చర్య కరంగా ఉన్నవాడు. శ్రీవత్సంతో, వైజయంతితో, లక్ష్మీదేవితో వెలిగే వక్షఃస్థలాన్ని కలవాడు, బంగారు బాహుపురులతో, ఇంకా పలుభూషణాలతో అలంకరింప బడినవాడు శంఖం, చక్రం, గద, పద్మాలతో ముల్లోకాలను ఆనందింపజేసేవాడు, ప్రకాశించే వదనారవిందాన్ని కలవాడు. విశాలమైన నేత్రాలను కలవాడు. ప్రకాశించే చెక్కిళ్ళను కలవాడు, రత్నాల కుండలాలతో అలంకరింపబడ్డవాడు, ప్రకాశించే రత్నాలతో కూడుకొన్న కిరీటంతో వెలుగుతున్నవాడు, వేదాంతాలచేత కీర్తింపబడ్డ ఆపాదచూడం తిరుమేనిలోని అందాన్ని కలవాడు, లక్ష్మీదేవియొక్క గొప్ప భాగ్యం, దర్శించేవారి నేత్రాలకు తృప్తిని కల్గించేవాడు, వేదాల మానసమూర్తి, దివ్యసూరుల కులదైవతం, మోక్షాన్నికోరే జీవుల ఎదుట నిలచిన ఫలం, సనాతనుడు, భగవానుడైన తిరునారాయణస్వామిని దర్శించి, ఆనందించారు. సమస్త పాపాలు తొలగిన వారయ్యారు.)

## యాదవాద్రిలో నృసింహస్వామి ఆలయం :

తిరునారాయణపురంలోని కల్యాణతీర్థానికి తూర్పుదిశలో కొండపై వెలసిన నృసింహస్వామి ఆలయం కృతయుగంనాటిది. ఇక్కడ నృసింహస్వామి ఆవిర్భవించిన వృత్తాంతం మాత్స్యపురాణాంతర్గత యాదవగిరి మాహాత్మ్యంలో తెలుపబడింది. భక్తుడైన ప్రహ్లాదుని రక్షించడంకోసం భగవానుడు నృసింహరూపాన్ని ధరించి, హిరణ్యకశిపుని వధించాడు. అపుడు దేవతలు, ఋషులు, గంధర్వులు, బ్రహ్మ, రుద్రుడు మొదలైనవారు. ఆ రూపంతోనే యాదవాద్రిపై వేంచేసి ఉండమని భగవానుని ప్రార్థించగా, గోమంతమనే నామాంతరాన్ని కల యాదవాద్రిపై స్వామి నృసింహమూర్తిగా వేంచేసి ఉన్నాడు. "గంధర్వా ననృతుః హృష్టా అప్సరోభి స్సమంతతః, తైరయం ప్రార్థితో దేవో నృహరి ర్భక్తవత్సలః, గోమంతే పర్వతశ్రేష్ఠే

వసన్నిత్యం కృపానిధిః, నృహరిస్తైః గిరిశ్రేష్ఠ మాగతో భక్తవత్సలః, కుర్వన్ననుగ్రహం విష్ణురాస్తేఽ ద్యాపి ద్విజోత్తమ!" అని అంటూ కుమారుడు దీప్తిమంతుడనే బ్రాహ్మణునకు ఈ వృత్తాంతాన్ని తెలిపాడు.

"నరసింహగిరిం తత్ర దూరే నమత భక్తితః, యస్య దర్శనమాత్రేణ దూరం గచ్ఛతి దుష్కృతమ్, ప్రహ్లాదో హి మహాభాగః ప్రణయం మయి ధారయన్, ప్రతిష్ఠాం కారయామాస తత్ర మాం సింహరూపిణమ్, ఆరోహంతి గిరిం యే తు తే చ సేవార్థినో మమ, నావరోహంతి సంసారసాగరావర్తగహ్వరే, ధర్మమర్థం చ కామం చ లభంతే మోక్షమంతతః" అనే నారదీయపురాణ వచనాలనుబట్టి ఈకొండపై గల నృసింహమూర్తిని ప్రహ్లాదుడు ప్రతిష్ఠించాడని, ఈ కొండను ఎక్కి స్వామిని కొలిచినవారికి చతుర్విధపురుషార్థాలు లభిస్తాయని తెలుస్తున్నది.

## కల్యాణతీర్థమహిమ :

యాదవాద్రిపై పలు పుణ్యతీర్థాలు ఉన్నాయి. వాటిలో మొదటగా కల్యాణ తీర్థం స్మరణకు వస్తుంది. పూర్వం హిరణ్యాక్షుడనే అసురుడు భూమిని చాపగా చుట్టి, దానిని సముద్రం అడుగున పాతాళానికి అణగదొక్కాడు. అపుడు ఆ ఆపదనుండి రక్షించి భూమిని ఉద్ధరించడంకోసం భగవానుడైన శ్రీమన్నారాయణుడు శ్వేతవరాహావతారాన్ని ఎత్తి, హిరణ్యాక్షుని వధించి, భూమిని తన దంతాగ్రంతో గుచ్చి పైకి ఉద్ధరించాడు. అపుడు ఆ భూదేవీ వరాహమూర్తులకు కల్గిన శ్రమవల్ల వారి దివ్యదేహాలనుండి ఉద్భవించిన స్వేదజలమే కల్యాణతీర్థంగా ప్రవహించింది. ఈ సంగతిని సాక్షాత్తు భగవానుడే సనకాదులతో- **"పురా వరాహరూపేణ వసుధాం బిభ్రతా మయా, ఉషితం ఖలు తీర్థస్య కల్యాణస్యాస్య పూర్వతః, మగ్నోత్థితస్య జలధౌ మమాంగాత్ గళితం జలమ్, తేన పూర్ణ మిదం తీర్థం తస్మాత్ పుణ్యం పురాతనమ్"** ఇత్యాదిగా తెలిపినట్లు నారద పురాణాంతర్గతమైన యాదవగిరి మాహాత్మ్యం తెల్పుతున్నది. ఈ తీర్థంలో ప్రతిసంవత్సరం పాల్గునమాసంలో గంగాదిపుణ్యానదులు వచ్చి కలసి పవిత్రతను పొందుతున్నాయి- అనే సంగతిని **"ఫాల్గునే మాసి సంప్రాప్తే మాసానాముత్తమోత్తమే, అహం కల్యాణతీర్థస్య మధ్యే వర్తే మనోరమే, తదా సర్వనదీనాం చ సన్నిధిస్తత్ర జాయతే"** అని అంటూ గంగానది స్వయంగా పల్కింది. ఈ తీర్థంలో స్నానమాడడం, ఈ సరస్తీరంలో దానాది పుణ్యకర్మలను ఆచరించడం, శ్రాద్ధాది పితృకర్మలను అనుష్ఠించడం మిక్కిలి ఫలప్రదం, పుణ్యప్రదం కాగలదు. సకలపాపాలు ఈ తీర్థస్నానంవల్ల నశిస్తాయి.



ఈ తీర్థమహిమను కీర్తిస్తూ తిరుమలై అయ్యంగార్ యదుగిరి నారాయణస్తవంలో- **"హరేర్వరాహరూపిణః శ్రమాంబు సంభవశ్రమాపహమ్, భవిష్ణువిష్ణుపద్యుపాసితం సరశ్శరీకరోతు మంగళమ్"** అని, "నిర్ణీచోచ్ఛభిదం నిరాకృతగుణావద్యావమర్శం జనాన్, ఆప్లావ్యానుజిఘృక్షతీం సురుచిరాగాథప్రసన్నాద్భుతామ్, శ్రీమద్యాదవ భూధరే సుచరితోల్లాసావహా మన్వహం, కల్యాణీ మవగాహిషీయ కరుణాం నారాయణస్యాపరామ్" అని పలికారు.

కల్యాణతీర్థమహిమను తెలిపే పలు వృత్తాంతాలు యాదవగిరి మాహాత్మ్యం లో ఉట్టంకింపబడ్డాయి. వాటిలో సుచరితోపాఖ్యానం ఒకటి.

సుచరితుడు ఒక బీదబ్రాహ్మణుడు. అతడు తన భార్యతో, ఇద్దఱు కుమారులతో కలసి తీర్థయాత్రలను చేస్తూ స్నానంకోసం గంగానదికి పోయాడు. కాని గంగానది అతనికి అదృశ్యమయినది. అక్కడ ఉండేవారు "సుచరితా! ఇదిగో గంగ! ఇందులో స్నానం చేయి" అని పల్కినా, అతడు ఎంతగా వెదకి చూచినా గంగానది అతనికి కన్పించలేదు. అందువల్ల అతడు చాలా దుఃఖాన్ని పొందాడు. అపుడు ఒక కన్య అతనికి కన్పించి- "ఓయీ! నీవు ఇంతకుముందు ఎపుడైనా కల్యాణతీర్థంలో స్నానం చేశావా ?" అని అడిగింది. సుచరితుడు తాను అటువంటి పేరును కూడా వినలేదని అన్నాడు. ఆ కన్య అతనిని కల్యాణతీర్థానికి వెళ్ళిస్నానం చేయమని పల్కింది. అపుడాబ్రాహ్మణుడు "నేను వృద్ధుడనుకదా! ఎంతో దూరంలో ఉండే ఆ కల్యాణ తీర్థానికి ఏవిధంగా చేరగలను?" అని విచారించాడు. అతని విచారాన్ని గమనించిన ఆ కన్యక "బ్రాహ్మణోత్తమా! మీరు నల్గురు **"కల్యాణతీర్థ స్నానమస్తు"** అని మూడుసార్లు ఉచ్చరిస్తూ ఈ గంగలోనే స్నానం చేయండి" అని పల్కి అదృశ్యమైపోయింది. వారు ఆ రీతిలోనే ఉచ్చరిస్తూ గంగలో మునిగి పైకి లేవగా, వారి కంటికి యాదవగిరిలోని కల్యాణతీర్థం ప్రత్యక్షమైనది. వారు చాలా ఆశ్చర్యాన్ని పొందారు. ఆ తీర్థసమీపంలో ఉండే జనంకూడా వీరిని చూచి ఆశ్చర్యపడి, "మీరెవరు? ఎక్కడనుండి వచ్చారు?" అని అడిగారు. ఆ బ్రాహ్మణుడు జరిగిన సంగతిని వారికి తెలియజేశాడు. సుచరితుడు తరువాత యాదవాచల ప్రాంతంలోనే నివాసమేర్పరచుకొని అక్కడే నివసించాడు. అపుడు అతనికి ఇంకొక కుమారుడు జన్మించగా అతనికి అచటి స్వామి నామం అయిన నారాయణుడనే పేరును పెట్టాడు. కొన్నాళ్ళకు యాదవాద్రి ప్రాంతంలో పలు ఏళ్ళపాటు కఱువు కాటకాలు సంభవించాయి. సుచరితుడు తన పెద్దకుమారులిద్దరిని వెంటబెట్టుకొని

ద్రావిడదేశానికి ధనసంపాదనకోసం వెళ్ళాడు. భార్యను, చిన్నకుమారునిమాత్రం యాదవాద్రిలోనే ఉంచాడు. 4, 5 నెలలపాటు సుచరితుడు ఒక ప్రభువు కొలువులో పనిచేసి కొంత ద్రవ్యాన్ని సంపాదించి ఇద్దఱు కుమారులతో పాటు ఇంటికి తిరిగి బయలుదేరాడు.

ఇంతలో యాదవాద్రిలో ఉండే సుచరితుని ఇంటిలో ఒక వింత సంభవించింది. ఒకనాడు సుచరితుని చిన్నకుమారుడు తల్లితో తనకు ఆకలిగా ఉన్నదని, అన్నం పెట్టమని అడిగాడు. ఆమె చిన్నగిన్నెలో కొంచెం అన్నం పెట్టి అతనికి ఇచ్చింది. అతడు ఆ గిన్నెను తీసికొని దానిని నారాయణస్వామివద్దకు తీసికొనిపోయి, "స్వామీ! దీనిని ఆరగించు'' అని ప్రార్థించాడు. భగవానుడు లక్ష్మీదేవితో కలసి దానిని ఆరగించాడు. బాలుడు చాలా సంతోషించి రిక్తపాత్రను తల్లిదగ్గరకు తీసికొనివచ్చి చూపించి, జరిగిన సంగతిని ఆమెకు చెప్పి, తనకు మళ్ళీ అన్నం పెట్టమని అర్థించాడు. ఆమె అతని మాటలను నమ్మకుండా, "దేవుడు అన్నాన్ని భుజించడం ఏమి? నీవు పల్కినదంతా అసత్యం. మళ్ళీ అన్నాన్ని నీకు ఎక్కడ నుండి తీసుకొని రాగలను? ఊరిలో బిచ్చమెత్తి తిను'' అని అన్నది. ఆ బాలుడు కూడా ఆకలికి తాళలేక, ఊరిలో ఇంటి ఇంటికి వెళ్ళి భిక్షను యాచించ సాగాడు. అపుడు లక్ష్మీదేవి ప్రతి ఇంటివద్దకు మాఱువేషంలో వచ్చి ఆబాలుని పాత్రలో ఒక్కొక్క గరిటె అన్నాన్ని పెట్టింది. బాలుడు ఇంటికి వచ్చి పాత్రను చూడగా దాని నిండుగా నవరత్నాలు కన్పించాయి. అతడు ఆశ్చర్యపడ్డాడు. అతని తల్లి పేరాశతో అతనిని మళ్ళీ ఏడుమార్లు భిక్షకు పంపింది. ఆ బాలుడు ఎనిమిదవ సారి భిక్షకు పోయి రాగా ఆ పర్యాయంమాత్రం పాత్రలో రత్నాలు కన్పించలేదు. అన్నం మాత్రమే ఉన్నది. ఆవిధంగా లభించిన రత్నాల రాశిని వారిద్దరు రక్షిస్తూ కొంతకాలాన్ని గడిపారు.

ఇంతలో సుచరితుడు తాను సంపాదించిన ధనాన్ని తీసికొని ఇద్దరు కుమారులతో పాటు ఇంటికి బయలుదేరాడు. దారిలో కొందఱు దొంగలు అతని వద్ద ఉండే సొమ్మును అపహరించారు. క్షుద్రసేవను చేసి ధనాన్ని సంపాదించి నందులకు భగవానుడు తనకు తగిన శిక్షవిధించాడని తలచి, ఇకపై తగని సేవను చేయకూడదని భావిస్తూ సుచరితుడు ఇంటికి చేరాడు. ఇంటిలోని గొప్ప రత్నాల రాశిని చూచి అతడు జరిగిన సంగతిని భార్యవల్ల గ్రహించాడు. సుచరితుడు దీనికి అంతటికి భగవత్కటాక్షమే కారణమని భావించి, ఆ ధనంతో భగవద్భాగవత



కైంకర్యాన్నిచేస్తూ సుఖంగా కాలాన్ని గడుపుతూ ఉన్నాడు.

ఒకనాడు కొందఱు దొంగలు సుచరితుని ఇంటిలోని ధనాన్ని దొంగతనం చేయాలని తలచి కల్యాణసరస్సులో స్నానం చేసి, ద్వాదశోర్ధ్వపుండ్రాలను పెట్టుకొని, తులసీ నళినాక్షమాలలను దాల్చి, తిరునారాయణస్వామిని సేవించుకొని సుచరితుని ఇంటికి అతిథులుగా భోజనంకోసం వచ్చారు. తగిన సమయంకోసం వారు వేచి ఉండగా, సుచరితుడు సాలగ్రామ తీర్థాన్ని వారికి ఇచ్చి భోజనానికి ఆహ్వానించాడు. కల్యాణతీర్థస్నానంవల్ల, భగవద్దర్శనప్రభావంవల్ల, సాలగ్రామతీర్థప్రభావంవల్ల వారిలోని దుష్టభావన తొలగిపోయింది. వారికి చాలా పశ్చాత్తాపం కల్గింది. వారు అపుడు సుచరితుని పాదాలపై పడి జరిగిన సంగతిని తెల్పి క్షమను అర్థించారు. అతడు వారిని మన్నించి, వారికి మోక్షప్రాప్తిని కల్గించమని భగవానుని ప్రార్థించాడు. ఈవృత్తాంతం నారదీయపురాణోక్త యాదవగిరిమాహాత్మ్యంలోని పంచమాధ్యాయంలో ఉన్నది. మాత్స్యపురాణాంతర్గతమాహాత్మ్యంలోని అష్టమాధ్యాయంకూడా కల్యాణతీర్థ మహిమను పిప్పలాదోపాఖ్యానంద్వారా తెల్పింది.

## వరాహచరమశ్లోకావిర్భావం యాదవాద్రిపైననే :

భగవానుడు వరాహమూర్తియై భూమిని ఉద్ధరించిన తరువాత ఆమెను ఉద్దేశించి వరాహచరమశ్లోకాలను రెండిటిని ఉపదేశించాడు. **"వరాహరూపి భగవాన్ వసుధా మవలోకయన్! యత్ర శ్రుతీనాముత్తంసం శ్లోక ద్వయముపాదిశత్"** అని ఈ విషయాన్ని నారదపురాణం తెల్పుతున్నది. అందువల్ల వరాహచరమశ్లోకాల ఆవిర్భావం ఈ యాదవాద్రిపైననే జరిగింది.

## యాదవాద్రిపై విష్ణుపురాణరచన :

ఈ పర్వతంమీదనే పరాశరమహర్షి విష్ణుపురాణాన్ని రచించాడు- అనే విషయాన్ని యాదవగిరిమాహాత్మ్యం ఈక్రింది విధంగా తెల్పింది. ఒకసారి పరాశర మహర్షి తన శిష్యుడైన మైత్రేయునితోపాటు యాదవాద్రికి వచ్చి, అక్కడ ఉండే దత్తాత్రేయమహర్షికి నమస్కరించారు. వారి రాకలోని ఆంతర్యాన్ని ఆ మహర్షి ప్రశ్నించగా, పరాశరమహర్షి బదులిస్తూ - "నేను బదరికాశ్రమంలోని శ్రీమన్నారాయణుని సేవించడంకోసం వెళ్ళాను. అక్కడ స్వామి నాకు సాక్షాత్కరించి, "నీవు దక్షిణబదరిగా ప్రసిద్ధిచెందిన యాదవాద్రికి పోయి, అక్కడ నీ శిష్యుడైన మైత్రేయునకు తత్త్వాహితపురుషార్థాలను ఉపదేశించే రీతిలో విష్ణుపురాణరచను

చేయి. అది పురాణరత్నమనే ప్రసిద్ధిని పొందగలదు'' -అని ఆదేశించాడు. అందువల్ల నేను మైత్రేయునితో పాటు ఇక్కడ కొంతకాలం నివసిస్తాను. అనుగ్రహించండి'' అని ప్రార్థించాడు. ఈవిధంగా దత్తాత్రేయుని అనుగ్రహంతో పరాశరమహర్షి విష్ణుపురాణాన్ని ఈ యాదవాద్రిపైనే రచించాడు. **"అనుజ్ఞాత స్తతస్తేన యతినాం చక్రవర్తినా, హ్యాజహార పురాణం తత్ విష్ణోః పారమ్యదర్శకమ్, మైత్రేయాయ తతస్తత్ర తత్త్వం ప్రాచీకశమ్మునిః, తస్మాత్ కల్యాణతీర్థస్య కించిదుత్తర భాగతః, పరాశరాశ్రమో నామ స్థానం సద్భిరుదీర్యతే"** ఇత్యాదిగా ఈ వృత్తాంతాన్ని నారదీయ పురాణం యాదవగిరిమాహాత్మ్యంలోని నవమాధ్యాయం ప్రస్తావించింది.

## సప్తక్షేత్రమాహాత్మ్యం :

(1) కల్యాణతీర్థానికి దగ్గరగా తూర్పు దిక్కులో గల పర్వతంపై యోగానంద నృసింహస్వామి వేంచేసి ఉన్నాడు. భక్తులకు సకలాభీష్టాలను ప్రసాదించే ఈ క్షేత్రం నారసింహక్షేత్రంగా ప్రసిద్ధిచెందింది. (2) ఈ పర్వతం క్రింది భాగంలో కల్యాణ తీర్థానికి తూర్పున వరాహక్షేత్రమున్నది. ఇక్కడనే వరాహస్వామి తన వామాంకం పై భూదేవిని ఆసీనురాలినిగా చేసికొని వరాహచరమశ్లోకాన్ని ఉపదేశించాడని ప్రతీతి. ఇక్కడ చేసే జపతపాదులు తప్పక సిద్ధించి అభీష్టసిద్ధి కల్గుతుంది. (3) కల్యాణ తీర్థానికి దక్షిణదిక్కులోనే లక్ష్మణుడు ఒక పర్ణశాలను నిర్మించగా, అందులో సీతారాములు కొంతకాలం విహరించారు. అందువల్ల ఆ ప్రాంతానికి సీతారణ్యమనే పేరు కల్గింది. **"తీర్థస్య దక్షిణే భాగే సీతారణ్యం ప్రచక్షతే, పురా హి లక్ష్మణస్తత్ర పర్ణశాలాం మనోరమామ్, ఆతేనే రఘునాథస్య సీతాసంతోష కారిణీమ్".** అనే నారదీయ పురాణవచనాలు ఈ విషయాన్ని తెల్పుతున్నవి. ఇక్కడ చాలా విస్తృతమైన తులసీవనం ఉన్నది. కల్యాణతీర్థానికి పడమటి దిక్కులో జ్ఞానాశ్వత్థమనే పేరు గల రావిచెట్టు ఉన్నది. దీని పరిసరాలు చాలా పవిత్రమైనది. అజ్ఞానాన్ని తొలగించి జ్ఞానాన్ని కల్గిస్తాయి. ఈ చెట్టుకింద శుకమహర్షి, పుండరీకుడు, రుక్మాంగదుడు, అంబరీషుడు, ప్రహ్లాదుడు - అనే అయిదుగురు భాగవతోత్తములు నివసిస్తూ శ్రీనారాయణుని సేవించినందున దీనికి (4) పంచభాగవత క్షేత్రమని పేరు. ఈ క్షేత్రానికి పడమరగా, (5) తార్క్ష్యక్షేత్ర మున్నది. భగవాని ఆదేశాను సారం గరుడుడు శ్వేతద్వీపంనుండి శ్వేతమృత్తికను ఇక్కడకు తీసికొనివచ్చి పెట్టాడు. ఇక్కడ శ్వేతమృత్తిక సమృద్ధిగా లభిస్తుంది. వీటితో పాటు (6) పరిధాన శిలాక్షేత్రం, (7) నయనక్షేత్రం కూడా ఇక్కడ ఉన్నాయి. ఈ విధంగా



ఇక్కడ ఈ ఏడు క్షేత్రాలు సుప్రసిద్ధమైనది.

## అష్టతీర్థమహిమ :

నాస్తికవాదాలను ఖండించి వేదప్రామాణ్యాన్ని సుస్థిరం చేయడంకోసం భగవానుడు దత్తాత్రేయమహర్షిగా అవతరించాడు. నాల్గు వేదాలను నల్గురు శిష్యులుగా, ఆఱు వేదాంగాలను ఆఱుగురు ప్రశిష్యులుగా చేసికొని దత్తాత్రేయుడు వేదమహిమను వేదపుష్కరిణీ తీరంలో ఉపదేశించినందున ఈ తీర్థానికి ఈ పేరు వచ్చింది. **"వేదానుపాదిశత్తత్ర శిష్యాణామహమర్థతః, తస్మాత్ పుష్కరిణీం తత్ర వేదపుష్కరిణీం జగుః",** అని నారదీయపురాణ వచనం. ఈ పుష్కరిణి తీరంలో ఒక పవిత్ర శిల ఉన్నది. దానిపై దత్తాత్రేయ మహర్షి కాషాయవస్త్రాన్ని పెట్టి ధరించినందున దానికి పరిధానశిల అని పేరు వచ్చింది. శ్రీరామానుజులు కూడా ఈ పరిధానశిలపై తమ కాషాయవస్త్రాన్ని పెట్టి ధరించారు. ఈ తీర్థానికి పశ్చిమభాగంలో పర్వత పాదప్రాంతం (సానువు)లో దర్భతీర్థం ఉన్నది. మొలిచిన దర్భలను దత్తాత్రేయుడు తన అనుష్ఠానానికి ఉపయోగించడంవల్ల దీనికి దర్భతీర్థమనే పేరు కూడా ఉన్నది. ఇక్కడనే శాండిల్యమహర్షి భగవదారాధనాత్మకమైన పాంచరాత్రసంహితను తన శిష్యులకు బోధించాడట.

యాదవాద్రికి పశ్చిమంగా పలాశతీర్థం ఉన్నది. ఈ తీర్థం చుట్టూ మోదుగ చెట్లు విరివిగా ఉన్నందున దీనికీపేరు కల్గిందని అంటారు. విశ్వామిత్రుని శాపంవల్ల చండాలరూపాన్ని పొందిన వశిష్ఠుని కుమారులు ఈ తీర్థంలో స్నానం చేసి శాపవిమోచనాన్ని పొందారట. ఈ తీర్థానికి పశ్చిమంగా **"యాదవి"** అనే నది ప్రవహిస్తున్నది. దీని తీరంలో ఒక యాదవప్రభువు యాగం చేసి స్వర్గాన్ని పొందాడు. కనుక దీనికి **"యాదవి"** అనే పేరు కల్గినది.

పలాశతీర్థానికి ఉత్తర దిక్కులో పద్మతీర్థమున్నది. ఇందులో పూచిన పద్మాలతో సనత్కుమారమహర్షి శ్రీమన్నారాయణుని నిత్యం ఆరాధించినందున దీనికి పద్మతీర్థమనే ప్రసిద్ధి కల్గింది. కల్యాణతీర్థానికి ఉత్తరంగా మైత్రేయతీర్థమున్నది. ఈ తీర్థతీరంలోనే పరాశరమహర్షి విష్ణుపురాణాన్ని తన శిష్యుడైన మైత్రేయునకు ఉపదేశించాడు. దీనినే దాక్షిణాత్యులు మైత్రేయ కుండమని వ్యవహరించగా, ఔత్తరాహులు పరాశరతీర్థమని అంటారు. మైత్రేయీతీర్థానికి ఉత్తరంగా నారాయణతీర్థమున్నది. మరణించినవారి చరమసంస్కారాలను ఈ చోటనే చేస్తే

వారు పరమపదాన్ని పొందుతారు. **"నారాయణహ్రదం ప్రాహుః నయనే తీర్థమద్భుతమ్, అయత్నాదేవ జాయంతే యదంతే మంత్రసిద్ధయః.... విరక్తో విష్ణుచిత్తస్తు నారాయణ పదద్వయమ్, శరణం ప్రాప్య తత్రైవ జగామ పరమం పదమ్"** అని నారదీయపురాణం తెల్పింది. ఈ తీర్థమహిమను తెలిపే విష్ణుచిత్తుడనే బ్రాహ్మణుని వృత్తాంతం నారదీయపురాణాంతర్గతమైన యాదవగిరి మాహాత్మ్యంలో తెలుపబడింది.

## విష్ణుచిత్తోపాఖ్యానం :

పూర్వం విష్ణుచిత్తుడనే బ్రాహ్మణ యువకుడు వేదవేదాంగాది సర్వశాస్త్రాలను అభ్యసించాడు. అతనికి యుక్తవయస్సురాగానే తల్లిదండ్రులు అతని వివాహ ప్రయత్నాన్ని చేయగా, అతడు దానిని అంగీకరించకుండా నైమిశారణ్యానికి పోయి భగవానునిగూర్చి తీవ్రమైన తపస్సును చేయసాగాడు. అపుడొకరాజు అతని వద్దకువచ్చి తన ఏకైకపుత్రికను ఇచ్చి వివాహం చేసి, తన రాజ్యాన్ని అంతటిని ఇస్తాను, రమ్మని అన్నాడు. కాని విష్ణుచిత్తుడు అంగీకరించలేదు. విష్ణుచిత్తుడు చేసే తపస్సును భంగం కల్గించడంకోసం ఇంద్రుడు అప్సరసలకు పంపాడు. విష్ణుచిత్తుడు చలించలేదు, సరికదా, వారిని వానరులుగా మారిపొమ్మని శపించాడు. ఇంద్రుడపుడు వృద్ధబ్రాహ్మణుని వేషంలో వచ్చి విష్ణుచిత్తుని సమాధానపరచి, అప్సరసలకు శాపవిమోచనం కల్గించి వారిని తీసికొనివెళ్ళిపోయాడు. ఈరీతిలోనే రుద్రుడు, బ్రహ్మకూడా వచ్చి అతనికి కావలసిన వరాన్ని కోరుకొమ్మని పల్కినా, విష్ణుచిత్తుడు శ్రీమన్నారాయణుడు తప్ప ఇంకొకరు తనకు అక్కరలేదన్నాడు.

ఈవిధంగా కొన్నాళ్ళు గడచిన తరువాత విష్ణుచిత్తునకు అష్టాక్షరీ మంత్రోప దేశాన్ని చేసిన ఆచార్యుడే స్వయంగా వచ్చి అతడు నారాయణాద్రిలో తపస్సును చేస్తే అభీష్టం త్వరగా సిద్ధిస్తుందని అన్నాడు. విష్ణుచిత్తుడు అదేవిధంగా నారాయణాద్రి (యాదవాద్రి)కి వచ్చి తపస్సు చేయగా భగవానుడు సకలాభరణ భూషితుడై దివ్యదేవేరులతో పాటు గరుత్మంతునిపై దర్శనమిచ్చాడు. విష్ణుచిత్తుడు భగవద్దర్శనాన్ని పొంది ఆనందించి, మోక్షైశ్వర్యాన్ని పొందాడు. ఈ వృత్తాంతం నారదపురాణోక్త యాదవగిరిమాహాత్మ్యంలోని దశమాధ్యాయంలో తెలుపబడింది.

## నయనక్షేత్రం :

నారాయణతీర్థానికి తూర్పున ఎత్తుగా ఉండే చోట నయనక్షేత్రమున్నది. ఇచట నివసించి, భగవానుని సేవించినవారికి ఈ క్షేత్రం భగవానుని పొందిస్తుంది



కనుక దానికి ఈ పేరు వచ్చింది. ఇచట నెలకొని ఉండే కేశవస్వామి అనుగ్రహం వల్ల అష్టాక్షరీమంత్ర జపం చేసేవారికి శీఘ్రంగా సిద్ధి కల్గుతుంది. విష్ణుచిత్తునకు కూడా తపస్సిద్ధి ఇక్కడే కల్గింది.

త్రివిక్రమావతార సమయంలో భగవానుడు తన ఒక పాదంతో పైలోకాలను కొలువగా, ఆ పాదం సత్యలోకంవరకు ప్రసరించింది. అపుడు ఆ పాదాన్ని బ్రహ్మతన కమండలులోని తీర్థంతో అభిషేకించగా ఆ జలం గంగానదిగా ప్రవహించింది. అపుడు నిత్యసూరులుకూడా విరజానదీతీర్థంతో స్వామి శ్రీచరణాన్ని అభిషేకించారు. ఆ జలం ఈ నారాయణాద్రిపై ఉత్తరదిక్కులో వైకుంఠగంగ అనే పేరుతో ప్రవహించింది. దీనికి ఇపుడు **"తొట్టల మడుగు"** అని పేరు. భక్తిసారమునీంద్రులు ఇచటనే కొన్నాళ్ళు తపస్సు చేశారనే ప్రసిద్ధి ఉన్నది.

## నారాయణాద్రిపై కలిప్రభావం లేదు :

ద్వాపరాంతంలో కలిపురుషుడు భూలోకానికి వచ్చి యాదవాద్రిలో కూడా ప్రవేశించాలని ప్రయత్నించాడు. అపుడు వేత్రదండాన్ని ధరించిన విష్ణుకింకరులు అతనిని దండించి వెడలగొట్టారు. అందువల్ల భయపడిన కలిపురుషుడు ఈనాటికీ ఈ క్షేత్రంలో ప్రవేశించడానికి సాహసించడు. **"ద్వాపరాంతే కలిస్తత్ర ప్రవేష్టుం ద్రుతమాగతః, వేత్రదండధరై స్సద్య స్తాడితో విష్ణుకింకరైః, తస్మాత్కలిః యదుగిరిం న ప్రవేక్ష్యతి సాధ్వసాత్"** అని ఈ విషయాన్ని యాదవగిరిమాహాత్మ్యం తెల్పుతున్నది.

## మాత్స్యపురాణాంతర్గత యాదవగిరిమాహాత్మ్యంలోని కొన్ని విశేషాలు :

కుమారుడు దీప్తిమంతునకు తెలిపిన యాదవగిరివృత్తాంతాన్ని సూతమహర్షి శౌనకమహర్షికి తెలియజేసిన వైనం మాత్స్యపురాణాంతర్గత యాదవగిరి మాహాత్మ్యంలోని ద్వాదశాధ్యాయంలో ప్రస్తావింపబడింది.

పూర్వం కృతయుగంలో శాండిల్యమహర్షి యాదవగిరిపై గల దర్భతీర్థంలో శ్రీమన్నారాయణుని ఉద్దేశించి తపస్సు చేశాడు. చాలా కాలానికి భగవానుడు అతనికి ప్రత్యక్షం కాగా, శాండిల్యుడు "బదరిలోని నరనారాయణాశ్రమాన్ని ఇక్కడ దర్శించాలని కోరుతున్నాను'' అని అన్నాడు. భగవానుడు **"తత్ర గంతు మశక్తాశ్చ కలౌ జీవా హిమార్చితాః, తస్మాదత్రైవ వత్స్యామి త్వమప్యత్ర వసానఘ! నయిష్యామి క్షణాదేవ బృందావనలతాస్తరూన్"** అని అంటూ బృందావనంలోని లతలను,

బదరీవృక్షాలను యాదవాద్రిపైకి రప్పించి తాను అక్కడ అర్చామూర్తిగా వెలిశాడు. ఈ విధంగా బదరీనారాయణస్వామి ఇక్కడకు వచ్చి అవతరించినందున దక్షిణబదరిగా ఈ క్షేత్రం ప్రసిద్ధిజెందింది. ఈనాటికీ తిరునారాయణస్వామి ఆలయానికి ఎదురుగా బదరీవృక్షాన్ని, దానికింద నారాయణస్వామి ఆలయాన్ని సేవించవచ్చు.

ఇచటి నారాయణస్వామి ఉత్సవబేరానికి సంబంధించిన ఒక అపూర్వ వృత్తాంతంకూడా ఇక్కడ తెలుపబడింది. పూర్వం వైవస్వతమనువుకుమారుడైన ఇక్ష్వాకుమహారాజు బ్రహ్మనుగూర్చి బదరికాశ్రమంలో చిరకాలం తపస్సు చేయగా బ్రహ్మ అతనికి ప్రత్యక్షమయ్యాడు. తాను విష్ణువును ఆరాధించడంకోసం ఒక ప్రతిమను అనుగ్రహించమని అతడు బ్రహ్మను కోరాడు. అపుడు బ్రహ్మ **"బహుకాలం తపస్తప్త్వా లబ్ధవాన్ పరమాద్భుతామ్, ప్రతిమాం పద్మనాభాద్ధి తపసా తోషితాద్ధరేః, తాం దదామి"** అని అంటూ సుకుమారుడనే పేరును కల, భగవానుని వల్ల తాను పొందిన అర్చామూర్తిని ఇక్ష్వాకువునకు ఇచ్చాడు. ఇక్ష్వాకువు, అతని వంశంలోని రాజులు తరతరాలుగా ఆ మూర్తిని చిరకాలం అర్చించిన తరువాత, ఆ వంశంలోని చివరి ప్రభువు అయిన మిత్రుని కాలంలో బ్రహ్మ ఆ మూర్తిని యాదవగిరికి తీసికొని వచ్చి ప్రతిష్ఠించి ఉత్సవాలను జరిపించాడు. ఆనాటినుండి బ్రాహ్మణ శ్రేష్ఠులు ఆ మూర్తిని యాదవగిరిపై ఆరాధిస్తూ అభీష్టాలను పొందుతున్నారు.

**భగవద్రామానుజులు - తిరునారాయణపురం :**

ఈ విధంగా కృతయుగంనుండి గొప్ప దివ్యక్షేత్రంగా ప్రసిద్ధిచెందిన ఈ క్షేత్రం, ఆలయం కాలక్రమేణ మఱుగు పడిపోయాయి. మేల్కోట ఆలయచరిత్రలో భగవద్రామానుజులకు పూర్వం గల భాగం ఒక ఎత్తుకాగా అనంతర భాగం ఇంకొక ఎత్తుగా చెప్పదగినది. చోళరాజువల్ల కల్గిన ఉపద్రవం కారణంగా భగవద్రామానుజులు కర్ణాటక దేశం మేల్కోటై ప్రాంతం సాలగ్రామాన్ని చేరి, అపుడు ఆ ప్రాంతాన్ని పాలించే విష్ణువర్ధనుడనే ప్రభువు ఆదరణను పొంది, అతని సహాయంతో తిరునారాయణపురంలోని కోవెలలో అర్చామూర్తిని పునః ప్రతిష్ఠించారు. ఈ వృత్తాంతాన్నిగూర్చి ప్రస్తావించిన ఆధారాలలో మిక్కిలి ప్రాచీనమైనది గురుపరంపరా ప్రభావమనే సంప్రదాయ చారిత్రక గ్రంథం. 13వ శతాబ్దంలో ఇది రచింపబడింది. 12వ శతాబ్దానికి చెందిన సాలగ్రామంలో దొరికిన శాసనంలో శ్రీరామానుజుల



శిష్యుల ముగ్గురి పేర్లు ప్రస్తావించబడ్డాయి. ఈ పేర్లు గురుపరంపరాప్రభావంలో కూడ కన్పిస్తున్నాయి. ఇంతేకాక, 13వ శతాబ్ది చివరి భాగానికి చెందిన మేల్కోటైలో దొరికిన శాసనంలో భగవద్రామానుజులు శ్వేతమృత్తికను (తిరుమణ్ను) వెదకి సంపాదించిన వృత్తాంతం కన్పిస్తున్నది. ఈవృత్తాంతప్రస్తావనకూడా గురుపరంపరా ప్రభావమనే సాంప్రదాయిక చరిత్రగ్రంథంలో ఉన్నది. ఇవి అన్నీ మేల్కోటై ప్రాంతంలో భగవద్రామానుజుల నివాసాన్ని సమర్థిస్తున్నాయి. క్రీ.శ. **1544** సంలోని ఒక శాసనంకూడా భగవద్రామానుజులు మేల్కోటైలోని యతిరాజమఠంలో నివసించినట్లు తెల్పుతున్నది.

శ్రీరామానుజులు మేల్కోటైలో నివసించిన కాలాన్నిగూర్చి చారిత్రక పరిశోధకులలో కొంత అభిప్రాయభేదం కన్పిస్తుంది. ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ మొదలైనవారు 11వ శతాబ్ది చివరి భాగంలో శ్రీరామానుజులు మేల్కోటై ప్రాంతంలో నివసించినట్లు అభిప్రాయపడ్డారు. ఎ.ఎన్. కృష్ణ అయ్యంగార్ అభిప్రాయానుసారం ఈ సంఘటన 12వ శతాబ్దం ఆరంభంలో జరిగింది. మొదట సాలగ్రామంలో, ఆ తరువాత తొండనూర్‌లో నివసించిన శ్రీరామానుజులు తరువాత విష్ణువర్ధనుని సహాయంతో మేల్కోటైలో స్థిరపడ్డారు.

"క్రీ.శ. 1125 వ సం॥లో, 1128 వ సం॥లో వ్రాయబడ్డ రెండు శాసనాలను బట్టి క్రీ.శ. **1125-1128** సం॥ల మధ్యభాగంలో తొండనూర్ విష్ణువర్ధనుని రాజధానిగా వెలసిందని తెలుస్తున్నది. ఈ మధ్యకాలంలోనే భగవద్రామానుజులు తొండనూర్ నంబిద్వారా విష్ణువర్ధనుని కలిసి ఉండవచ్చు. విష్ణువర్ధనుడు రాజకీయంగా స్థైర్యాన్ని క్రీ.శ. 1117 వ సంలో పొందాడు. అందువల్ల మేల్కోటై ఆలయంలో తిరునారాయణ మూర్తి అర్చామూర్తి పునఃప్రతిష్ఠ క్రీ.శ. **1117-1128** సంల మధ్య భాగంలో జరిగి ఉండవచ్చు"- అనే అభిప్రాయాన్ని శ్రీమతి ఆర్. వసంత "Melkote Throuugh The Ages" అనే వ్యాససంకలనాత్మక గ్రంథంలోని "A Study in Historical Perspective" అనే వ్యాసంలో వ్యక్తం చేశారు.

కాని, శ్రీవైష్ణవ శ్రీ శ్రీమాన్ ఎ. కృష్ణమాచార్యస్వామివారు "Ramanuja- a reality not a myth" అనే ఆంగ్లగ్రంథంలో ఈ విధంగా అభిప్రాయపడ్డారు.

శ్రీరామానుజులు క్రీ.శ. 107 సం॥ ప్రాంతంలో తొండనూర్‌ను చేరారు. అక్కడ తొండనూర్‌నంబిని కలిసి, వారి సహకారంతో విష్ణువర్ధనుని శ్రీవైష్ణవునిగా

సంస్కరించారు. 1078 సం ప్రాంతంలో కృమికంఠుడు మరణించిన తరువాత చోళరాజ్యంలో రాజకీయస్థైర్యం నెలకొన్నది. అపుడు శ్రీరామానుజులు శ్రీరంగానికి తిరిగి వచ్చారు. విష్ణువర్ధనుడు హోయసల రాజ్యాధిపతి అయిన తరువాత క్రీ.శ. 1097-98 సం ప్రాంతంలో అతడు శ్రీరామానుజులను శ్రీరంగానికి వెళ్ళి తిరునారాయణపురంలోని ఆలయ ప్రతిష్ఠాదుల నిర్వహణకోసం ఆహ్వానించగా, శ్రీరామానుజులు వచ్చి క్రీ.శ.1099వ సం.లో ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు. మళ్ళీ తిరిగి క్రీ.శ. 1117సం లో ఆ ప్రభువు ప్రార్థన మేరకు కర్ణాటక దేశానికి పోయి బేలూర్‌లోని ఆలయంయొక్క ప్రతిష్ఠాకార్యక్రమాన్ని నిర్వహించారు.

ఈ అభిప్రాయం మిక్కిలి సహేతుకంగా, అంగీకార్యంగా కన్పిస్తుంది. గురుపరంపరాప్రభావం, ప్రపన్నామృతం మొదలైన గ్రంథాలలో తిరునారాయణ పురంలోని ఆలయం పునఃప్రతిష్ఠ బహుధాన్య సంవత్సరం తైమాసం (పుష్య మాసం)లో జరిగినట్లు తెలుపబడింది. అందువల్ల లభించే పలు ఆధారాలనుబట్టి తిరునారాయణపురంలోని ఆలయపునరుద్ధరణ క్రీ.శ. 1099 సం॥లో జరిగిందని భావించడంలోనే ఎక్కువ ఔచిత్యం ఉన్నది. అప్పటికి శ్రీరామానుజుల వయస్సు సుమారు 82 సంలు. ఆ తరువాత సుమారు 38 సం ల పాటు శ్రీరామానుజులు జీవించి ఉన్నారు. కనుక, శ్రీరంగానికి శ్రీరామానుజులు తిరిగి వచ్చిన తరువాత సంభవించినట్లు వారి చరిత్రలో చెప్పబడే పలు సంఘటనలకు కూడా ఈ కాలవ్యవధి అవకాశం ఇస్తున్నది.

### గురుపరంపరాప్రభావంలోని తిరునారాయణపురం కోవెల పునరుద్ధరణవృత్తాంతం :

తొండనూర్‌లో శ్రీరామానుజులు వేంచేసి ఉండే సమయంలో, ఒకనాడు ఆ ఆచార్యులు తాము నిత్యం ధరించే శ్వేతమృత్తికను (తిరుమణ్) సంపాదించడం కోసం ఎంతగా అన్వేషించినా దొరకనందున "అయ్యో! ధరించడానికి తిరుమణ్ (శ్వేతమృత్తిక) దొరకలేదే!'' అని విచారిస్తూ నిద్రించారు. ఆనాటి రాత్రి తిరునారాయణమూర్తి- "సమీపంలోనే యదుగిరిలో మీ రాకను ఎదురు చూస్తూ ఉన్నాము. మీ మనస్సువంటి (తెల్లని) మన్ను ఇక్కడ ఉన్నది. శీఘ్రంగా బయలు దేరండి'' అని స్వప్నంలో పలికాడు. శ్రీరామానుజులు తెల్లవారగానే సంతోషంతో నిదుర లేచి, ఆ సంగతిని తమ శిష్యులకు తెల్పి, విష్ణువర్ధనుని పిలిపించారు తమ



స్వప్నవృత్తాంతాన్ని అతనికి తెలియజేశారు. అతడు దానిని విని చాలా సంతోషించి, సేవకులద్వారా అరణ్యప్రాంతాన్ని ఛేదింపజేస్తూ శ్రీరామానుజులను వెంబడించాడు. బహుధాన్య సంవత్సరం తైమాసంలో (1099 ఫిబ్రవరి -మార్చినెలలో) భగవద్రామానుజులు యదుగిరిని ఎక్కి, వేదపుష్కరిణీ సరస్తీరంలో **"పరిధానశిలాం దృష్ట్వా ప్రణమంతి ద్విజోత్తమాః"** (పరిధానశిలను దర్శించి బ్రాహ్మణోత్తములు దానికి నమస్కరిస్తారు) అనే రీతిలో పరిధానశిలను దర్శించి, అక్కడ స్నానం చేసి, **"వేదపుష్కరిణీతీరే విశాలే చ శిలాతలే, పరిధానం స జగ్రాహ కాషాయం పరమః పుమాన్"** అనే దత్తాత్రేయునివలె తాముకూడా మళ్ళీ కాషాయాన్ని ధరించి, ముందుకు సాగారు. తిరునారాయణ స్వామి వేంచేసి ఉండే చోటును అక్కడ ఎంత వెదకినా వారు కానలేక "భగవదనుగ్రహం లేనపుడు ఏమి చేయగలం ?'' అని విచారించి అలసటచెంది అక్కడే నిద్రించారు. అపుడు తిరునారాయణ పురస్వామి వీరికి మళ్ళీ కలలో సాక్షాత్కరించి, "కల్యాణసరస్సుకు దక్షిణ దిశ మూలలో గల సంపెంగ తోటలో ఉండే వకుళ (పొగడ) వృక్షానికి దక్షిణంగా తులసీ వృక్షానికి కింద పుట్టలో ఉన్నాను. శ్వేతమృత్తికకూడా కల్యాణసరస్సుకు ఉత్తరంగా గల పర్వతం మూలలో **"శ్వేతద్వీపాత్ ఖగేశేన శుద్ధమృద్ద్రవ్యమాహృతమ్, యాదవాద్రౌ వినిక్షిప్త మక్షయం తన్మదాజ్ఞయా"** (శ్వేతద్వీపంనుండి గరుడునిచే శ్వేతమృత్తిక తీసికొని రాబడి, యాదవగిరిపై ఉంచబడింది. అది నా ఆజ్ఞవల్ల అక్షయంగా ఉన్నది) అనే క్రమంలో శ్వేతమృత్తిక గరుడునిచే శ్వేతద్వీపంనుండి తీసికొనివచ్చి యదుగిరిపై నిక్షిప్తం చేయబడింది. నా మహిమవల్ల అది అక్షయంగా వృద్ధి చెందుతున్నది. మీరెందుకు విచారిస్తారు? మేము మీకు గుర్తుగా ఈ చోటు నుండి మేము ఉండే పుట్టవరకు కోయబడిన తులసి చిగుళ్ళనే గుర్తుగా చేసికొని రండి'' అని ప్రత్యక్ష సమానాకారంగా స్వప్నంలో పలికాడు. శ్రీరామానుజులు నిద్ర లేచి సంతోషించి, ఆ విధంగానే కోయబడ్డ తులసి చిగుళ్ళను ఆధారంగా చేసికొని కల్యాణసరస్తీరాన్ని చేరారు. భగవానుడు పల్కినట్లుగా సంపెంగతోట సమీపంలో మిక్కిలి విస్తృతంగా పెరిగి విస్తరించిన తులసీ వృక్షాన్ని చూచి ఆనందించి, పలు మార్లు దానికి నమస్కరించారు. ఆ తులసీవృక్షం మూలలోని మట్టిని తొలగించగానే **"కమపి యదుగిరిస్థం కాంతిసింధుం దదర్శ"** (అనిర్వచనీయమైన, యదుశైలంలో ఉండే కాంతి సముద్రాన్ని దర్శించారు) అనే రీతిలో పుట్టలోపల బంగారువిమానం కన్పించింది. తరువాత, అందులో వేంచేసి ఉండే నీలవర్ణంలోని భగవానుని మూర్తి సాక్షాత్కరించింది. శకవర్షం ఒకవేయి ఇరవై (1012) సంవత్సరాలు గడిచిన తరువాత

బహుధాన్యసంవత్సరం తైనెల (పుష్యమాసం) శుక్లపక్షంలోని చతుర్దశి తిథి గురువారంతో కూడిన పునర్వసు నక్షత్రంలో (క్రీ.శ.1099 సం॥లో) తిరునారాయణుని రూపాన్ని దర్శించి శ్రీరామానుజులు చాలా ఆనందించారు. అందఱు ససంభ్రమ నృత్యాన్ని చేశారు. శ్రీరామానుజులు శంఖమృదంగ పటహాది సకల మంగళ వాద్యాలను మోగింపజేస్తూ, ప్రభువును పిలిచి, ఆ మూర్తిని చూపించి, క్షీరాభిషేకాన్ని చేశారు. **"పకల్ కణ్డేన్ నారణనై క్కణ్డేన్ కనవిల్ మిక క్కణ్డేన్ మీణ్డవనై మెయ్యే మిక క్కణ్డేన్"** (పగలును చూచాను, నారాయణుని దర్శించాను. స్వప్నంలో చక్కగా దర్శించాను. తిరిగి అతనిని సాక్షాత్తుగా చక్కగా దర్శించాను) అనే రీతిలో తిరునారాయణస్వామిని శ్రీచరణాలనుండి కిరీటపర్యంతం కన్నులార దర్శించి ఆనందించి, తమ శ్రీహస్తాలతో మూడు దినాలు తిరువారాధనను చేశారు. **"మాఱనడి పణిన్దు ఉయ్న్దవన్"** అనే రీతిలో పరమాచార్యులైన నమ్మాళ్వార్లకు తాము మిక్కిలి అభిమతశిష్యులైనందున, **"తమిళ్మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ఱ ముదల్ తాయ్ శడకోపన్ మెయ్మ్బాల్ వళర్త్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** అనే రీతిలో నమ్మాళ్వార్ల ద్రావిడవేదాన్ని పెంచి పోషించినవారు కనుక తండ్రి ధనాన్ని కుమారుడు వినియోగించుకొనేటట్లు, ఐశ్వర్య - కైవల్యాలనే క్షుద్రపురుషార్థాలను విడచి కాదని, తిరునారాయణ స్వామియే ఉపాయం, ఉపేయం- అని నిష్కర్షించే తిరువాయ్మొళి ప్రబంధంలోని **"ఒరునాయకమ్"** అనే దశకాన్ని తిరునారాయణ స్వామికి సమర్పించారు.

## ఉత్సవమూర్తి తిరిగి లభ్యం కావడం :

తరువాత, కల్యాణసరస్సుకు ఉత్తర దిక్కులో గల పర్వతం మూలలో తమ త్రిదండంతో శ్రీరామానుజులు గీఱగా అక్కడ శ్వేతమృత్తిక గోచరించింది. దానిని చూచి వారు చాలా ఆనందించి, దానితో ద్వాదశోర్ధ్వపుండ్రాలను ధరించి, త్రిదండమండితకరపుండరీకులై ప్రకాశించారు. ఆ తరువాత అరణ్యప్రాంతాన్ని ఛేదింపచేసి, అక్కడ ఊరును, దేవాలయాన్ని నిర్మింపజేసి, తిరునారాయణస్వామికి పాంచరాత్రానికి చెందిన సాత్వతసంహితోక్తంగా సంప్రోక్షణాదులను రంగరాజ భట్టర్ ద్వారా జరిపించారు. తిరునారాయణస్వామికి నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలను అన్నిటిని గొప్పగా నిర్వహించడానికి తగినట్లుగా ఉత్సవ విగ్రహం లేదుకదా ! అని శ్రీరామానుజులు వ్యాకులాన్ని పొందారు. అపుడు ఒకనాటి రాత్రి శ్రీరామానుజులకు స్వప్నంలో తిరునారాయణ మూర్తి కనుపించి,



"నా ఉత్సవమూర్తి అయిన రామప్రియులు ఇపుడు ఢిల్లీ నగరంలో తురుష్క ప్రభువు గృహంలో ఉన్నారు. అక్కడకు పోయి తీసికొని రండి'' అని అన్నాడు. శ్రీరామానుజులు ప్రాతఃకాలం కాగానే లేచి తమ స్వప్నాన్నిగూర్చి తమ శిష్యులతో ఆలోచించి వేగంగా ఢిల్లీకి చేరారు. ఢిల్లీనగరప్రభువు వీరిని చూచి ఆహ్వానించి, ప్రణతిపూర్వకంగా చాలా ఉపచారాన్ని చేశాడు. "మీరు వచ్చిన కారణాన్ని తెలియ జేయాలి'' అని అతడు విన్నపించగా, శ్రీరామానుజులు మా కులదైవం అయిన రామప్రియులు ఇక్కడ వేంచేసి ఉన్నాడు. అతనిని మాకు ఇవ్వండి'' అని అపేక్షించగా, రాజుకూడా "ఆ విధంగానే చేస్తాను'' అని, తాను కొల్లగొట్టి చెరసాలలో పెట్టిన అర్చామూర్తులను వెదకికోవలసినదిగా శ్రీరామానుజులతో అన్నాడు. వారు కూడా చెరసాలకు పోయి పరిశీలించి చూచి, అవి తిరునారాయణస్వామి రూపానికి పొసగనందువల్ల ఈ మూర్తులెవ్వరూ కారు- అని తలచి రామప్రియులను (ఉత్సవమూర్తిని) వారిలో చూడలేనందువల్ల విచారిస్తూ ఉండి పోయారు. ఆనాటి రాత్రి రామప్రియులు శ్రీరామానుజులకు కలలో కన్పించి, ''మీరెందుకు విచారిస్తున్నారు? మేము ఢిల్లీ ప్రభువుకుమార్తెచేత ఆరాధింపబడుతూ ఆమె శయనాగారంలో ఉన్నాము. మమ్ములను తీసికొని పోవడం కోసం అక్కడకు రండి'' అని అనగా, శ్రీరామానుజులు ఈ వృత్తాంతాన్ని ప్రభువుకు తెలిపారు. అతడు కూడా - "ఆ విధంగా మీపట్ల స్వామి వ్యామోహాన్ని కల్గి ఉంటే పిలవండి. అతడే వస్తాడు కదా!'' అని అనగా, శ్రీరామానుజులు ''ఆ మూర్తిని నేను చూచి నమస్కరించవచ్చునా?'' అని అడిగారు. ప్రభువు సరే అని తన కుమార్తె శయనగృహానికి శ్రీరామానుజులను తీసికొనిపోయాడు. అక్కడ రామప్రియులను శ్రీరామానుజులు పిలువగా, ఆ అర్చామూర్తి, ఆశ్రితవాత్సల్యం స్ఫురించేటట్లుగా ధరించిన కంచుకంతో, కట్టిన చిఱు మువ్వలతో, పెట్టుకొన్న కస్తూరీనామంతో, ముడుచుకొన్న కాటుక రంగులోని నల్లని కేశాలతో, ముఖంలో వేలాడే పాపిట బొట్టుతో శయ్యనుండి దూకి, తన కాలి చిఱుమువ్వల సవ్వడి ఘల్లుఘల్లుమనగా, అందఱు చూస్తూ ఉండగా వచ్చి శ్రీరామానుజుల తొడపై కూర్చున్నాడు. శ్రీరామానుజులు ఆనందాశ్రువులను వర్షిస్తూ, ఆనందైకార్ణవాంతర్నిమగ్నులై, పులకితసర్వగాత్రులై, తమ వక్షస్థలం, బాహువులు ఉప్పొంగగా **"నా శెల్వపిళ్ళా! వారాయ్!"** (నా సంపత్కుమారా!) అని అంటూ ఎత్తుకొని ఆలింగనం చేసికొన్నారు. ఆనాటినుండి రామప్రియులకు **"శెల్వపిళ్ళై"** అనే తిరునామం కల్గింది. దీనిని చూచిన రాజుకూడా అత్యాశ్చర్యాన్ని పొంది, శ్రీరామానుజుల పాదాలపై పడి

సేవించి, అనేక రీతులలో సత్కరించి బహూపచారసహితంగా సంపత్కుమారులను ఆ యతిసార్వభౌములకు సమర్పించాడు.

శ్రీరామానుజులు అక్కడనుండి బయలుదేరి సంపత్కుమారులను వేంచేపు చేసికొని వేగంగా పయనించి యాదవగిరిని చేరారు. అక్కడ అందఱు సంపత్కుమారులను పుత్రవాత్సల్యంతో అభిమానించి, సంప్రోక్షణాది ప్రతిష్ఠాపురస్సరంగా ఆ మూర్తిని తిరునారాయణమూర్తితో చేర్చారు. శ్రీరామానుజులు తరువాత యాదవగిరిలో నిత్యోత్సవ-పక్షోత్సవ-మాసోత్సవ-అయనోత్సవ-సంవత్సరోత్సవాది మహోత్సవాలను నడపించారు. యతిరాజమఠాన్ని కట్టించి, 52మందికి (కైంకర్య పరులకు) ప్రియమైన, తగిన నిత్యకైంకర్యాన్ని ఏర్పరచారు. **"ఐమ్బత్తిరువర్ శ్రీవైష్ణవర్కళ్"** అనే సముదాయనామాన్ని, ప్రత్యేకమైన దాస్యనామాన్ని వారికి ప్రసాదించి, అక్కడ వారిని నిలిపి, ఏలోటు లేకుండా వారి ద్వారా తిరువారాధనను జరిపిస్తూ వచ్చారు. ఒకనాడు భగవద్రామానుజులు తమ శ్రీచరణసమీపంలో ఉండే ఆచార్యులతో, జీయర్లతో, యాభైరెండుమంది సన్నిధి కైంకర్యపరులతో, చాత్తాద శ్రీవైష్ణవులతోను కలసి వేంచేసి ఉండే సమయంలో యాదవగిరికి **"తిరునారాయణ పురమ్"** అనే నామాన్ని పెట్టి, "ఈ తిరునారాయణపురంలో నిత్యవాసాన్ని చేసేవారికి పెద్దలకు, మనకు కలిగే పరమపదం, ఆచార్యకైంకర్యం లభిస్తుంది'' అని పలికారు.

తిరునారాయణ పురంలో (మేల్కోటెలో) ఉడైయవర్ శిష్యులతో పాటు కలసి తాము వేంచేసి ఉండే సమయంలో, ముదలియాణ్డాన్ యాదవగిరిమహాత్మ్యాన్ని చదువుతూ ఉండేటప్పుడు, **"అనంతః ప్రథమం రూపం లక్ష్మణశ్చ తతః పరమ్, బలభద్ర స్తృతీయస్తు కలౌ కశ్చిత్ భవిష్యతి"** (అనంతుడు మొదటి రూపం. తరువాత రూపం- లక్ష్మణుడు. బలరాముడు- మూడవ రూపం. కలియుగంలో ఒకానొకరు ఆవిర్భవించగలరు.) అనే శ్లోకం రాగానే, "ఈ శ్లోకంలోని చతుర్థ పాదానికి ఏది అర్థం?'' అని కొందఱు శిష్యులు ముదలియాణ్డాన్‌ను అడిగారు. వారు కూడా ఉడైయవర్ ముఖంవైపు చూచారు. ఉడైయవర్‌కూడా "ఆళ్వార్లను ఉద్దేశించి ఋషి ఈవిధంగా పల్కి ఉండవచ్చు'' అని అన్నారు. ఆ సమాధానంతో శిష్యులకు తృప్తి కల్గకపోవడాన్ని గమనించి, "ఈ నాటికి చాలు, తరువాత వ్యక్తం చేస్తాను'' అని శ్రీరామానుజులు అనగా, అపుడు యాదవగిరి మహాత్మ్యగ్రంథాన్ని మూసివేసి, గోష్ఠిని ముగించారు. ఆనాటి రాత్రిలో ముదలియాణ్డాన్, ఎమ్బార్, తిరు నారాయణపురత్తు అరైయర్, మారుతియాణ్డాన్, ఉక్కలమ్మాళ్ - అనే ఈ



అయిదుగురు ఉడైయవర్ శ్రీచరణాలలో దండం సమర్పించి, "దాసులమైన మాకు ఆ అర్థాన్ని దేవరవారు అనుగ్రహించాలి'' అని అనగా, "అయితే దీనిని ఎవరికీ వ్యక్తం చేయకండి. ఇందులో నమ్మకాన్ని కల్గి ఉండడం చాలా దుర్లభం'' అని పల్కి, **"కలౌ కశ్చిత్ భవిష్యతి"** అనే సూక్తికి మేమే విషయం. మా జన్మ సర్వోత్తారకంగా జన్మించిన జన్మ. అందువల్ల అందఱు నన్ను ఆశ్రయించి నిర్భరులై ఉండండి ఏ లోటు లేదు'' అని అన్నారు. ఈ వృత్తాంతం నాయనారాచ్చాన్‌పిళ్ళై రచించిన చరమోపాయ నిర్ణయం అనే గ్రంథంలో ప్రస్తావింపబడినది.

అచటి శ్రీవైష్ణవగోష్ఠికి ఉభయవేదాంతప్రవచనాన్ని చేస్తూ, తిరునారాయణ స్వామికి నిత్యకైంకర్యాలను నిర్వహిస్తూ శ్రీరామానుజులు తిరునారాయణపురంలో వేంచేసి ఉండగా, కొంతకాలానికి తరువాత ఒకనాడు శ్రీరామానుజులు తమ శిష్యులతోపాటు అనుష్ఠానార్థం కల్యాణసరస్తీరానికి వెళ్ళినపుడు శ్రీరంగంనుండి వచ్చిన **మాఱొన్ఱిల్లా మారుతి శిఱియాణ్డాన్, అమ్మఙ్గియమ్మాళ్** అనే ఇద్దఱు శ్రీవైష్ణవులు శ్రీరామానుజులను సేవించి, దండం సమర్పించి "స్వామీ! కూరేశులు, మీ ఆచార్యులైన పెరియనంబి నేత్రదర్శనం కోల్పోవడానికి కారణమైన ఆ చోళుడు గొంతులో పుట్టిన రాచపుండువల్ల మరణించాడు. దేవరవారు మళ్ళీ శ్రీరంగానికి వేంచేసి అనుగ్రహించండి'' అని విన్నపించారు. పరమపాపి అయిన చోళుడు నశించిన విషయాన్ని తమకు తెలిపిన వారిని ఆనందంగా కౌగలించుకొని, ఆనందాశ్రువులు జాలువారగా వారిని ఆశీర్వదించి, "ఇంతదూరం ప్రయాణించి వచ్చి, ఇంతటి మంచి వార్తను చెప్పిన వారికి గొప్పగా ఇవ్వగల్గినది ద్వయం తప్ప ఇంకొకటి లేదు'' అని నిశ్చయించి మళ్ళీ వారికి ద్వయమంత్రాన్ని బహుమతిగా ఉపదేశించారు. తమ సన్నిధిలో ఉండే శిష్యులను చూచి- "ఇది కల్యాణసరస్సు అనే విషయం ఇపుడు సార్థకం కావడాన్ని గమనించాము'' అని అన్నారు. శిష్యులు కూడా "నిజమే'' అని అన్నారు. వారిని తీసికొని శ్రీరామానుజులు ప్రహ్లాదవరదుడైన నృసింహస్వామి కొండను ఎక్కి, ఆ స్వామిని సేవించారు. "భగవద్భాగవతవిషయం అంటే సహించలేని హిరణ్యుని పూర్వం నిరసించినట్లే ఇపుడుకూడా పరతత్త్వమైన నీవు లేవని, సత్పురుషులకు ఉపమానంగా చెప్పబడిన ప్రహ్లాదునివంటి కూరేశులకు, పెరియనంబికి అపచారం చేసిన ఇతనిని కృమికంఠునిగా చేసి నశింపజేశావా!'' అని ఆ స్వామికి విన్నపించి, తీర్థప్రసాదస్వీకారాన్ని చేసి అనుమతిని పొంది కిందకు వచ్చారు. తిరునారాయణపురస్వామి సన్నిధిని చేరి సేవించి, తిరుప్పల్లాణ్డును

అనుసంధించి మంగళాశాసనం చేసి, **"నమో నారాయణాయ"** అని అంటూ అంజలి చేశారు. ఆ భగవానుని శ్రీచరణాలకు నమస్కరించి "ఇక నేను శ్రీరంగానికి పోయి వస్తాను'' అని శ్రీరామానుజులు విన్నపించగా, తిరునారాయణస్వామి చాలాసేపటి వరకు ఏమీ బదులు పల్కనందున - "స్వామీ! నీవే ఇంతకుముందు **"యావజ్జీవం శ్రీరంగే సుఖమాస్వ"** అని అన్నావుకదా!'' అని శ్రీరామానుజులు విన్నపించగా, స్వామికూడా సరే, "ఆ విధంగానే కానివ్వండి'' అని అర్చకముఖంగా పలికాడు.

శ్రీరామానుజులు తరువాత యాభైరెండుమంది కైంకర్యపరులను చూచి "తిరునారాయణస్వామిని, శెల్వపిళ్ళైను (మూలమూర్తి, ఉత్సవమూర్తులను) మంగళాశాసనపూర్వకంగా సదా దర్శిస్తూ యథాకాలం తిరువారాధనను నిర్వహిస్తూ ఉండండి'' అని నియమించారు. వారు శ్రీరామానుజుల పాదాలపై పడి సేవించి, "దేవరవారి శ్రీచరణాలను విడచి మేము క్షణం కూడా ఉండలేము'' అని ఆర్తులై నిలచారు. అపుడు శ్రీరామానుజులు ఆలోచించి, తమ అర్చావిగ్రహాన్ని నిర్మింపజేసి, అందులో తమ దివ్యశక్తిని ఆవాహనజేసి, యాభైరెండు మంది కైంకర్యపరులను పిలచి, "నేను మీకోసం ఈ రూపంలో వేంచేసి ఉంటాను'' అని పల్కి, స్వదివ్యశక్తి పరిపూర్ణమైన ఆ విగ్రహాన్ని వారికి తిరువారాధనగా అనుగ్రహించారు. వారిని చూచి,- "శెల్వపిళ్ళైను నిక్షేపంవలె రక్షించి, **"తిరువిళక్కు (దీపం) తిరుమాలై, శాత్తుప్పడి (అలంకారం)** మొదలైన ఉపచారాలను అన్నిటిని చాలా ఆదరంతో చేస్తూ, ఏద్రోహబుద్ధితో ఏ కీడును తలపెట్టకుండా, అన్యోన్యం సహృదయులై, నిత్యకైంకర్యాలను మఱువకుండా భక్తితో చేయండి'' అని తమ శ్రీచరణాలను వారిచే స్పృశింపజేసి ఆజ్ఞాపించారు. తరువాత, శెల్వప్పిళ్ళైను విడువలేకుండా ఆ స్వామి శ్రీచరణాలను మాటిమాటికి సేవిస్తూ, మనస్సులో ద్రవిస్తూ కన్నులు బాష్పవర్షం జాలువారగా, తిరునారాయణపుర దివ్యవిమానాన్ని, క్షేత్రాన్ని, అక్కడి ఉద్యానవనాలను, శ్వేతమృత్తికలయొక్క గుట్టలను మాటిమాటికి చూస్తూ అంజలిని చేసి మంగళాశాసనాన్ని చేసి, పుత్రవాత్సల్యం వెనుకకు తోయగా, శ్రీరంగనాథుని అనుగ్రహం ముందుకు నడిపింపగా అతికష్టంపై శ్రీరంగాన్ని చేరారు.

**భగవద్రామానుజులు - మేల్కోటై ఆలయకైంకర్యాలు, ఆచారవ్యవహారాలు :**

భగవద్రామానుజులు తిరునారాయణపురంలోని కోవెల పునరుద్ధరణను చేసిన వృత్తాంతాన్ని తెలిపే సందర్భంలో వారికి ఈ ఆలయనిర్మాణ, నిర్వాహాలతో గల సంబంధాన్ని తెలిపే కొన్ని అంశాలు ఇదివరకే ప్రస్తావింపబడ్డాయి. శ్రీరామానుజులు



యాదవగిరి ప్రాంతానికి చేరిన సమయానికి అది ఒకవిధంగా పాడు పడిన చోటు. శ్రీరామానుజులు అచట ఆలయనిర్మాణాదులను అర్చామూర్తులను పునరుద్ధరించడమే గాక ఆ ఆలయ నిర్వహణకు సంబంధించిన పలు సంస్కరించి కట్టుదిట్టాలను, కట్టుబాట్లను ఏర్పాటుచేశారు. ఈ వివరాలు అన్నీ "ఉడైయవర్ నియమనప్పడి" అనే వారి ఆజ్ఞాపూర్వకమైన గ్రంథంలో సూచింపబడ్డాయి. ఈ గ్రంథం ఒక అపూర్వమైన, విలువైన చారిత్రకాధారం. ఈ నియమనిబంధనలు అన్నీ వైదికమైనవి. మనుస్మృతివంటి వివిధస్మృతులకు, శిష్టాచార సంప్రదాయాలకు అనుగుణమైనవి. 7 విధాలైన, వివిధశాఖలకు చెందిన 57 విధాలైన కైంకర్యాలను, వాటిని నిర్వహించడానికి తగిన యోగ్యతలను కలవారిని నిర్ణయించి, (ఆళ్వార్ తిరునగరి ప్రాంతంనుండి రప్పించి) నియమించారు. వారు క్షేత్రంలో ఎక్కడ ఎక్కడ నివసించాలో ఆ విషయాన్నికూడా నిర్ధారించారు. వీరి నివాసాలు ఆలయ పరిసరాలనుండి నగరప్రారంభంవరకు విస్తరించాయి. ఆలయంలోని ఆరాధనాదులు పాంచరాత్రాగమానికి చెందిన సాత్త్వత (ఈశ్వర) సంహితానుగుణంగా నిర్వహింపబడాలని నిర్ధారించారు. శ్రీరంగంనుండి శ్రీరంగరాజభట్టర్‌ను ఆరాధననిర్వహణార్థం రప్పించారు. 52 మంది ఆలయ కైంకర్యపరులుగా యోగ్యతను కల శ్రీవైష్ణవులను నియమించారు. ఆలయసంప్రదాయాలను, ఆచారాలను, ఆలయానికి చెందిన ఆస్తిపాస్తులను తమ అనంతరం తమ ప్రతినిధిగా నిలచి, ఏలోటు లేకుండా నిర్వహించడంకోసం శ్రీయదుగిరి యతిరాజజీయర్ మఠాన్ని నెలకొల్పారు. ఆ మఠవ్యవస్థ ఈనాటికీ అవిచ్ఛిన్నంగా కొనసాగడం విశేషం. తమ ఆజ్ఞను, సంప్రదాయాలను పరిరక్షించి ప్రచారం చేయడానికి ఆనందాళ్వాన్ వంశీయులను, తోళప్పర్‌వంశీయులను, ఆయ్ వంశస్థులను నియమించారు.

విష్ణువర్ధనుడు సమకూర్చిన కోటి బంగారు వరహాల సొమ్మును తిరునారాయణస్వామి ఆలయపునర్నిర్మాణానికి కొంత వినియోగించారు. శ్రీసుదర్శనుని ఆలయాన్ని, తాయార్ ఆలయాన్ని కూడా నిర్మింపజేసి, మిగిలిన సొమ్మును పలు నిత్యనైమిత్తికోత్సవాల నిర్వహణకోసం మూలనిధిగా నిలిపారు. ఆనందమయ విమానం చుట్టూ అందమైన ఆలయనిర్మాణాన్ని చేయించారు. విమానానికి ముందు శుకనాసిక నవరంగ మండపాన్ని, బంగార వాకిలివరకు గల గోపురప్రాకారాదులను కట్టించారు. 52 మంది కైంకర్యపరులను నాల్గు శాఖలుగా విభజించి వారికి తిరువనంతపురదాసర్- తిరుమాలై దాసర్, తిరుక్కుఱుఙ్గడి

దాసర్, యతిరాజదాసర్ అనే దాస్యనామాలను పెట్టారు. ఈ విధంగా తిరునారాయణపురం ఆలయంలోని ఆచారవ్యవహారాల వ్యవస్థకు, కైంకర్యాల వ్యవస్థలకు భగవద్రామానుజులు మూలం. **"రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్"** అనే రీతిలో వారి దివ్యాజ్ఞాప్రభావంవల్లనే ఈనాటికీ ఆ కోవెలలోని వ్యవస్థలు సురక్షితంగా కొనసాగుతున్నాయనడంలో ఏ సందేహం లేదు.

శ్రీరామానుజులు ఎంత గొప్ప పండితులో, అంతటి ఉదారహృదయులు, విశాలమైన భావాలను కలవారు. తిరునారాయణపురం ఆలయపునరుద్ధరణ కైంకర్యంలో విశేషమైన సహకారాన్ని అందించిన అంత్యకులానికి చెందినవారికి **"తిరుక్కులత్తార్"** అనే గౌరవప్రదమైన నామాన్ని పెట్టడమేకాక, వారికి శ్రీరంగం, తిరునారాయణపురం, బేలూరు మొదలైనచోట్ల ఆలయాలలో బలిపీఠం-ధ్వజస్తంభంవరకు ప్రవేశాన్ని కల్గించారు.

**తిరునారాయణపురంకోవెల సంప్రదాయాలలోని కొన్ని విశేషాలు :**

దక్షిణబదరికాశ్రమంగా ప్రసిద్ధి చెందిన తిరునారాయణపురం అష్టోత్తరశత దివ్యక్షేత్రాల సారం. ఇచటి స్వామి అయిన నారాయణుడు వేదాలలో, ఇతిహాసాలలో, పురాణాలలో, ఆగమాలలో, ఆళ్వార్ల శ్రీసూక్తులలో కీర్తింపబడ్డాడు. పూదత్తాళ్వార్లు, నమ్మాళ్వార్లు ఇచటి మూర్తిని తమ మనోనేత్రంతో దర్శించారని పెద్దల అభిప్రాయం. పూదత్తాళ్వార్ల- ఇరణ్డామ్ తిరువన్దాదిలోని **"పకల్ కణ్డేన్"** అనే పాశురం నమ్మాళ్వార్ల **"ఉడైయార్న్ద వాడైయన్"** అనే తిరువాయ్మొళి పాశురం ఇచటి మూర్తిని ఉద్దేశించినవి కావచ్చుననికూడా అభిజ్ఞుల సూక్తి. భగవద్రామానుజులు ఇచటి అర్చామూర్తిని మొట్టమొదట దర్శించినపుడు ఈ రెండు పాశురాలను అనుసంధించినట్లుగా గురుపరంపరాప్రభావంలో పేర్కొనబడడం ఈ విషయాన్ని ఋజువు చేస్తున్నది. శ్రీరామానుజులు **"ఒరు నాయకమ్"** అనే దశకాన్ని ఇచటి స్వామికి సమర్పించిన విషయం కూడా గమనార్హం. ఈ పాశురాలు అన్నీ యదుగిరి నారాయణస్వామి తిరునక్షత్రంనాడు, పునర్వసు ఉత్సవంనాడు అనుసంధించ బడుతున్నాయి. ప్రతినెల హస్తానక్షత్రం నాడు **"ఒరు నాయకమ్"** అనే పాశురాను సంధానం చేయబడుతుంది.

తిరునారాయణపురం ఆలయంలో జరిగే కొన్ని ఉత్సవాలు శ్రీరామాయణ వృత్తాంతాలను స్మరింపజేస్తాయి. కల్యాణోత్సవంనాడు, కల్యాణతీర్థంనుండి తిరిగి వచ్చేటపుడు శెల్వపిళ్ళైముందు, తాయార్ మధ్యలో, శ్రీరామానుజులు చివర వేంచేస్తారు. ఇది **"అగ్రతః ప్రయయౌ రామః సీతామధ్యే సుమధ్యమా, పృష్ఠతస్తు ధనుష్పాణిః లక్ష్మణోఽనుజగామ హ"** అనే శ్రీరామాయణశ్లోకంలో వర్ణింపబడ్డ సన్నివేశాన్ని గుర్తుకు తెస్తుంది. విజయదశమినాడు ఉత్సవంలో బన్నిమంటపం నుండి శ్రీదేవి (తాయార్) తిరిగి వచ్చేటపుడు సీతాదేవి శేషవాహనంలో వేంచేసి పెరుమాళ్ళను స్వాగతం పల్కి, ఆలింగనం చేసికొనే సందర్భం **"తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్, బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"** అనే శ్లోకంలో ప్రస్తుతింపబడ్డ వృత్తాంతాన్ని స్మరింపజేస్తుంది. శ్రీరామానుజులు తిరునారాయణపురం కోవెలను పునరుద్ధరించినపుడు లక్ష్మీదేవి ఆలయానికి సమీపంలోని సంపెంగ చెట్టుకింద నమ్మాళ్వార్ల విగ్రహం దొరికింది. శ్రీరామానుజులు దానిని చూచి చాలా ఆశ్చర్యపడి, ఆ మహనీయులు వైదిక ధర్మానికి చేసిన సేవలకు గుర్తుగా దివ్యప్రబంధానుసంధానం ఆరంభంలో మొదటి ప్రబంధమైన పల్లాణ్డు ప్రబంధానికి ముందు నమ్మాళ్వార్ల స్తుతివిషయక మైన కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని అనుసంధించాలని నియమించారు. నాలాయిర దివ్యప్రబంధాల పొదు త్తనియన్‌ల అనుసంధానంలో కూడా ఇక్కడ ఒక విశిష్టక్రమం ఉన్నది. ఆ క్రమాన్ని అనుసరించి **1.శ్రీశైలేశదయాపాత్రమ్, 2.యో నిత్యమ్, 3. మాతా పితా, 4. భూతం సరశ్చ, 5. లక్ష్మీనాథ, 6. అస్మద్గురు సమారంభామ్, 7. హస్తస్థతాళద్వితయమ్ -** అనే శ్లోకాలు అనుసంధింపబడతాయి.

ప్రతి ఏకాదశితిథినాడు తిరునారాయణస్వామికి నుదుటిపై పచ్చకర్పూర నామం దిద్దబడుతుంది. ఈ సమయంలో గోదాదేవి అనుగ్రహించిన నాచ్చియార్ తిరుమొళి అనుసంధింపబడుతుంది. ఈ సంప్రదాయానికి సంబంధించిన ఐతిహ్యం ఈ విధంగా తెలుపబడుతున్నది. తిరుమలలో ప్రతిశుక్రవారం శ్రీనివాసునకు తిరుమంజనం జరుపబడుతుంది. శ్రీరామానుజులు తమ అంతరంగ శిష్యులలో ఒకరైన అనందాళ్వాన్‌ను ఒకసారి తిరునారాయణపురానికి పంపించారు. అనందాళ్వాన్ తిరుమలనుండి తిరునారాయణపురానికి చేరిన నాడు ఏకాదశీతిథి శుక్రవారం. శ్రీనివాసుని పరమభక్తుడైన అనందాళ్వాన్ తాను ఆ నాడు తిరుమలలో ఉండి శ్రీనివాసుని అభిషేకాన్ని సేవించలేకపోయానే !- అనే విచారాన్ని పొందారు. అనందాళ్వాన్ కోరికను తీర్చడంకోసం తిరునారాయణస్వామి ఆ నాడు శ్రీనివాసునివలె పచ్చకర్పూరనామాన్ని ధరించడమే కాక, ఆ సమయంలో తిరుమలలోవలె నాచ్చియార్ తిరుమొళిని అనుసంధించాలని నియమించాడు. ఆనాటినుండి ప్రతిఏకాదశినాడు ఈ సంప్రదాయం కొనసాగుతున్నది. ఈ విధంగా

పలు విశిష్ట సంప్రదాయాలు తిరునారాయణపురంలో గోచరిస్తాయి.

**బీబీనాచ్చియార్‌వృత్తాంతం :**

బీబీనాచ్చియార్ ఢిల్లీ పాదుషాకుమార్తె. ఈమె పరమభక్తురాలు. ఈమె రామప్రియ అర్చామూర్తిని తన స్వామిగా భావించి అంతఃపురంలో ఆరాధిస్తూ ఉండేది. భగవద్రామానుజులు ఢిల్లీకివచ్చి రామప్రియ అర్చామూర్తిని తీసికొని పోయిన తరువాత స్వామి విశ్లేషాన్ని సహించలేక నిద్రాహారాలు మాని తపస్సు చేసింది. చివరకు భగవత్సాన్నిధ్యాన్ని పొందింది. ఈమె భక్తికి చిహ్నంగా ఈమె మూర్తి శెల్వపిళ్ళై పాదాలవద్ద ప్రతిష్ఠింపబడింది. ఈమె గాథ కన్నడభాషలో గల జానపదసాహిత్యంలో విశేషప్రాచుర్యాన్ని పొందింది. ఈ సాహిత్యంలో నాచ్చియార్ పేరు వరనందిని. వరనందిని, శెల్వపిళ్ళైల ప్రణయగాథ కన్నడ సాహిత్యంలో రమణీయంగా చిత్రీకరింపబడింది. ఈ గాథ హైందవ- మహమ్మదీయుల సామరస్యానికి గుర్తుగాకూడా నిలిచింది. పలువురు మహమ్మదీయులు తిరునారాయణపురంలో శెల్వపిళ్ళైకు జరిగే ఉత్సవాలలో ఈనాటికీ పాల్గొనడం గమనార్హం.

**చారిత్రకదృక్పథంలో మేల్కోటై :**

పలు పురాణాలలో, ఆగమాలలో, ఇతర సాంప్రదాయిక సాహిత్యంలో ఈ యాదగిరివైభవం వర్ణింపబడినందువల్ల సాంప్రదాయికచరిత్రలో ఈ క్షేత్రం ప్రసిద్ధిని, ప్రాచుర్యాన్ని పొందినదే అయినా, చారిత్రకులు తమదైన శైలిలో పరిశోధనను సాగించి, తమకు లభించిన ఆధారాలనుబట్టి దీని ప్రాచీనతను, వైభవాన్ని, వైలక్షణ్యాన్ని తెలిపారు. అందులో కొన్ని అంశాలు సంగ్రహంగా ఇక్కడ ప్రస్తావింప బడుతున్నాయి.

ఈ యాదవగిరి దక్కను పీఠభూమి దక్షిణాగ్రభాగంలో ఉన్నది. అతిప్రాచీన మైన దక్కను పీఠభూమి చారిత్రకంగా ఎంతో ప్రసిద్ధిని పొందినట్లే ఈ క్షేత్రానికి కూడా మిక్కిలి ప్రసిద్ధి చరిత్రదృష్టిలో ఉన్నది. ఈ క్షేత్రానికి సమీపంలో ఉండే తుంకూర్‌జిల్లా పరిసరాలలో ప్రాచీన రాతియుగానికి చెందిన పలు రాతి సాధనాలు, పనిముట్లు లభించాయి. అందువల్ల ప్రాచీనకాలంనుండి ఈ ప్రాంతం మానవ సమాజనివాసానికి నిలయమని తెలుస్తున్నది. అంతేకాక, మేల్కోటై పరిసరాలలో కూడా రాళ్ళతో నిర్మించబడిన సమాధి అవశేషాలుకూడా బయట పడ్డాయి. మధ్య-



ఆధునిక రాతియుగాలలో, లోహయుగంలో కూడా ఈ క్షేత్రం నివాసయోగ్యమైన ప్రాంతమని పలు ఆధారాలు ఋజువు చేస్తున్నాయి.

చరిత్రదృష్టిలో మౌర్యులకాలంనుండి ఈ క్షేత్రానికి చెందిన స్పష్టమైన ఆధారాలు లభిస్తున్నాయి. మేల్కోటై సమీపంలోని శ్రవణబెలగోలవద్దకు చంద్రగుప్త మౌర్యుడు (క్రీ.పూ.4వ శతాబ్ది) వలసపోయినట్లుగా జైనసాహిత్యం తెల్పుతున్నది. అశోకుని కాలానికి చెందిన బ్రాహ్మీలిపిలోని కొన్ని శాసనాలు మేల్కోటై సమీపంలోని చిత్రదుర్గజిల్లా ప్రాంతంలో లభించాయి. అశోకుని కాలంతర్వాత సుమారు ఏడు ఎనిమిదివందల సంవత్సరకాలం పాటు ఈ ప్రాంతానికి చెందిన చారిత్రక వివరాలు ఏమీ దొరకడం లేదు. క్రీ.శ.9వ శతాబ్ది ప్రాంతంలో ఈ ప్రాంతాన్ని పాలించిన గాంగేయుల కాలంనుండి కొన్ని స్పష్టమైన ఆధారాలు దొరుకుతున్నాయి. ఆ కాలంలో ఈ ప్రాంతాన్ని పాలించిన గాంగేయులు, రాష్ట్రకూటులు జైనమతాన్ని ఎక్కువ ఆదరించినా, వైదికమతాలపట్ల వారు సహనాన్ని ప్రదర్శించారనే విషయం పలు హిందూదేవాలయాలకు వారిచ్చిన దానాలనుబట్టి తెలుస్తున్నది. క్రీ.శ.1000 సం॥ల ప్రాంతానికి ఈ ప్రదేశం రాజరాజచోళుని వశమైనది. చోళులు సహజంగానే శైవవైష్ణవ మతాలను, ఆలయాలను పోషించినందున, ఆ ప్రభావం కర్ణాటకలోని మేల్కోటైలో కన్పిస్తుంది. క్రీ.శ.1157 సం తర్వాత కర్ణాటకప్రాంతం హోయసల ప్రభువులకు పూర్తిగా వశమైనది. ఈ వంశానికి చెందిన విష్ణువర్ధనుడు భగవద్రామానుజుల శిష్యుడై, కర్ణాటకప్రాంతంలో శ్రీవైష్ణవమతవ్యాప్తికి కృషిచేశాడు. తొండనూర్ మేల్కోటై పర్వత పాదప్రాంతంలో ఉన్నది. అక్కడ ఉండే మూడు దేవాలయాలు హోయసల రాజులకాలంనాటివి. తిరునారాయణపురంలోని ఆలయంకూడా వీరి ఆదరణను విశేషంగా పొందింది. శ్రీరంగపట్టణంలోని శ్రీరంగనాథాలయం వీరి కాలంలోనే నిర్మింపబడింది.

హోయసలరాజుల అధికారం క్షీణించిన తరువాత క్రీ.శ. 14వ శతాబ్దినుండి 15వ శతాబ్ది వరకుగల మధ్యకాలంలో మేల్కోటై ప్రాంతం విజయనగర ప్రభువుల పాలనలో ఉన్నది. తిమ్మన్న దండనాయుడు మేల్కోటైలోని ఆలయాన్ని, అక్కడి సంప్రదాయాలను సుస్థిరం చేశాడు. విజయనగరరాజులు పలువురు సహజంగా విష్ణుభక్తులు. వారి పాలనలో మేల్కోటై దేవాలయంకూడా స్థైర్యాన్ని, ప్రసిద్ధిని పొందింది.

క్రీ.శ.1578లో ఒడైయార్ వంశీయులు స్వతంత్రాధికారాన్ని సంపాదించారు.

కృష్ణరాజ ఒడైయార్ మేల్కోటైలోని తిరునారాయణస్వామికి గొప్ప భక్తుడు. అతడు పలు దానాలను ఈ ఆలయానికి చేశాడు. 18వ శతాబ్దంలో మరాఠా ప్రభువులకు ఒడైయార్‌లకు మధ్య జరిగిన పలు యుద్ధాలవల్ల మేల్కోటై చాలా నష్టపోయింది. హైదర్‌ఆలీ, అతని కుమారుడు టిప్పుసుల్తాన్ హిందూమతంపట్ల సహనాన్ని కలవారు. టిప్పుసుల్తాన్ పలు కానుకలను మేల్కోటై ఆలయానికి సమర్పించాడు. అతడు కొండపైన వేంచేసి ఉండే యోగనరసింహస్వామికి ఏనుగులను దానం చేసినట్లుగా 1785 సం॥లోని శాసనం తెల్పుతున్నది. టిప్పుసుల్తాన్ తరువాత మేల్కోటై ప్రాంతం ఆంగ్లేయుల వశమైనది. ఇంగ్లీషువారు మేల్కోటై ప్రాంతాన్ని మైసూరు ప్రభువులైన ఒడైయార్‌లకు ఇచ్చివేశారు. ఈ ప్రాంతం 1956 సం వరకు మైసూర్ మహారాజా సంస్థానంలో అంతర్భాగమై, అతని పరిపాలనలో ఉన్నది. రాజసంస్థానాల రద్దుతో ఇది కర్ణాటక ప్రభుత్వ పరిధిలోకి చేరింది.

ఒడైయార్ ప్రభువులలో మూడవ కృష్ణరాజ ఒడైయార్ చాలా గొప్పప్రభువు. అతడు హిందూమతాన్ని, కళలను, సాహిత్యాన్ని, దేవాలయాలను పోషించాడు. అతని కాలంలో మేల్కోటై ఆలయం విశేషమైన ఆదరణను పొందింది.

ఈరీతిలో ఈ క్షేత్రం, ఆలయం కాలగతంగా పలువంశాలకు చెందిన పలువురు ప్రభువుల పాలనలో ఉన్నప్పటికీ, తన వైభవాన్ని, ప్రాముఖ్యాన్ని కోల్పోక పోవడానికి కారణం భగవద్రామానుజుల కృపయే అని చెప్పాలి.

## మేల్కోటై ఒక గొప్ప యోగభూమి :

దివ్యక్షేత్రాలు, అచటి దేవాలయాలు ఉపాసనారూపమైన భక్తికి కేంద్రాలు. మేల్కోటై క్షేత్రం, అక్కడ వెలసిన తిరునారాయణస్వామి కోవెల భక్తికి కేంద్రాలుగా ప్రసిద్ధి పొందడంలో ఆశ్చర్యం లేదు. కాని, విశేషించి ఇక్కడ గోచరించే పలు అంశాలు దీనిని గొప్ప యోగభూమిగాకూడా నిరూపిస్తున్నాయి. ఈ విషయాన్నిగూర్చి శ్రీ రంగప్రియ జీయర్‌స్వామివారు "Malkote as yogabhumi" అనే వ్యాసంలో ప్రస్తావించిన కొన్ని అంశాలు ప్రస్తుతింపబడుతున్నాయి.

శ్రీమన్నారాయణుడు యోగేశ్వరుడు. **"యోగో యోగవిదాం నేతా"** అనే రీతిలో యోగసాధనకు గొప్ప ఆచార్యుడు. మేల్కోటై అనే పేరుకూడా ఇది యోగానికి గొప్ప కేంద్రమనే సంగతి సూచిస్తున్నది. భోగభూమికంటే యోగభూమి ఉత్తమమైనది కదా. ఈక్షేత్రంలో కోనేరులున్నాయి. కులశేఖరాళ్వార్ సన్నిధి



సమీపంలోని **"అక్కాతఙ్గై కుళమ్"** అనే రెండు జంట కోనేరులు (అక్కాచెల్లెలు కోనేరులు) ఆసుర-దైవీస్వభావాలకు సంకేతాలు. స్వచ్ఛమైన జలాన్ని, సాధారణమైన జలాన్ని, చిక్కని, బురదనీటిని కల మూడు కోనేరులు వరుసగా సత్త్వరజస్తమో గుణాలకు చిహ్నాలు. ఈ మూడు కోనేరుల తరువాత ఆలయం వెలసిన ప్రదేశం ఉన్నది. ఇది త్రిగుణాతీతమైన, శుద్ధసత్త్వమయమైన యోగుల దశకు చిహ్నం.

ఇక్కడి వేదపుష్కరిణి పరమయోగిగా కీర్తింపబడే దత్తాత్రేయమహర్షితో అవినాభావసంబంధాన్ని కల్గి ఉన్నది. దత్తాత్రేయుడు అత్రి- అనసూయా దంపతుల పుత్రుడు. అత్రిమహర్షి త్రిగుణాలకు అతీతుడు, అనసూయ అసూయా రహితురాలు- అనే విషయాన్ని వారి నామాలే తెల్పుతున్నాయి. ఇంతేకాక, ఈ క్షేత్రంలో గొప్పయోగిని అయిన మైత్రేయికి, పరమభాగవతులైన అంబరీష, వికుక్షి, రుక్మాంగద, పుండరీకులకు చెందిన కోనేరులున్నాయి. కల్యాణతీర్థంకూడా మహాయోగి అయిన ప్రహ్లాదునితో సంబంధాన్ని కల్గినది. ఈ కోనేరులోని అయిదు బావులు అన్నమయ- ప్రాణమయ- మనోమయ- విజ్ఞానమయ- ఆనందమయ కోశాలకు సంకేతాలు. ఈ అయిదు బావులలో ఒక బావి ఞానప్పిరాన్‌గా కీర్తింపబడే, ప్రపత్తియోగాచార్యుడైన వరాహస్వామి పాదసమీపంలో ఉన్నది వరాహతీర్థమనబడే ఈ బావి ఏనాడూ ఎండదట. ఇది ఆనందమయ కోశానికి గుర్తు.

యోగీశ్వరుడైన నృసింహమూర్తి ఎత్తైన కొండపై వేంచేసి ఉండడం, యోగ-భోగ ప్రదాత అయిన తిరునారాయణమూర్తి, అంతకంటే కింద వేంచేసి ఉండడం కూడా యోగశాస్త్రానుగుణమే. కల్యాణతీర్థానికి పడమటి దిశలో ఉండే అశ్వత్థవృక్షం (రావిచెట్టు) **"అశ్వత్థః సోమసవనః"** అని ఉపనిషత్తులలో కీర్తింపబడే అశ్వత్థవృక్షంగా ప్రసిద్ధి. కల్యాణితీర్థంఒడ్డున ఉండే ఎనిమిది స్తంభాలతోకూడిన మంటపం శ్రీమన్నారాయణుడు వేంచేసి ఉండే అష్టదళపద్మానికి సంకేతం. అష్టతీర్థాలు అష్టాక్షరీమహామంత్రానికి గుర్తు. మేల్కోటై నగరానికి ఉత్తరదిశలో ఉండే వైకుంఠతీర్థం ఉత్తరదిక్కులోని అర్చిరాదిమార్గంద్వారా పయనించి వైకుంఠాన్ని చేరడాన్ని సూచిస్తున్నది.

తిరునారాయణస్వామి ఆలయంలో మూడు బలిపీఠాలను దాటిన తరువాతనే స్వామి గర్భాలయాన్ని దర్శించవచ్చు. ఇహలోక ఐశ్వర్యాన్ని, స్వర్గలోక సుఖాలను, కైవల్యాలను విడచిన తరువాతనే పరమాత్మసాన్నిధ్యం లభిస్తుంది అనే సంగతిని ఇది తెలుపుతున్నది. యదుగిరినాచ్చియార్‌కు ఎదురుగా ఉండే

మంటపంలోని స్తంభాల సంఖ్య ముప్పై. ఇవి గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని ముప్పై పాశురాలకు సంకేతమని పెద్దల సూక్తి. భగవద్రామానుజుల మూర్తికి ఎదురుగా ఉండే తొమ్మిది స్తంభాలు వారిచే ప్రణీతాలైన తొమ్మిది గ్రంథాలకు ప్రతీకలు. ఇక్కడ విస్తృతంగా కన్పించే శ్వేతమృత్తిక ఈ క్షేత్రం శుద్ధసత్త్వమయమైన పరమపదమేనని సూచిస్తున్నది. ఈ రీతిగా ఈ క్షేత్రంలో, దివ్యాలయంలో ఉండే వాతావరణం, సన్నివేశాలు అన్నీ యోగసాధనకు ఆవశ్యకమైన బాహ్యాంతర స్వాస్థ్యానికి దోహదం చేస్తున్నాయి.

## మేల్కోట ఆలయంలో ఉత్సవవిశేషాలు :

ఆలయాలలో జరిగే ఉత్సవాలు నిత్యోత్సవ, నైమిత్తికోత్సవ, కామ్యోత్సవాల రూపంలో పలు విధాలుగా ఉంటాయి. మేల్కోటె ఆలయంలో నిత్యం ఉదయం, సాయంకాలం శాత్తుముఱై, సహస్రనామార్చనలు, సాయంవేళ తిరువందికాప్పు (దివ్విటీసలాం) నిర్వహింపబడతాయి. సహస్రనామార్చన సమయంలో ముకుందమాల, స్తోత్రరత్నం పఠింపబడడం విశేషం. ప్రతినెల హస్తనక్షత్రంనాడు, ఏకాదశినాడు సాయంవేళ తిరునారాయణ స్వామికి కర్పూర తిలకం పెట్టబడు తుంది. ఇక్కడ ఆలయంలో జరిగే విశేషోత్సవాలలో, పాల్గునమాసంలో జరిగే బ్రహ్మోత్సవాలు, అందులో ఆఱవనాడు నిర్వహింపబడే వైరముడిసేవ, రథోత్సవం, చివరినాడు జరిగే ప్రణయకలహోత్సవం ప్రధానం. అవబృథోత్సవం కల్యాణ సరస్తీరంలో జరుగుతుంది. అదేవిధంగా, అన్నకూటోత్సవం, వసంతోత్సవం, పల్లవోత్సవం, శ్రీకృష్ణజయంతి సందర్భంగా జరిగే శిలోత్సవం, ఆణ్డాళ్ తిరువాడిప్పూరం, సెప్టెంబరు - అక్టోబర్ నెలలో జరిగే పవిత్రోత్సవం, పదిదినాలపాటు జరిగే నవరాత్రి ఉత్సవాలు, కృత్తికాదీపోత్సవం, మార్గశీర్షోత్సవం, ఆ సందర్భంలో జరిగే అధ్యయనోత్సవాలు, పునర్వసు ఉత్సవం, అష్టతీర్థోత్సవం, భగవద్రామానుజుల తిరునక్షత్రోత్సవాలు ఈ ఆలయంలో జరిగే ఉత్సవాలలో కొన్ని. ఇంతేకాక, ఆళ్వార్ల, పూర్వాచార్యుల తిరునక్షత్రోత్సవాలు, వరాహజయంతి, నృసింహజయంతి ఉత్సవాలు మఱి కొన్ని. ప్రతినెల ఆరుద్ర (భగవద్రామానుజుల అవతార నక్షత్రం), పునర్వసు (శ్రీరామ), హస్త (తిరునారాయణస్వామి), స్వాతి (నృసింహ), విశాఖ (నమ్మాళ్వార్లు), మూల (వరవరముని), శ్రవణం (వేదాంత దేశికులు), రేవతి (వరాహ) నక్షత్రాలలో విశేషోత్సవాలు నిర్వహింపబడతాయి.



## తిరునారాయణపురం అనాదిగా ఉభయవేదాంతాలకు కేంద్రం :

అనాదిగా తిరునారాయణపురం ఉభయవేదాంతాలకు కేంద్రంగా భాసిల్లింది. దత్తాత్రేయమహర్షి ఇచటనే వేదపుష్కరిణి సమీపంలో వేదాలను ప్రవచించి, వైదిక ధర్మాన్ని ప్రచారం చేసినట్లు నారదీయపురాణోక్తమైన యాదవగిరిమాహాత్మ్యం తెల్పుతున్నది. భగవద్రామానుజులు తిరునారాయణపురంలోని ఆలయాన్ని పునరుద్ధరించిన తరువాత చోళదేశం నుండి పూర్వశిఖాశ్రీవైష్ణవ బ్రాహ్మణులను యజుర్వేదపారాయణంకోసం తీసికొనివచ్చినట్లు తెలుస్తున్నది. మిగిలిన మూడు వేదాల పారాయణను ఇచటి స్థానికవేదపండితులచే ఈనాటికీ నిర్వహింపబడు తున్నది. ప్రతిదినం ఆలయంలోని ఆరాధనలో చివర జరిగే శాత్తుముఱై (సమాపనోత్సవం)లో తిరుప్పావై శాత్తుముఱైకు ముందు తైత్తిరీయోపనిషత్ శాత్తుముఱై జరగడం ఇచటి ఉభయవేదాంతాలకు సమప్రాధాన్యం ఇవ్వబడిన విషయాన్ని తెల్పుతున్నది. **1854** వ సం॥లో వేదవేదాంత బోధినీ సంస్కృత మహాపాఠశాల అనే వేదాధ్యయన సంస్థ (కళాశాల) వేదవేదాంగశాస్త్రాల అధ్యయనంకోసం ప్రారంభింపబడింది. భారతదేశంలోని సంస్కృతకళాశాలలో కాశీనగరంలోని సంస్కృతకళాశాల మొదటిది కాగా, దీనిని రెండవ కళాశాలగా ప్రసిద్ధి చెందింది. ఇది ముమ్మడి కృష్ణరాజ ఒడైయార్ ఆదేశానుసారం స్థాపింప బడింది. తిరుప్పావైకు ఈరాయిరప్పడి, నాలాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని రచించిన తిరునారాయణపురత్తు ఆయ్ స్వామివారు కూడా గొప్ప వేదపండితులు. వీరు శ్రీవరవరమునుల కాలానికి చెందినవారు. భగవద్రామానుజుల శిష్యులైన అనందాళ్వాన్ ఈ ప్రాంతం వారే. వారు రచించిన వేంకటాచలేతిహాసమాల అనే సంస్కృత గ్రంథం వీరికి వేదవేదాంతాలలో గల అగాధవైదుష్యాన్ని బుజువు చేస్తున్నది. ఆ కాలంలో శ్రీరామానుజులచే జయింపబడిన యజ్ఞమూర్తి ఈ ప్రాంతానికి చెందినవారే. తరువాత వీరు అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానార్‌గా ప్రసిద్ధులయ్యారు. వడుగనంబి జన్మస్థలం మేల్కొటై సమీపంలోని సాలగ్రామం. సోమాశియాండాన్ శిఱుపుత్తూర్ ప్రాంతానికి చెందినవారు. శ్రీరామానుజులను విష్ణువర్ధనులకు పరిచయం చేసిన తొండనూర్ నంబి ఇచటివారే. తరువాతి కాలంలోని నంజీయర్ (పూర్వాశ్రమంలో వేదాంతి అనే పేరుతో ప్రసిద్ధులు) మేల్కోటై ప్రాంతానికి చెందినవారు.

అనంతరకాలంలో కూడా ఈ ప్రాంతానికి చెందిన పలువురు పండితులు

ఉభయవేదాంతవ్యాప్తికి కృషిచేశారు. తిరుమలై అయ్యంగార్ (1645-1706) సంస్కృతంలోనేకాక ప్రాకృతభాషలోకూడా గొప్పపండితులు. ఈయన శ్రీచిక్కరాజ ఒడైయార్ (1673-1704) సమకాలీనులు. అతని ఆస్థానమంత్రిగా కూడా పనిచేశారు. యదుగిరినారాయణస్తవం, యదుగిరినాయకీస్తవం, రాజగోపాల స్తవంవంటి పలు కృతులను రచించారు. వీరికి తరువాత శ్రీశింగరాచార్య (1680), శ్రీయోగానందభట్టర్ మొదలైనవారు స్మరణీయులు. అక్కారక్కని మహాభాష్యమ్ అణ్ణంగరాచార్యస్వామి (1800-1884) రచించిన దశకోటిరత్నమాల చాలా ప్రసిద్ధగ్రంథం. ఈ కృతి శ్రీరామశాస్త్రి అనే పండితుడు శివుడే జగత్కారణతత్త్వమని వాదిస్తూ రచించిన నవకోటి అనే గ్రంథానికి ఖండనగ్రంథం. వీరు మూడవ శ్రీకృష్ణ రాజ ఒడైయార్ కాలానికి చెందినవారు. ఈ కాలానికే చెందిన అనంతాచార్యులు (అనందాళ్వాన్) (1823-1863) మహాపండితులు. వీరి వేదాంత వాదగ్రంథాలు సుప్రసిద్ధాలు. సిద్ధాంతసిద్ధాంజనం, కవికల్లోలిని, కృష్ణరాజ యశోడిండిమం, సంపత్కుమార చూర్ణిక ఇత్యాది పలు గ్రంథాలను నిర్మించారు. ధార్వాడ్, పూనా మొదలైన చోట్ల పండితసభలలో పలువురు పండితులను ఓడించారు. పండితరత్నం కుప్పణ్ణ అయ్యంగార్ (1840-1920) శ్రీయదుగిరి యతిరాజ సంపత్కుమార రామానుజస్వామి (1859-1943), ఎంటి నరసింహాచార్య (1867-1935), బాలధన్వి జగ్గు వేంకటాచార్య (1874-1960) మహావిద్వాన్ లక్ష్మీతాతాచార్యస్వామి (1874-1926) మొదలైన పలువురు పండితులు ఎనలేని కృషిచేశారు. ఇచటి స్థలాచార్యపురుషులైన గోమఠం శ్రీనివాస జోస్యర్ అనే వేదపండితులు 1902సం॥లో కృష్ణయజుర్వేదాన్ని ముద్రించారు. ఈ క్షేత్రవాసి అయిన, దొడ్డయాచార్యస్వామి (మహాచార్యస్వామి) వంశానికి చెందిన శ్రీవరదవల్లభాచార్యస్వామి గొప్ప వేదాంతపండితులు. వీరు పురుషసూక్తవ్యాఖ్యానాన్ని రచించారు. ఇక్కడ ఉభయ వేదాంత ప్రవర్తనసభ 1902లో స్థాపింపబడింది. ఇది ఉభయవేదాంతాల ప్రచారం కోసం ఎనలేని కృషి చేసింది.

ద్రావిడవేద వేదాంతవ్యాప్తికికూడా ఈక్షేత్రం అనాదిగా కేంద్రంగా విలసిల్లింది. నాథమునుల కాలంలో నాలాయిర దివ్యప్రబంధం తిరిగి లభించడానికి ఈ క్షేత్రం మూలకారణం కావడం విశేషం. తిరునారాయణపురానికి చెందిన కొందఱు శ్రీవైష్ణవులద్వారా "ఆరావముదే" అనే దశకాన్ని ఆలకించిన నాథమునులు వాటి మాధుర్యానికి ఆశ్చర్యపడ్డారు. తరువాత ఆళ్వార్ తిరునగరికి



పోయి విచారించి కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని పన్నెండు వేల సార్లు జపించి, నమ్మాళ్వార్ల అనుగ్రహాన్ని పొంది నాలాయిర దివ్యప్రబంధాన్ని ఉపదేశంగా పొందిన వృత్తాంతంద్వారా అనాదిగా ఈ ప్రాంతంలో ఆళ్వార్ల దివ్యప్రబంధాలకు గల ప్రాధాన్యం, ప్రాచుర్యం తెలుస్తున్నది. తరువాతి కాలంలో భగవద్రామానుజులు తొండనూర్‌లో నివసించి, ఉభయవేదాంత ప్రవచనాన్ని సాగించారు. అప్పటినుండి ద్రావిడవేదాల, వాటి వ్యాఖ్యానాల ప్రచారానికి ఈ ప్రాంతం ఒక కేంద్రమైనది. శ్రీవరవరమునుల కాలానికి చెందిన తిరునారాయణపురత్తు ఆయ్, తిరుప్పావై ప్రబంధం పై రెండు వ్యాఖ్యలను, ఆచార్యహృదయరహస్యగ్రంథంపై ఒక వ్యాఖ్యను సంతరించడంకూడా ద్రావిడవేదాంత సంప్రదాయం వీరి కాలంవరకు అవిచ్ఛిన్నంగా కొనసాగింది అనే విషయాన్ని ఋజువు చేస్తున్నది. ఆచార్య హృదయగ్రంథంలో తమకు కల్గిన సందేహాలను తీర్చుకోవడం కోసం ఆయ్ స్వామివారిని కలవాలని శ్రీవరవరమునులు తిరునారాయణపురానికి బయలుదేరిన వృత్తాంతంకూడా ప్రకృతవిషయానికి ఇంకొక నిదర్శనం. ఈనాటికీ ఈ క్షేత్రంలో కొనసాగే అరైయర్ సేవాసంప్రదాయంకూడా ద్రావిడవేదానికి ఈ క్షేత్రంలో గల ప్రాధాన్యానికి తార్కాణం.

Academy of Sanskrit Research అనే సంస్కృత పరిశోధనాసంస్థ కర్ణాటక గవర్నమెంట్‌వారి సౌజన్యంతో ఇక్కడ ప్రారంభింపబడింది. ఈ సంస్థ విశిష్టాద్వైతకోశం, శ్రుతప్రకాశికాసహితమైన శ్రీభాష్యం, వేదార్థసంగ్రహంవంటి పలు అమూల్యగ్రంథాలను అందించింది. Melkote Through Ages అనే వ్యాససంకలనాత్మకమైన, పరిశోధనాత్మకమైనగ్రంథంకూడా ఈ సంస్థ ప్రచురించింది. నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొழி ప్రబంధంపై నమ్బిళ్ళై అనుగ్రహించిన ఈడు వ్యాఖ్యను కన్నడ భాషానువాదంతోపాటు ఈ సంస్థముద్రించింది. ఈ సంస్థద్వారా ఉభయవేదాంతాల ప్రచారపరిరక్షణలు విశేషంగా నిర్వహింప బడుతున్నాయి.

యాదవగిరి మాహాత్మ్యంలోని తిరునారాయణ స్వామిని కీర్తించే కొన్ని శ్లోకాలు.

1. సకృదపి ముఖమగ్రే పశ్యతాం యాదవాద్రౌ
   నిఖిలభువనరక్షానిర్నిమేషస్య విష్ణోః ।

సురభితహరిదంతం స్వాగతం ధామ్ని దివ్యే
వదనకమలగంధైః వక్తి వైకుంఠనాథః ॥

2. క్షణమపి నివసంతః కేవలం యాదవాద్రౌ
దహరకుహరయాతా దేవయానప్రయాతాః ।
సకలమపి చ కాలం సానుబంధా లభంతే
పరమపురుషగోష్ఠీపంక్తిమధ్యే నివాసమ్ ॥

3. యదుగిరితటభాజః శృణ్వతే యే చ విష్ణోః
కలితనిగమవాదాన్ కాహళీనాం ప్రణాదాన్ ।
కరణవిగమకాలే తే హి వైకుంఠసేనా -
విజయపటహనాదాన్ విష్వగాకర్ణయంతి ॥

4. చరమచరమశేషం యః పుమాన్ వీక్ష్య నిన్యే
పరమమపి పదం తత్ పావనై రక్షిపాతైః ।
యదుశిఖరినియంతుః తేన నిత్యార్చితాంఘ్రేః
హరిణకులముముక్షుః హంత తస్యైవ శిక్షా ॥

5. దళమపి తులసీనాం దేహినో యాదవాద్రౌ
మధురిపుపదపద్మే నిక్షిపంతః కదాచిత్ ।
ముహురపి విబుధానాం ముక్తిసోపానభాజాం
సురభితహరిదంతాం పుష్పవృష్టిం లభంతే ॥

6. ఇతి నిఖిలజలనానా మీప్సితార్థప్రదాయీ
కులపతిమమరాణా మబ్ధికన్యాపతిర్నః ।
యదుగిరితటభాగే యాచ్యమానో దదాతి
స్వపదకమలసేవారాజ్యసామ్రాజ్యలక్ష్మీమ్ ॥

## తిరునారాయణప్పెరుమాళ్ తనియన్

సనత్కుమార రక్షార్థ మాగతం బ్రహ్మణః పదాత్ ।
యదుశైలస్థితం మీనే హస్తే నారాయణం భజే ॥



శ్రీకౌశిక శ్రీశైలార్యవిరచిత

# శ్రీయదుగిరినాయకీస్తవం

వాధూలశ్రీనివాసార్యకృపాసంపన్న వైభవమ్ ।
కౌశికశ్రీనృసింహార్యం కల్యాణగుణమాశ్రయే ॥

వాధూల శ్రీనివాసాచార్యుల వారి కృపవల్ల చక్కని వైభవాన్ని పొందినవారు, సద్గుణతను కలవారు కౌశిక గోత్రులైన శ్రీనృసింహాచార్యులవారిని ఆశ్రయిస్తున్నాను.

1) శ్రియం దేవీ మశరణః శ్రయే సంశ్రితవత్సలామ్ ।
పత్న్యా యయా భగవతః పారమ్య మవగమ్యతే ॥

ఆశ్రితులపట్ల వాత్సల్యాన్ని కల్గినదైన యదుగిరినాయకి అనే లక్ష్మీదేవిని వేఱొక ఏ దిక్కు (శరణం) లేనివాడనై ఆశ్రయిస్తున్నాను. భగవానునకు ప్రధాన పత్ని అయిన ఈమెవల్లనే ఆస్వామి పరత్వం తెలియబడుతున్నది.

2) ఈషదున్మిషితాపాంగాయత్తతత్త్వత్రయోదయామ్ ।
యతిరాజస్నుషా మీడే యదుశైలేశవల్లభామ్ ॥

యదుగిరి నాయకియొక్క కొంచెం వికసించిన కటాక్షాలవల్ల చిత్తు, అచిత్తు, ఈశ్వరుడనే మూడు తత్త్వాలకు వికాసం కల్గింది. యదుగిరీశునకు మిక్కిలి ఇష్టమైనది (లేక, యదుగిరీశుని వల్లభునిగా కల్గినది), భగవద్రామానుజులకు కోడలు అయిన యదుగిరి నాయకిని స్తుతిస్తున్నాను.

3) క్షీరాంభోధితపఃఫలం కమలినీ సౌగంధ్యసారోదయః
సర్వస్వం పురుషోత్తమస్య శరణం చాస్మాక మార్ద్రాగసామ్ ।
మాంగల్యం భువనోదరస్య మహిమా వాత్సల్యకారుణ్యయోః
క్షేమాయాస్తు సదా సమస్తజగతాం శ్రీర్యాదవాద్రీశ్వరీ ॥

యదుగిరినాయకి అయిన లక్ష్మీదేవి సమస్తజగత్తుకు క్షేమాన్ని కల్గించుగాక! ఈమె, తన తండ్రి అయిన క్షీరాబ్ధి చేసిన తపస్సుయొక్క ఫలం. తామరపూవులోని

సౌగంధ్య (పరిమళ) సారంయొక్క ఉదయం. పురుషోత్తముడైన భగవానునకు సర్వస్వం (సమస్త సంపద). ఆర్ద్రాపరాధాన్ని చేసిన మనవంటివారికి శరణం. సమస్తలో కాలకు శుభకరం. వాత్సల్యం, కారుణ్యం - అనే గుణాల యొక్క మహిమ.

**4)** **మాదృక్షశిక్ష్యజనతత్క్షణరక్షణాయ**
**ప్రేయోనియోజనచణప్రణయావలోకామ్ ।**
**నారాయణప్రణయినీం యదుశైలనేత్రీం**
**దేవీ మనన్యశరణః శరణం ప్రపద్యే ॥**

ప్రేయస్సును (మంచిని) కల్గించడంలో సమర్థమైన, ప్రీతితో కూడిన కటాక్షాలను కల్గినది, యదుగిరివిభుడైన నారాయణునకు ఇష్టమైనది అయిన యదుశైలనాయకీదేవిని నావంటి శిక్షించదగినవారిని తత్క్షణం రక్షించడంకోసం వేఱు ఏ శరణం లేనివాడనై ఆశ్రయిస్తున్నాను.

**5)** **హే శ్రీః! శ్రయాదవాద్రీశ్వరి! తవ శిశిరాపాంగసంపర్కధన్యాః**
**త్రయ్యంతైః సేతిహాసైః నయపథి యువయోస్తత్త్వ మధ్యక్షయంతి**
**సిద్ధోపాయోఽ నపాయో హరి రితరసహాయాసహః త్వం తు తస్య**
**స్వాతంత్ర్యం న్యంచయంతీ జనని! పురుషకారోఽసి తద్వల్లభేతి ॥**

ఓ లక్ష్మీదేవీ! శ్రీయదుశైలనాయకీ! నీ చల్లని కటాక్షాలు సోకినందున ధన్యులైనవారు ఇతిహాసాలతో కూడిన వేదాంతాలతో న్యాయమార్గంలో మీ ఇద్దఱి తత్త్వాన్ని దర్శిస్తున్నారు. (అది ఏ విధంగా? అంటే). హరి అయిన నీ వల్లభుడు వేఱొక ఏ సహాయాన్ని సహించని నిరపాయమైన సిద్ధోపాయం. తల్లీ! నీవయితే, అతనికి వల్లభ అయినందున ఆస్వామికి గల నిరంకుశస్వాతంత్ర్యాన్ని తగ్గిస్తూ, పురుషకారస్వరూపిణివై ఉన్నావు.

**6)** **ఉద్ఘోషయత్పూరుషకారభావమ్ ఉపేయభావం సహజం భవత్యాః ।**
**తన్మంత్రరత్నం యదుశైలబంధౌ ఏకాంత మింధే త్వదనన్యబంధాత్ ॥**

ద్వయమంత్రంలోని పూర్వవాక్యంలోగల శ్రీశబ్దం లక్ష్మీదేవియొక్క పురుష కారభావాన్ని, ఉత్తరవాక్యంలో గల శ్రీశబ్దం ఉపేయత్వాన్ని తెల్పుతున్నవి. ఈ పురుషకార భావం, ఉపేయభావం సహజమైనవి. యదుశైలంలోని సర్వవిధబంధువైన నారాయణుని విషయంలో ఏకాంతమైన ఆ మంత్రరత్నం నీతోగల అనన్యమైన



సంబంధం చేత ప్రకాశిస్తున్నది. (తిరునారాయణస్వామి విషయంలోని శరణాగతిని, కైంకర్యప్రార్థనను తెలిపే ద్వయమంత్రం యదుగిరినాయకితో గల అనన్యమైన సంబంధంచేత ప్రకాశిస్తున్నది.)

**7)** **మ్రదిమసుశీలతాసులభతాఽశ్రితవత్సలతా**
**ప్రణయదయాప్రసాదబుజుతాదిమహార్ఘగుణాన్ ।**
**అయి! జనని! త్వదేకనియతానుపజీవ్య విభుః**
**యదుగిరిదీపికే! భజతి సంశ్రయణీయదశామ్ ॥**

ఓ జననీ! మార్దవం (మనస్సులోని సౌకుమార్యం), సుశీలత్వం సౌలభ్యం, ఆశ్రిత వాత్సల్యం, ప్రణయం, దయ, ప్రసాదం (మనస్సులోని స్వచ్ఛత), ఋజుత్వం మొదలైన గొప్ప విలువైన గుణాలు నీకున్నాయి. యదుగిరిని ప్రకాశింపజేసే మంగళదీపికవంటి ఓయదుగిరినాయకీ! ఆ మహార్ఘగుణాలవల్లనే నీ విభుడైన స్వామి అందఱు తనను ఆశ్రయించదగిన దశను పొందుతున్నాడు.

మ్రదిమ, ప్రణయాది గుణాలు భగవద్విషయంలోను ఆశ్రితవాత్సల్య, సౌశీల్య, సౌలభ్యాది గుణాలు ఆశ్రితుల విషయంలోను కార్యకరాలు - అనే విషయ విభాగాన్ని ఇచట భావించాలి.

**8)** **మాతః! శ్రీయదుభూభృదంగణమణీమంజర్యయం తే పతిః**
**ఫుల్లత్వత్పద పద్మసంభృతరజస్సౌగంధ్యసంధుక్షితః ।**
**శ్రీమానస్తసమాధికః ప్రతిహతావద్యో గరీయాన్ గుణైః**
**భూమా మంగళమంగళం నను పరం బ్రహ్మేతి జోఘుష్యతే ॥**

తల్లీ! శ్రీయదుగిరివిభుని ముంగిటిలో ప్రకాశాన్ని వెదజల్లే మణిమంజరి (మణుల గుత్తి) వంటిదానా! ఈ నీ భర్త అయిన భగవానుడు నీ పాదాలనే వికసించే తామరపూలలోని రజస్సుయొక్క (పాదాలకు అలంకారంగా పూసికొన్న పారాణి, సుగంధద్రవ్యాల పొడియొక్క) సౌగంధ్యం (పరిమళం)తో సంధుక్షితుడై, అందువల్లనే, శ్రియఃపతి అయినాడు. **"న తత్ సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే"**, **"ఒత్తార్ మిక్కారై యిలయాయ"** అనే రీతిలో తనకు సాటి, మేటి అయిన ఇంకొకరు లేనివాడయ్యాడు. ఏ దోషాలు లేనివాడయ్యాడు. సౌమ్యవాత్సల్యాది మేటిగుణాలతో గొప్ప వాడయ్యాడు. భూమా శబ్దవాచ్యుడయ్యాడు. **"మంగళానాం చ మంగళమ్"** అనే

రీతిలో సమస్త మంగళాలకు మంగళాన్ని కల్గించేవాడయ్యాడు. పరబ్రహ్మగా (పరతత్త్వంగా) గొప్పగా కీర్తింపబడు తున్నాడు.

9) పరవ్యూహభేదప్రభిన్నాత్మకాంతానురూపస్వరూపస్వభావానుభావా ।
సదా భోగలీలే సముల్లాసయంతీ ప్రియం గాహసే లక్ష్మి! భద్రాయ న స్త్వమ్॥

ఓ లక్ష్మీదేవీ! పరత్వం, వ్యూహం, విభవం, అంతర్యామి, అర్చ - అనే వివిధ రూపాలను కల భగవానునకు తగిన స్వరూపాన్ని, స్వభావాన్ని కల్గినదానవైనందున గొప్పదానివై, ఎల్లప్పుడు భోగాలను, లీలలను (భోగం నిత్యవిభూతిలో, లీల లీలా విభూతిలో) చక్కగా ప్రకాశింపజేస్తూ నీ ప్రియుడైన (భర్త అయిన) భగవానుని మా క్షేమంకోసం అవగాహిస్తున్నావు. (పొందుతున్నావు)

10) నిత్యాపూర్వనిమేషనిస్పృహమిథోలావణ్యసారోదయా -
స్వాదప్రస్తుతనిస్తరంగజలధిస్తైమిత్య మత్యద్భుతమ్ ।
ద్వంద్వం తద్యదుశైలనేత్రి! యువయోరద్వంద్వ మక్ష్ణాం శతైః
దివ్యే ధామని సూరయః చులకయంత్యాబద్ధదాస్యోత్సవాః ॥

ఓ యదుగిరినాయకీ! తిరునారాయణస్వామియొక్క, నీయొక్క లావణ్యా సారం ఎప్పటికప్పుడు అపూర్వమైనది. కంటిచూపును సైతం సహించలేనిది. అటువంటి మీ ఇద్దఱు ఒకరి లావణ్యసారాన్ని ఇంకొకరు దర్శించి ఆనందిస్తూ, కెరటాలు లేని సముద్రంయొక్క దశవలె, స్తిమితంగా - నిశ్చలంగా ఉండే దశను పొందుతారు. అటువంటి ఆశ్చర్యకరమైన ఆ సన్నివేశాన్ని (మీకు కైంకర్యాన్ని చేయడమనే ఉత్సవంలో) వేఱొక విషయాన్ని దేనినీ భావించని రీతిలో నిత్యసూరులు తమ వందలాది నేత్రాలనే పుడిసిళ్ళతో దర్శిస్తూ అనుభవిస్తారు.

11) ప్రచ్ఛాయస్మితకంబుకంధరలసద్దోర్వల్లితుంగస్తన -
ప్రక్షీణోదరబంధురోరుయుగళ ప్రోన్నిద్రపాదాంబుజమ్ ।
కౌమారాంచితయౌవనాయితదశం లావణ్యసారం తరాం
ఇంధే శ్రీయదుశైలనాథరమణి! త్వద్గాత్రమీషన్నతమ్ ॥

యదుగిరినాథపత్నీ! నీ దివ్యమంగళవిగ్రహం మిక్కిలి స్వచ్ఛమైన చిఱు నవ్వును కల్గినది, శంఖంవంటి కంఠాన్ని కల్గినది, ప్రకాశించే, తీగవలె సుకుమారమైన బాహువులను కల్గినది, ఉన్నతాలైన స్తనాలను కల్గినది, సన్నని నడుమును కల్గినది, అందమైన ఊరుయుగాన్ని కల్గినది, వికసించే తామరపూలవలె అందమైన పాదాలను



కల్గినది, కౌమారదశతో మనోహరమైనది, "యువాఽకుమారః" అన్నట్లు కొంచెం యౌవనదశావిర్భావాన్ని కల్గినది, లావణ్యసారమైనది. భక్తులపట్ల గల ప్రీతివల్ల కొంచెం వంగిన దశను కల్గినది. అటువంటి నీ రూపం మిక్కిలిగా ప్రకాశించుగాక!

12) చూడోత్తంసకిరీటరత్నమకుటాలాలాటనాసామణీ -
తాటంకాంగదహారకంకణకణత్ కాంచీరణన్నూపురా ।
దివ్యస్రక్వసనాంగరాగమకరీపత్రాదయో వా యదు -
క్ష్మాభృన్మంగళదేవతే! తవ వపు ర్వాఽలంక్రియా శంస నః ॥

ఓ యదుగిరీశుని మంగళదేవతా! చూడావతంసం, కిరీటం, రత్నమకుటం- అనే శిరస్సును అలంకరించే భూషణాలు, పాపిటబొట్టు, ముక్కెర, కర్ణాభరణాలు, భుజకీర్తులు, హారాలు, కంకణాలు, మధురంగా ధ్వనించే మొలనూలు, తీయగా సవ్వడి చేసే కాలి అందెలు, దివ్యమైన మాలికలు, వస్త్రాలు, మైపూతలు, మకరికా పత్రాలు - అనే ఇవి నీ దివ్యమంగళ విగ్రహానికి అలంకారాలా? లేక, వీటినే నీ దివ్య రూపం భూషిస్తున్నదా! అనే విషయాన్ని నీవు మాకు తెలియజేయాలి.

13) హారిద్రచూర్ణకలితోల్లసదిందులేఖా -
సౌభాగ్యశాలి తిలకం సునసం నతభ్రు ।
ఆకర్ణనేత్ర మనిశోదితమందహాస -
మంబ! త్వదానన మనుక్షణ మీక్షిషీయ ॥

హరిద్రాచూర్ణం (పసుపు పొడితో చేయబడ్డ శ్రీచూర్ణం) తో దిద్దబడినది. ప్రకాశించే అర్ధచంద్రాకారంలో ఉన్నందున అందమైనది అయిన నుదుటి తిలకాన్ని కల్గినది, అందమైన నాసికను, వంగిన కనుబొమలను కల్గినది, చెవుల వరకు వ్యాపించిన విశాలమైన నేత్రాలను కల్గినది, ఎల్లప్పుడు ఉదయించిన చిఱునవ్వుతో కూడినదైన నీ ముఖాన్ని, ఓ తల్లీ! అనుక్షణం మేము దర్శించాలి.

14) నేతు ర్విభూతియుగసంసృతిసారఖండాః
తత్పుండరీకనయనత్వయశోనిదానమ్ ।
మాదృక్ష దోషగణనావసరాంతరాయాః
జీయాసు రంబ! తవ వీక్షణయోర్విలాసాః ॥

తల్లీ! యదుగిరి నాయకీ! నీ కడగంటి చూపుల విలాసాలు నీ పతి అయిన భగవానుని ఉభయవిభూతుల వ్యాప్తియొక్క సారమైన ఖండాలు, ఆ స్వామి పుండరీకా

క్షుడనే కీర్తిని పొందడానికి మూలకారణాలు, నావంటివారి దోషాన్ని ఆ స్వామి లెక్కించ నీయకుండా అడ్డుకొనే అంతరాయాలు. అటువంటి నీ కటాక్ష విలాసాలు వర్ధిల్లాలి.

15) శ్రీమత్యాంగికసౌష్ఠవే జనని! వా లావణ్యపూరే మనో -
వాక్దూరే తవ సౌకుమార్యవిభవే సౌందర్యసంపద్యపి ।
యద్వద్రీశ్వరి! విభ్రమభ్రమిషు వా కా వా దశా మజ్జతః
కాంతాంతఃకరణస్య తావకదృశోః ప్రాంతే పునః కూణితే ॥

తల్లీ! యదుగిరి నాయకీ! శోభిల్లే నీ ప్రత్యంగసౌష్ఠవం గూర్చిగాని, నీ లావణ్య ప్రవాహం గూర్చిగాని, సౌందర్య సంపదనుగూర్చిగాని భావించడానికి, వర్ణించడానికి నా మనస్సు, వాక్కు శక్తి కల్గినవికావు. నీ విభ్రమాలనే (విలాసాలనే) సుడిగుండాలలో చిక్కుకొని మునకలు వేసే నీ పతియొక్క మనస్సు, నీవు నీ కన్నులతో ఓరగా చూస్తే ఎటువంటి దశను పొందుతుందో కదా!

16) శీలాదేకరసం ద్రుతం కరుణయా స్వామిత్వతః సత్వరం
ప్రేమ్ణా క్షుబ్ధ మనీశ ముత్సుకతయా వాత్సల్యపర్యాకులమ్ ।
మాతః! స్వామిని! యాదవాద్రిరమణప్రాణప్రియే! తే మనః
శంసత్యేవ దృశోర్యుగం శ్రితజనే సౌహార్దకూలంకషమ్ ॥

తల్లీ! యాదవాద్రీశునకు ప్రాణంవలె ప్రియమైన దానా! నీ మనస్సు ఆశ్రితుల పట్ల శీలగుణం కారణంగా ఐకరస్యాన్ని కల్గినది, కరుణవల్ల ద్రవిస్తున్నది, స్వామిత్వ గుణం వల్ల (యజమానురులైనందున) త్వరను కల్గినది, ప్రేమతో కలవరపాటును పొందుతున్నది, వారి క్షేమం పట్ల గల ఔత్సుక్యంచేత అశక్తమై ఉన్నది, వాత్సల్యంచేత మిక్కిలి ఆకులతను పొందినది. సౌహార్దగుణంలో ఒడ్డును తాకుతున్నది. (మిక్కిలి సౌహార్దగుణాన్ని కల్గి ఉన్నది).

యదుగిరినాయకి నేత్రద్వయి భక్తులపట్ల శీలగుణాన్ని, కరుణను, స్వామిత్వాన్ని,ప్రేమను, ఔత్సుక్యాన్ని, వాత్సల్యాన్ని గొప్ప సౌహార్దాన్ని కల్గినది -అని భావం.

17) మందస్మితేన మమ చేతయసీవ జీవం
ఆలోకితై రమృతవర్షమివాదదధాసి ।
మయ్యాశ్రితే యదుగిరీశ్వరి! కిం ను ధత్సే
వాత్సల్యసంభ్రమ మథోత్సుకితేవ ధేనుః ॥



ఓ యదుగిరి నాయకీ! నీ చిఱునవ్వుతో నా ఆత్మకు చైతన్యాన్ని కల్గిస్తున్నావు. నీ కటాక్షాలతో అమృతవృష్టిని కురిపిస్తున్నట్లున్నావు. ఇక, నేను నిన్ను ఆశ్రయిస్తే తన లేగదూడపట్ల ఔత్సుక్యాన్ని కల్గిన ధేనువు వలె, ఎటువంటి వాత్సల్య సంభ్రమాన్ని నీవు పొందుతావో కదా!

18) నిస్సీమభూమకరుణా పరిణాహవద్భిః
నిమ్నోన్నతక్రమనిసర్గపరాఙ్ముఖీనైః ।
వాత్సల్యసార మతివాఙ్మనసం వహద్భిః
మాతః! నిరంతరయ మాం మధురైరపాంగైః ॥

ఓ తల్లీ! అవధి లేని, గొప్పవైన కరుణాప్రవాహాలను కల్గినవి, ఆశ్రితుల హెచ్చు తగ్గుల క్రమాన్ని సహజంగానే గమనించనివి, వాక్కులు, మనస్సుకు అందని వాత్సల్య సారాన్ని కల్గినవి, మధురమైనవి అయిన నీ కటాక్షాలను నిరంతరంవై నా పై ప్రసరింపజేయాలి.

19) అభయవరదహస్తౌ వస్మదాశ్వాసహేతోః
ఇతరకమలహస్తౌ వీశ్వరావర్జనాయ ।
ద్వయ మిద మభినందంత్యంబ! నూనం త్వైతే
స్మితవదనవిశాలాపాంగసుభ్రూవిలాసాః ॥

తల్లీ! అభయముద్రను, వరదముద్రను కల నీరెండు హస్తాలు మాకు ఊరటను కల్గిస్తున్నాయి. పద్మాలవంటి వేఱొక రెండు హస్తాలు (లీలాపద్మాన్ని కల్గిన రెండు హస్తాలు) భగవానుని వశీకరించుకొంటున్నాయి. ఈ రెండిటిని చిఱు నవ్వును కల నీ ముఖంలోని విశాలమైన కటాక్షాలు, చక్కని కనుబొమల కదలికలు అభినందిస్తున్నాయి.

20) యదుగిరిరమణోరస్సౌధసౌభాగ్య మేతత్
నిఖిలనిగమశాఖా పల్లవోల్లాసికల్పమ్ ।
శరణ మశరణానాం శాశ్వతం దైవతం నః
తవ చరణయుగం శ్రీః! సంతతం సంవిధత్తామ్ ॥

ఓ లక్ష్మీదేవీ! నీ రెండు శ్రీచరణాలు యదుగిరీశుని వక్షఃస్థలమనే సౌధం యొక్క సౌభాగ్యం, సమస్తవేదశాఖలలోని చిగుళ్ళవంటివి, ఏ శరణం లేని మాకు

శాశ్వతమైన శరణం, మాకు దైవం. అటువంటి నీ చరణయుగం ఎల్లప్పుడు మా మనస్సులో నిలచి ఉండాలి.

**21)** **నిఖిలచిదచిద్వ్యాపిన్యాత్మేశ్వరేఽప్యనపాయినీ**
**సురనరసమే దేవే తత్తద్విహారసహాయినీ ।**
**దశముఖపురీబందీభావే కిమిత్యకృథా మతిం**
**ద్రవయసి మనో యేనార్యాణాం జనన్యతివత్సలా ॥**

ఓ తల్లీ! సమస్తచిదచిత్తులో వ్యాపించి ఉండే ఆత్మేశ్వరుడైన భగవానుడు సురులలో నరులలో అవతరించి క్రీడారసాన్ని అనుభవించేటపుడు, ఆ స్వామి యొక్క ఆయా విహారాలలో సతతం వెంట ఉండేదానివైన నీవు, నీ పతిని వీడి మఱి రావణుని పురంలో బందీగా పదినెలలకాలం ఉండాలనే సంకల్పాన్ని ఎందుకు చేశావమ్మా? నిన్ను శరణు పొందిన దేవతాస్త్రీల రక్షణకోసమే కదా! అటువంటి గొప్ప వాత్సల్యాన్ని కల నీవు చేసిన ఈ సంకల్పంతో ఆర్యులైన వాల్మీకి, పరాంకుశ పరకాల పూర్వాచార్యాది ఆర్యుల మనస్సును ద్రవీకరింపజేస్తున్నావు కదా!

**22)** **కూపోపాంతచరే శిశావివ మహాపాయైకతానే చిరాత్**
**జీవే సంసరతి త్వమంబ! చకితా కృత్వాఽవతారాన్ బహూన్ ।**
**తత్తత్కాలిక గోపనౌపయికతా మాభూదితీవాన్వహం**
**నాథేనానుగతా యదుక్షితిధరే! బధ్నాసి న స్సంనిధిమ్ ॥**

అమ్మా! (పాడుపడిన) బావి సమీపంలో సంచరించే శిశువువలె గొప్ప అపాయాలకు స్థానమైన సంసారగర్తంలో జీవుడు చిరకాలంగా సంచరించడం గమనించిన నీవు భీతిని పొందినదానవై, నీ మగనితోపాటు పలు అవతారాలను ఎత్తావు. అంతేకాక, అప్పుడప్పుడు ఆయా కాలాలలో ఎత్తిన అవతారాలలో భగవానునితో పాటు అవతరించి ఆశ్రితులతో దోషాలను కప్పి పుచ్చువలసినఅక్కర లేనట్లుగా ఇపుడు నీవు నిత్యంగా నాథుని అనుసరించేదానవై, యదుగిరిలో మాకు నిత్యసాన్నిధ్యాన్ని కల్గిఉన్నావు.

**23)** **అభిమతి మనయన్నిమాం దేశికాః ప్రభవతి భవతీతి విస్రంభితాః ।**
**అహ మహహా! సుదుర్భర స్తద్భృశం జనని! జయతి సాంప్రతం తే దయా॥**



తల్లీ! నీవు మమ్ములను రక్షించడంలో సమర్థురాలవై ఉన్నావనే నమ్మకాన్ని పొందినవారైన పూర్వాచార్యులు ఈ నమ్మకాన్ని మాకు కల్గించారు. అయ్యో! నేను మిక్కిలి దుర్భరుడను (మిక్కిలిగా పాపాలను చేసినందున నీకు భరించడానికి సాధ్యం కానివాడను). నన్ను రక్షించడంద్వారా ఇపుడు నీ దయాగుణం సర్వోత్కృష్టంగా ప్రకాశిస్తున్నది.

**24)** **అస్మాకం జననీ జగత్త్రయగురో రామానుజస్య స్నుషా**
**విశ్వం యస్య వశే స ఏష భవతి భ్రూకింకరో నః పితా ।**
**ఇత్థం బంధశతైశ్చ వత్సలతయాప్యేతత్ పరం ప్రార్థ్యతే**
**యత్ స్యామత్ర పరత్ర చాపి యువయో రేకాంతవిస్రంభభూః ॥**

నీవు మాకు తల్లివి. జగదాచార్యులైన శ్రీరామానుజులకు కోడలు. సమస్త జగత్తును తన వశంలో కల్గిన, మాకు తండ్రి అయిన ఈ భగవానుడు నీకనుబొమల కదలికలకు అనుగుణంగా వర్తించే కింకరుడు. ఈ విధంగా ఉండే వందలాది సంబంధాల కారణంగా, నీ వాత్సల్యగుణం కారణంగా ఈ పరమపురుషార్థాన్ని ప్రార్థిస్తున్నాను. అది ఏమంటే - ఈ లోకంలోను, నిత్యవిభూతిలోను దివ్యదంపతులైన మీ ఇద్దఱియొక్క ఏకాంతమైన విశ్వాసాన్ని పొందినవాడను నేను కావాలి. ఇక్కడ, నిత్యవిభూతిలోను మీ ఇరువురి నమ్మకాన్ని పొంది, మీకు ఏకాంతమైన, నిత్య కైంకర్యాన్ని చేసేవాడను కావాలి.

శ్రీకౌశిక శ్రీశైలార్యవిరచిత

# యదుగిరి నారాయణస్తవం

**1.** అవ : యదుగిరి నారాయణస్తవమనే ఈ స్తుతిని రచించిన తిరుమలాచార్యులనే కవి ఇందులో ద్వయార్థాన్ని అనుసంధించారు. ఈ స్తుతి ఆరంభంలో **"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే"** ఇత్యాది వచనాన్ని అనుసరించి స్తోత్రారంభంలో **"భగవద్వందనం స్వాద్యం గురువందనపూర్వకమ్, క్షీరం శర్కరయా యుక్తం స్వదతే హి విశేషతః"** ఇత్యాది వచనానుసారంగా భగవద్వందనానికి ముందుగా స్వాచార్యవందనాన్ని ఇందులో చేస్తున్నారు.

> **వాధూలశ్రీనివాసార్యకృపాసంపన్న వైభవమ్ ।**
> **కౌశికశ్రీనృసింహార్యం కల్యాణగుణమాశ్రయే ॥**

వాధూల శ్రీనివాసాచార్యుల వారి కృపవల్ల చక్కని వైభవాన్ని పొందినవారు, సద్గుణతను కలవారు కౌశిక గోత్రులైన శ్రీనృసింహాచార్యులవారిని ఆశ్రయిస్తున్నాను.

**2.** అవతారిక : **"స చాచార్యవంశో జ్ఞేయః"** (ఆ ఆచార్యగురుపరంపర తెలియదగినది) అనే శ్రుతివాక్యానుసారం. **"అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్"** (శ్రియఃపతి నుండి మా ఆచార్యుల వరకు గల గురుపరంపరను నమస్కరిస్తున్నాను) అనే అభిజ్ఞుల అనుష్ఠానానుసారంగా గురుపరంపరను ఇందులో స్మరిస్తున్నారు.

> **ఆశాసే షట్పదామోదవహాం గురుపరంపరామ్ ।**
> **శ్రీనారాయణపాదాబ్జమధుధారా మివాపరామ్ ॥**

శ్రీమన్నారాయణుని శ్రీచరణాలనే పద్మాలనుండి స్రవించే వేఱొక తేనెవాకవలె ఉండేది, షట్పదామోదాన్ని- అంటే- ద్వయమంత్రపరిమళాన్ని- కల్గినది (మధుధార పక్షంలో - తుమ్మెదలకు ఆనందాన్ని కల్గించేది - అని భావం) అయిన గురుపరంపరను మనస్సులో ధ్యానిస్తున్నాను.

గురుపరంపర - సదా భగవత్పాదాబ్జ బంధాన్ని కల్గిఉన్నది కనుక, షట్పదామోదాన్ని ప్రకాశింపజేసేది కనుక, సదా పద్మాలతో సంబంధం కల, తుమ్మెదలకు ఆనందాన్ని కల్గించే మధుధారగా ఉత్ప్రేక్షింపబడింది. **"అపరామ్"** అని అన్నందున



గురుపరంపరయొక్క నిరతిశయ భోగ్యత్వం సూచితం. ఈ శ్లోకంలో -**"మంత్రే తద్దేవతాయాం చ తథా మంత్రప్రదే గురౌ, త్రిషు భక్తి స్సదా కార్యా సా హి ప్రథమసాధనమ్"** అని విధింపబడిన మూడు అనుసంధింపబడ్డాయి. షట్పదశబ్దంచే మంత్రం, శ్రీమన్నారాయణ శబ్దంచే తద్దేవత, గురుపరంపరాశబ్దంచే మంత్రప్రదులైన ఆచార్యులు సూచింపబడ్డారు.

**3.** అవతారిక : ఈవిధంగా **"ఆచార్యాణా మసౌ వసౌ విత్యాభగవత్తః"** (ఆచార్యుల పరంపరను వీరు, వీరు - అని భగవానునివరకు అనుసంధించాలి) అనే శాస్త్రవచనానుసారంగా, సముదాయరూపంగా గురుపరంపరను అనుసంధించి కవి, ఆ గురుపరంపరలో నాయమణివంటివారు, యతిరాజ సంపత్కుమారులనే పేరును కల, స్తుతికి విషయమైన రామప్రియులను (ఉత్సవమూర్తిని) అనుగ్రహించడం ద్వారా మహోపకారాన్ని చేసినవారైన శ్రీరామానుజాచార్యులవారిని స్తుతిస్తున్నారు.

> **ఏధతాం యతిరాజస్య సామ్రాజ్యం సర్వతోముఖమ్ ।**
> **యత్ర సంపత్కుమారోఽపి యువరాజపదాస్పదమ్ ॥**

శ్రీయతిరాజుల సామ్రాజ్యం (జగత్తుకు హితాన్ని కల్గించే రీతిలోని శాసనం) సర్వతోముఖంగా వర్ధిల్లుగాక. ఈ యతిరాజసామ్రాజ్యంలో సంపత్కుమారులనే పేరును కల యదుగిరివిభుడుకూడా యువరాజపదాన్ని పొందుతున్నాడు. (యువరాజు, చక్రవర్తి అభిమానానికి పాత్రమై, ఆ చక్రవర్తి నిగ్రహానుగ్రహాలను ప్రవర్తింపజేసేటట్లే, యువరాజైన సంపత్కుమారస్వామి కూడా చక్రవర్తి అయిన శ్రీరామానుజుల అభీష్టానుసారంగా వర్తిస్తాడని భావం. భగవద్రామానుజులు ఢిల్లీశ్వరుని వద్దనుండి శ్రీరామప్రియులనే ఉత్సవమూర్తిని తీసికొనివచ్చిన గాథ ఇందులో సూచితం. యతిరాజసామ్రాజ్యంయొక్క సర్వతోముఖత్వమంటే ఈశ్వరవిషయంలో కూడా అది అడ్డులేకుండా ప్రవర్తించడం.)

**4.** అవ : ఈ విధంగా గురుపరంపరను అనుసంధించిన తరువాత, నిత్యవిభూతి నుండి లీలావిభూతికి అవతరించిన గురుపరంపరలో కూటస్థులైన పరాంకుశ మునిని నమస్కరిస్తున్నారు.

> **వందే భగవతః పాదూం వకుళామోదమేదురామ్ ।**
> **తత్పదామర్శసంపన్న మంజుశింజామనోరమామ్ ॥**

వకుళపుష్పాల సువాసనను నిబిడంగా కల్గిన, భగవానుడైన శ్రీమన్నారాయణుని పాదుకను నమస్కరిస్తున్నాను. (భగవత్ పాదుకాస్థానీయులైన నమ్మాళ్వార్లను నమస్కరిస్తున్నాను) భగవానుని పాదుక, ప్రపన్నులకు ఉపాయంగా, ఉపేయంగా ప్రసిద్ధమైన భగవానుని శ్రీచరణాలను మోయడంవల్ల మనోజ్ఞమైన అందెల సవ్వడిని కల్గినదై మనోహరంగా ఉంటుంది. అదేరీతిలో, భగవత్పాదుకా స్థానీయులైన నమ్మాళ్వార్లు కూడా భగవానుని దివ్యమైన స్వరూపరూపగుణ విభూతిలీలలను ప్రీతిపూర్వకంగా దర్శించి ఆనందించినందున, తదనుభవ పరీవాహరూపంగా మంజుశింజారవంవలె శ్రావ్యమై, ప్రపన్నజన చిత్తానందాన్ని కల్గించే మధురమైన ద్రవిడోపనిషత్తును (తిరువాయ్‌మొళ్ళిని) అనుగ్రహించారు.

5. అవ : ఈవిధంగా దివ్యమిథునానికి (దివ్యదంపతులకు) శేషభూతులైన ఆచార్యులకు ప్రణమిల్లి, పురుషకారం చేయడంద్వారా పరమోపకారాన్ని చేసే యదుగిరినాయకి రూపంలోని లక్ష్మికి నమస్కరిస్తున్నారు.

స్వామీ సుశీల స్సులభః సర్వజ్ఞః సర్వశక్తిధృత్ ।
వత్సలో యత్సహాయ స్తాం వందే యదుగిరీశ్వరీమ్ ॥

యదుగిరినాయకిని సహాయకురాలుగా కల్గినవాడైనందున యదుగిరి విభుడైన తిరునారాయణుడు సకల జీవులకు స్వామి, గొప్ప శీలగుణాన్ని కలవాడు, అందరికీ పొందదగిన సులభుడు, సర్వజ్ఞుడు, అఘటితఘటనాది సర్వశక్తులను కలవాడు, ఆశ్రితదోషాలను భోగ్యంగా స్వీకరించే స్వభావమైన వాత్సల్యాన్ని కలవాడు అవుతున్నాడు. అటువంటి యదుగిరినాయకిని నమస్కరిస్తున్నాను.

6. అవ : ఇంతవరకు లక్ష్మీపర్యంతమైన గురుపరంపరను ప్రణమిల్లి, ప్రథమాచార్యుడైన యదుగిరీశుని స్తుతిస్తూ, స్తోతవ్యవిషయాన్ని నాల్గు శ్లోకాలతో నిర్దేశిస్తున్నారు.

అస్తి స్వస్తివహం లక్ష్మీసంస్తుతం వస్తు నిస్తులమ్ ।
భూనీళాస్తనకస్తూరీభూషితం యదుభూధరే ॥

లక్ష్మీస్వరూపిణి అయిన యదుగిరినాయకితో కూడుకొన్నది, భూదేవి, నీళాదేవుల స్తనాలలోని కస్తూరితో అలంకరింపబడినది, అందువల్లనే "లక్ష్మ్యా సహ హృషీకేశః దేవ్యా కారుణ్యరూపయా, రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే" అనే పాంచరాత్ర సూక్తి రీతిలో, అపేక్షిత సకల శ్రేయస్సులను పొందించేది, స్వరూప



రూపగుణవిభూతులలో తనకు సాటిమేటి వేఱొకటి లేనిది అయిన యదుగిరి విభురూపంలోని వస్తువు (స్తుతిప్రమేయం) మావంటివారు కూడా దరిచేరి ఆశ్రయించేటట్లుగా యదుశైలంపై ఉన్నది. ("నిస్తులం వస్తు యదుభూధరే అస్తి" అని అన్నందున ఆశ్రయణానికి తగిన యదుగిరి విభుని పర్వతసౌలభ్యాలు సూచితాలు.)

7. అవ : యదుగిరిలో వేంచేసి ఉండే తిరునారాయణ స్వామిని ఆ పర్వతంలోని శిఖామణిగా సంభావిస్తూ పల్కుతున్నారు.

సమింధే శ్రీతనులతాస్వర్ణసంబంధబంధురః ।
యదుభూధరకోటీర స్ఫురన్మరకతాంకురః ॥

తీగవలె సుకుమారమైన (బంగారువర్ణాన్ని కల్గినందున) లక్ష్మీదేవి దివ్యదేహమనే స్వర్ణంయొక్క సంబంధంచేత మనోహరమైనవాడు, యదుశైలశిఖరంలో ప్రకాశించే మరకతమణియొక్క అంకురంవంటివాడైన యదుగిరీశ్వరుడు గొప్పగా ప్రకాశిస్తున్నాడు. (కోటీరశబ్దంచేత శిఖరం లక్షితం.)

8. అవ : గడచిన శ్లోకంలో యదుగిరీశ్వరుని తేజోగుణాన్ని పురస్కరించుకొని అతడు మరకతమణిగా ఉత్ప్రేక్షింపబడ్డాడు. ఇందులో ఆ స్వామి సౌగంధ్యం, సౌకుమార్యం మొదలైన గుణాలను కలవాడైనందున ఉత్పలంగా ఉత్ప్రేక్షింపబడుతున్నాడు.

ఈక్షే ప్రతిక్షణం లక్ష్మీపదలాక్షారసోక్షితమ్ ।
శ్రీయాదవాచలశిఖాశేఖరశ్యామలోత్పలమ్ ॥

లక్ష్మీదేవి శ్రీచరణాలకు అలంకరింపబడిన లత్తుకరసంతో ప్రతిక్షణం తడుపబడినది, శ్రీయాదవాచలశిఖరానికి అలంకారమైనది అయిన నల్లకలువవలె ప్రకాశించే యదుగిరీశ్వరుని ప్రతిక్షణం దర్శిస్తాను. ( "ఈక్షే" అని వర్తమానకాలిక క్రియద్వారా యదుగిరివిభుని యొక్క ప్రతిక్షణం నూతనంగా తోచే రమణీయత సూచింపబడింది.)

9. అవ: ఈ రీతిలో ఇంతవరకు తిరునారాయణస్వామియొక్క ఉపేయ స్వరూపాన్ని మూడు శ్లోకాలతో అభివర్ణించి, ఇపుడు ఆస్వామియొక్క ఉపాయత్వాన్ని అనుసంధిస్తున్నారు.

పరేషాం శంఖచక్రాద్యైః స్వేషా మభయముద్రయా ।
హితం ప్రియం చ కలయన్ పాయాద్యదుగిరీశ్వరః ॥

తనపట్ల విముఖతను కలవారికి (లౌకిక సుఖాలపట్ల ప్రావణ్యాన్ని కలవారికి) తన శ్రీహస్తాలలో ధరించిన శంఖచక్రాలను చూపడంద్వారా వారికి హితాన్ని, (తాత్కాలికంగా అహితంగా ఉన్నా, పరిణామంలో గొప్ప సుఖాన్ని కల్గించే హితాన్ని), తనపట్ల శేషత్వభావనను కల భక్తులకు అభయముద్రాప్రదర్శనద్వారా ("మా శుచః" అని పల్కి సకలశోకనివృత్తిని కలుగజేస్తాననే అభయంద్వారా) ప్రియాన్ని కల్గించేవాడై యదుగిరివిభుడు అందఱిని రక్షించుగాక.

**10.** అవ : ఈవిధంగా కవి, ఈ స్తుతిలో వర్ణింపబడే విషయమైన యదుగిరీశ్వరుని యొక్క ఉపాయోపేయత్వాన్ని అనుసంధించారు. ఇక, ఆ యదుగిరి ప్రభువు అనంతగుణాలను కల్గినవాడైనందున ఇదమిత్థంగా పరిచ్ఛేదించి పల్కడానికి సాధ్యం కానివాడు కనుక, ఆ స్వామిని స్తుతించడం ఏవిధంగా సాధ్యం? అనే సందేహాన్ని ఉద్భావించి, అటువంటి స్వామిని స్తుతించాలని యత్నించే తమ మనస్సును ఉద్దేశించి పరిహాసంగా పల్కుతున్నారు.

> **యదభ్యస్తానందామృతజలధికల్లోలకణికా-**
> **రసాస్వాదాధ్మాతా శ్రుతిరపి విహస్తా వివవృతే ।**
> **స్వకీయం సార్వజ్ఞం ప్రభవతి న యస్య స్వవిషయే**
> **యదుక్ష్మాభృన్నాథం తమహహా! వయం స్తోతు ముదితాః ॥**

**"సైషానందస్య మీమాంసా భవతి"** అని భగవానుడైన యదుగిరీశ్వరుని ఆనందగుణమనే అమృతసముద్రంలోని కెరటంలో గల చిన్న కణాన్ని ఆస్వాదించి నంతమాత్రంలోనే వేదంయొక్క కడుపు ఉబ్బిపోయింది. వ్యాకులాన్ని పొంది, ఇక ఆ ఆనందగుణాన్ని గూర్చిన ప్రయత్నాన్ని వేదం **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** అని విరమించింది. సర్వవస్తువిషయకమైన, సార్వకాలికమైన, సార్వదేశికమైన భగవానుని సర్వజ్ఞత్వం కూడా ఆ ఆనందగుణాన్ని పరిచ్ఛేదించి తెలియడంలో సమర్థం కాలేదు కదా. అటువంటి యదుగిరి విభుని మనం స్తుతించాలని ఉద్యమించామే! ఆహా! ఎంత హాస్యాస్పదమైన ప్రయత్నం మనది!

శ్లోకంలోని **"వయ"** మనే బహువచనం పరిహాసార్థకం. ఆనందగుణం అపరిమితం, అత్యంత భోగ్యం కనుక అమృతసముద్రంగా రూపింపబడింది. **"సో అంగ వేద యది వా న వేద"**, **"తనక్కుమ్ తన్ తన్మై అఱివరియానై"** అనే రీతిలో భగవానుని గుణాదులను ఇదమిత్థంగా అతడుకూడా తెలియలేడు.



**11.** అవ : భగవద్గుణాలు అపరిచ్ఛేద్యాలు - ఇన్ని, ఇటువంటివి - అని పల్కడానికి సాధ్యం కానివి, కనుక వానిని పూర్ణంగా స్తుతించడం అసాధ్యమే అయినా, వాటిలో కొన్ని గుణాలను యథామతి స్తుతించడమనే లక్షణాన్ని కల స్తోత్రాన్ని పూర్వాచార్యులు చేసినట్లుగానే, మనం కూడా చేయడం సాధ్యమే కదా! అని అంటూ పూర్వం ప్రస్తావించిన సందేహంగూర్చి సందేహిస్తూ, దానికి సమాధానంగా, భగవత్కృపవల్ల పరావరతత్త్వాల యథార్థజ్ఞానాన్ని తెలిసికొనగల్గిన అటువంటి పూర్వాచార్యులను అనుకరించడం మనకు ఎంతమాత్రం తగదనే విషయాన్ని అప్రస్తుత ప్రశంసాలంకార ప్రక్రియలో ద్రఢీకరిస్తున్నారు.

> **గంతుం వర్త్మ గరుత్మతః ప్రయతతాం ఖంజః స్వయం జానునా**
> **వోఢుం వల్గతు దుండుభః స్వశిరసా శైషీ మశేషాం ధురమ్।**
> **స్వైరం ప్రక్రమతాం వితస్తివిమితః త్రైవిక్రమాన్ విక్రమాన్**
> **ఆచార్యైః స్తుత మా స్తుమో వయ మమీ శ్రీయాదవాద్రీశ్వరః ॥**

గరుత్మంతుని మార్గంలో వెళ్ళడంకోసం కాటుకపిట్ట స్వయంగా తన మోకాలితో ప్రయత్నించనీ! ఆదిశేషుడు తన శిరస్సుతో మోసే భూభారాన్ని మోయడంకోసం జలవ్యాళం తన శిరస్సును ఎత్తనీ. పన్నెండు అంగుళాల పరమితిని కల చాలా పొట్టివాడు త్రివిక్రమునకు చెందిన పాదవిక్షేపాలను చేయడంకోసం ఏమాత్రం విచారించకుండా యథేచ్ఛంగా ఉపక్రమించనీ. మనం కూడా సర్వజ్ఞులైన భగవద్రామానుజుల వంటి పూర్వాచార్యులు స్తుతించిన యాదవాద్రీశుని స్తుతిద్దాం! ఎంత ఆశ్చర్యం! ఎంత తగని పని!

గరుత్మంతుని మార్గాన్ని కాటుకపిట్ట అనుసరించలేనట్లే, ఆదిశేషుడు మోసే భూభారాన్ని జలవ్యాళం మోయలేనట్లే, పొట్టివాడు త్రివిక్రముని పాదవిన్యాసాలను చేయలేనట్లే, మనం కూడా పూర్వాచార్యుల స్తుతిక్రమాన్ని అనుసరించలేమని భావం.

**12.** అవ : ఈ విధంగా రెండు శ్లోకాలతో యదుగిరినారాయణుని స్తోత్రం చేయడంలోని అనుపపత్తిని ప్రతిపాదించిన కవి, ఇపుడు ఇందులో స్తుతించడంలోని సామంజస్యాన్ని నిరూపిస్తున్నారు.

> **అహహ ! గణనాం వ్యక్కుర్వాణా గుణా యదుభూమిభృత్ -**
> **పరిబృఢ! కథం సోఢార స్తే పునః స్తుతిసాహసమ్ ।**

అపి తు భగవన్ ! ఏతే స్వైరం యతీశవశంవదాః
సరసమధురస్మేరాః సంప్రత్యతోఽయ ముపక్రమః ॥

ఓ యాదవాచలాధిపా ! ఇంతటి సంఖ్యను కల్గినవి- అనే లెక్కింపును తిరస్కరించే (సహించని), వాక్కుకు, మనస్సుకు అందనివైన నీ ఆనందాదిగుణాలు విచారించకుండా నేను సాహసంగా చేసే ఈ స్తుతిని ఏవిధంగా సహిస్తాయి? అయ్యో! నాకభిమతమైన స్తుతించాలనే పని దుష్కరమైనదే ! అయినా, నేను నీ గుణాలను స్తుతించడం కొంతవరకు సాధ్యమే. భగవన్ ! నీవు అనంతకల్యాణ గుణాలను కలవాడవైనా, జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజస్సులనే ఆఱు గుణాలను ప్రధానంగా కలవాడవు కనుక, ఒకవిధంగా నిన్ను స్తుతించడం సాధ్యమే. ప్రత్యక్షంగా దర్శించడానికి వీలయినవిగా, భగవద్రామానుజులచే గద్యత్రయాదిగ్రంథాలలో నిరూపింపబడినవిగా. అందువల్లనే ఇపుడు తిరస్కరించడానికి కారణమైన పారుష్యం లేనివిగా, కరుణరసార్ద్రాలై, మధురాలై ఉండేవిగా, నేను చేసే స్తుతిని అంగీకరించేటట్లు ప్రసన్నంగా ఉండేవిగా నీ గుణాలున్నాయి. అందువల్లనే నేను నిన్ను స్తుతించాలనే ఈ ప్రయత్నాన్ని చేస్తున్నాను. పూర్వం విరసాలై, పురుషాలై ఉండే నీ గుణాలు సదాచార్యాశ్రయణంవల్ల సరసాలు, ప్రసన్నాలయినవి. అందువల్ల దరిచేరదగినవై, స్తుతించడానికి వీలయినవి అయినవి - అని భావం.

**13.** అవ : ఈవిధంగా యదుగిరినారాయణస్వామి గుణాలు స్తుతించడానికి వీలయినవి- అనే విషయాన్ని ప్రతిపాదించి, ఇక, ఆ విధంగా స్తుతించాలనే తమ ప్రయత్నంయొక్క ఆవశ్యకతను ఈ శ్లోకంలో కవి ఉపపాదిస్తున్నారు.

**వార్క్షం మాక్షిక మాజిఘృక్షతి న కిం? ఖర్వో న వా దిత్సతే?**
**బాలః కిం శశినం పిపాధయిషతి? శ్రేయో న కిం వాఽలసః? ।**
**తుష్టూషామి తరాం తథా యతిపతేః సంపత్స్తుతం కిం తు తత్**
**సర్వం ప్రాప్యరుచిప్రకర్షజ మితి ప్రాజ్ఞః సమాధిత్సతు ॥**

పొట్టివాడు ఎత్తైన కొమ్మచివర ఉండే తేనెపట్టులోని తేనెను పొందాలని కోరడా ఏమి? బాలుడు చంద్రుని అందుకోవాలని కోరడా ఏమి! అలసుడు (సోమరి వాడు, క్రియలలో అసమర్థుడు) సమర్థుడు పొందదగిన పురుషార్థాన్ని సాధించాలని కోరడా ఏమి! ఆవిధంగానే నేను యతిరాజ సంపత్కుమారులనే పేరును కల యదుగిరీశ్వరుని గొప్పగా స్తుతించాని ఆశపడుతున్నాను. అయితే ఇది ఏవిధంగా తగినది? అంటే, పూర్వం ప్రస్తావింపబడిన పొట్టివాడు ఎత్తులో ఉండే తేనెను



పొందాలని అనుకోవడం, బాలుడు చంద్రుని పట్టుకోవాలని అనుకోవడం, అసమర్థుడు పురుషార్థాన్ని పొందాలని అనుకోవడం- అనే ఇవి అన్నీ పొందాలని ఆశపడే తేనె, చంద్రుడు, పురుషార్థాల విషయంలో గల ప్రీతిప్రకర్షవల్ల కల్గుతాయి- అని అభిజ్ఞులు గ్రహిస్తారు; సమాధానపడతారు.

**14.** అవ : ఈవిధంగా యదుగిరినారాయణుని స్తుతించడం ఆవశ్యకమని తెలిపి, యదుగిరివిభుని స్తుతించడం ఆ భగవానునకు మిక్కిలి ఇష్టమైనది కూడా- అని ఇందులో పల్కుతున్నారు.

**అపి చ మమ వచాంసి ప్రాయశో వేదవాదా-**
**దపి యదుకులనాథం స్వైర మావర్జయంతి ।**
**న కిము మృగమదేందుస్మేరకాశ్మీరలేపా -**
**దపి రమయతి గోష్ఠోపాంతజంబాలచర్చా? ॥**

ఈ యదుగిరినారాయణస్తుతి కర్తవ్యమే కాదు, ఇది ఆ భగవానునకు ముఖోల్లాసాన్ని కల్గిస్తుంది కూడా. ఏవిధంగా, అంటే, అనభిజ్ఞుడనైన నా పల్కులుకూడా నిత్యనిర్దోషాలైన వేదవాక్యాలకంటే మిక్కిలిగా యదుగిరినాథుని యథేచ్ఛంగా ఆకట్టుకొంటుంది. (ఏవిధంగా? అంటే) యశోదాదేవి బలాత్కారంగా పూసిన కస్తూరి, కర్పూర, కుంకుమాది సుగంధద్రవ్య లేపనాలకంటే, తాను ప్రీతితో నిర్మించిన గోశాలల సమీపంలో అంటుకొన్న పంకం (బురద) యదుగిరినాథుని మిక్కిలి ఆనందింపజేయదా? ఏమి!

**15.** అవ : ఈ స్తుతి సాధనకోటిలో అన్వయించదు. ఆ విధంగా అన్వయిస్తే కదా స్తుతించడానికి తగిన అధికారం (యోగ్యత) ఉన్నదా ? లేదా ? అనే ఆలోచన కల్గుతుంది. ఇక దేనిలో అన్వయిస్తుంది? అంటే, మిక్కిలి ఎక్కువగా ప్రియమైన భగవద్గుణాల అనుసంధానరూపమైనందున ఈస్తుతి స్వతః పురుషార్థం సుమా!- అని ఇందులో పల్కుతున్నారు.

**ప్రియం కులధనం ప్రభుం పితర మీశ్వరం మాతరం**
**గురుం ప్రణతవత్సలం పరమబంధు మాపత్సఖమ్ ।**
**యదుక్షితిధరోపరి వ్యవసితాత్మదానం న కో**
**యతిప్రవరనందనం హృదయచందనం వందతే? ॥**

ఆనందమయుడైనందున "**ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమ్**" అని భక్తుల ప్రీతికి విషయమైనవాడు, ఆపదలనుండి రక్షించేవాడైనందున "**కులధనం (కులదైవం)**" అనే రీతిలో కులధనం, అందటిని వశపరచుకొనే ప్రభువు, హితపరుడైనందున తండ్రి, "**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని**" అనే రీతిలో జీవులందటి హృదయాలలో ఉంటూ వారిని నియమించే ఈశ్వరుడు, (లేక, అపేక్షితార్థప్రదుడు- యదపేక్ష్య మపేక్షితు రస్య హి తత్పరిపూరణ మీశితు రీశ్వరతా - అని పరాశరభట్టర్ చేసిన ఈశ్వరత్వ నిర్వచనం), ప్రియపరుడైనందున తల్లి, "**గుశబ్ద స్త్వంధకారః స్యాత్ రుశబ్ద స్తన్నిరోధకః, అంధకార నిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే**", "**జాయ మానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః, సాత్త్వికః స్తు విజ్ఞేయః స వై మోక్షార్థ చింతకః**" అని అజ్ఞానాంధనివర్తకుడైనందున గురువు, "**అపి చేత్ సుదురాచారో భజతే మా మనన్యభాక్, సాధురేవ స మంతవ్యః సమ్యక్ వ్యవసితో హి సః**" అని శేషత్వానుసంధాన ప్రవణులైన భక్తులపట్ల వాత్సల్యాన్ని కలవాడు, (వారి గుణాలను భోగ్యంగా స్వీకరించేవాడు), సాటిలేని గొప్పబంధువు,"**న సంపదాం సమాహారే విపదాం వినివర్తనే, సమర్థో దృశ్యతే కశ్చిత్ తం వినా పురుషోత్తమమ్**" అని ఆపదలలో వెంట ఉండి, రక్షించేవాడు, యాదవాద్రిపై సకలపురుషార్థ రూపమైన తన దివ్యస్వరూపాన్ని "**తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్**" అని భక్తులకు దానం చేసేవాడు, భగవద్రామానుజుల పుత్రస్థానీయుడు (ఆనందాన్ని కల్గించేవాడు), భక్తుల మనస్సుకు చందనంవలె ఆహ్లాదం కల్గించేవాడైన తిరునారాయణ స్వామిని ఎవడు స్తుతించడు? చైతన్యం కల్గినవాడెవడైనా తప్పక స్తుతిస్తాడు.

**16.** అవ : యదుగిరినాథుని చైతన్యం కలవాడెవడైనా తప్పక స్తుతిస్తాడని పల్కి, అటువంటి స్తుతించాలనే ప్రయత్నం తమకు ఉన్నదని తెల్పుతున్నారు.

మహసాం నిధయే త్రయీశిఖామణయే మంగళమంగళాత్మనే ।
యదుభూధరశృంగబంధవే స్పృహయామ్యద్భుత శీలసింధవే ॥

"**తస్య భాసా సర్వమిదం విభాతి**" అని, (ఆ పరమాత్మతేజస్సుతో ఈ జగత్తు అంతా ప్రకాశిస్తున్నది), "**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్, యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్**" (జగత్తును అంతటిని ప్రకాశింపజేసే సూర్యునిలోని తేజస్సు, చంద్రునిలో, అగ్నిలో ఉండే తేజస్సు అంతా



నాకు చెందినదని తెలిసికో) అనే రీతిలో తేజస్సుకు నిధి, "**శ్రుతిశిరసివిదీప్తే**" అనే రీతిలో వేదాంతాలలో ప్రకాశించే మణి, దురితాలను పోగొట్టడంవల్ల, "**యద్యద్విభూతిమత్ సత్త్వం శ్రీమదూర్జితమేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్**" అని శ్రేయస్సును కల్గించడంవల్ల లోకంలో మంగళ వస్తువులుగా ప్రసిద్ధమైన లాజ, అక్షతకుసుమాదులకు కూడా మంగళకరుడైన, యదుగిరిలో వేంచేసి ఉండే గొప్ప శీలగుణాన్ని కల్గిన స్వామిని మనోవాక్కాయాలతో దర్శించి, సేవించి ఆనందించాలని కోరుతున్నాను.

వేదాంతాలను "**త్రయీశిఖ**"గా పల్కినందులకు అనుగుణంగా ఆ వేదాంతాలలో ఉన్నవాడు, దానికి అలంకార భూతుడైన శ్రీమన్నారాయణుని మణిగా పలికారు.

**17.** అవ : ఇంతవరకు స్తోత్రానికి ఉపోద్ఘాతం. ఇక, కవి యదుగిరినారాయణుని స్తుతిస్తూ, మొదటగా ఆ పర్వతాన్ని సమాసోక్తి ప్రక్రియలో కీర్తిస్తున్నారు.

అస్మై నమో యదుగిరిప్రవరాయ సూరి-
సేవ్యాంఘ్రయే విమలసత్త్వగుణోత్తరాయ ।
యః శ్వేతమృత్తిలకితో ధృతవైష్ణవశ్రీః
శ్రీకాంత మవ్యవహితం జగతాం వ్యనక్తి ॥

యదుగిరి అనే గొప్ప పర్వతం నిత్యసూరులచే సేవింపబడే కొండచరియలను కల్గినది. "**వైకుంఠవాసినః సర్వే శేషశేషాశనాదయః, తిర్యక్ స్థావరజన్మాని శ్రయంతే యదుభూధరే**" (వైకుంఠంలో నివసించే ఆదిశేషుడు, విష్వక్సేనుడు మొదలైన నిత్యసూరులు యాదవాచలంలో తిర్యక్‌స్థావర జన్మలను పొందుతున్నారు) అని కదా పురాణవచనం. రజస్తమోగుణాలు లేని శుద్ధసత్త్వమయమైనది. "**సత్త్వోత్తరాణాం భూయస్త్వాత్ స తు సర్వోత్తరో గిరిః**" అని పురాణసూక్తి. ఈ పర్వతం గరుడునిచే తీసికొని రాబడిన శ్వేతమృత్తిక వల్ల తిలకాన్ని (పుండ్రాన్ని) కల్గినది అయినది. గరుడుడు శ్వేతమృత్తికను (తిరుమణ్‌ను) శ్వేతద్వీపంనుండి యదుగిరికి తీసికొని వచ్చిన వృత్తాంతం "**శ్వేతద్వీపాత్ ఖగేశేన శుద్ధం మృద్ద్రవ్యమాహృతమ్, యాదవాద్రౌ వినిక్షిప్త మక్షయం తన్మమాజ్ఞయా**" అనే పౌరాణిక సూక్తివల్ల స్పష్టం. విష్ణుసంబంధమైన, దివ్యమైన విమానాలను, గోపురాలను, మంటపాలను, ప్రాకారాలను, ఉద్యానాలను కల్గినది. జగత్తుకు తిరునారాయణస్వామిని దగ్గరగా సాక్షాత్కరింపజేస్తున్నది. అటువంటి ఈ యదుగిరికి నమస్కారం.

ఈ శ్లోకంలో- శ్లిష్టవిశేషణాల సామర్థ్యంచేత శ్వేతోర్ధ్వపుండ్రధారి, శ్రీవైష్ణవ చిహ్నాలైన తప్తచక్రశంఖ ముద్రలను, తులసీపద్మాక్షమాలికలను కల్గినవాడు, విద్వాంసులైన శిష్యులచే సేవింపబడేవాడు, శుద్ధసత్త్వ స్వభావాన్ని కలవాడు, తన ఉపదేశాలలో శిష్యులకు భగవత్తత్త్వాన్ని సాక్షాత్కరింపజేసేవాడైన ఒక చార్యుని వృత్తాంతం సమాసోక్తి ప్రక్రియలో స్ఫురిస్తున్నది.

**18.** అవ : యాదవాద్రి యొక్క సత్త్వగుణాతిశయత్వాన్ని, అక్కడ ఆశ్రయించి ఉండే తిర్యక్కులయొక్క సత్త్వగుణప్రాచుర్యాన్ని ప్రతిపాదించడంద్వారా దృఢపరుస్తున్నారు.

**చాంపేయాన్యపచిన్వతా ముపవనే మాలాకృతాం శ్రీపతేః**
**ఆకృష్యోపనయంతి యత్ర కపయః స్వైరం దురాపాన్యపి ।**
**ఈడే క్రోడముఖావఖాతవితతావాలావటాసేచన -**
**న్యంచత్కుంజరపుష్కరాంబుశిశిరం శ్రీయాదవక్ష్మాధరమ్ ॥**

ఈ యాదవాద్రిలో తిరునారాయణస్వామికోసం పూమాలికలను కట్టేవారికి ఉద్యానవనాలలోని సంపెంగపూలు చాలా ఎత్తులో ఉన్నందున అందకపోయి నప్పటికీ, జాతి ప్రయుక్తమైన చాపల్యాన్ని కల్గిన అక్కడి కోతులు చెట్ల కొమ్మలను వంచడంద్వారా ఆ పూలు చేతికి అందేటట్లు చేస్తున్నవి. ఈ పర్వతంపై గల వరాహాలు తమ సహజస్వభావంతో తమ ముఖాలతో ఉద్యానాలలో నేలపై తవ్విన గోతులు అక్కడ ఉండే చెట్లకు ఆలవాలాలు (పాదులు)గా పరిణమించి, ఆ వృక్షాలకు నీరు పోయడానికి ఉపయోగపడుతున్నవి. ఆ పాదుల మధ్యభాగాలను యదుగిరి ఏనుగులు, నీటిని పీల్చిన తమ తొండాలను వంచి నీటితో నింపుతున్నాయి. ఆ నీటితో ఆ కొండ చల్లగా ఉన్నది. అటువంటి సత్త్వగుణపూర్ణాలైన తిర్యక్కులను కల యాదవాద్రిని నేను స్తుతిస్తున్నాను.

**19.** అవ : ఈ విధంగా సత్త్వోత్తరమైన యాదవాద్రి యొక్క మోక్షహేతుత్వాన్ని అనుసంధిస్తూ, తాము ఆ పర్వతంపై నిత్యవాసాన్ని చేయాలనే తమ ఆశను వ్యక్తం చేస్తున్నారు.

**యత్రానుషంగికనివాసలవోఽపి సూరి-**
**సంసద్దురావినిమయశ్రియ మాతనోతి ।**



**తాసు ప్రసన్నహరిచందనశేఖరాసు**
**శ్రీయాదవాచలతటీషు కుటీ ముపేయామ్ ॥**

యాదవాద్రిలో వాణిజ్యం మొదలైన ప్రయోజనాంతరాలను ఉద్దేశించి చేసిన నివాసం అత్యల్పకాలమైనా, అది నిత్యముక్తుల పరిషత్తును నిర్వహించడమనే (సర్వావస్థోచితమైన అశేషమైన శేషవృత్తి- అనే) సంపదను విస్తరింపజేస్తుంది. చక్కగా అందంగా పెరిగినందున కంటికి ఇంపుగా ఉండే హరిచందనవృక్షాలను శిఖరాభరణంగా కల్గిన శ్రీయాదవాద్రిలోని ప్రదేశాలలో చిన్నగుడిసెను అయిన కల్గినవాడను కావాలి. (**"అథ వా యదుశైలనిత్యవసతిః"** అనే శ్రీరామానుజ చరమోపదేశసూక్తి స్మరణీయం.)

యాదవాద్రిలో క్షణకాలంమాత్రం నివసించే భాగ్యాన్ని పురుషుడు ఆ పర్వతంపై వేంచేసి ఉండే తిరునారాయణస్వామి యొక్క సౌలభ్య సౌశీల్యాది కల్యాణగుణాలను దర్శించాలని వైకుంఠంనుండి దిగి వచ్చిన నిత్యముక్తులచే ప్రార్థింపబడి, యాదవాద్రిపై వారు నివసించడానికి కావలసిన వసతిని ఇచ్చి, దానికి వినిమయంగా వైకుంఠనాథుని సేవించడానికి ఉపయోగించే నిత్యవిభూతివాసాన్ని పొందుతాడని భావం.

**20.** అవ : ఈ విధంగా సామాన్యంగా యాదవాద్రిని స్తుతించి, అక్కడ శ్రీనృసింహస్వామి అధిష్ఠించి ఉండే యాదవాద్రిశిఖరాన్ని అనుసంధిస్తున్నారు.

**ఇయ మభివంద్యతాం యదుధరాధరమౌళిధృతా**
**నృహరిగృహాంత గోపురసమున్నతి రున్మిషితా ।**
**పరిణతభూరిభాగ్యజనలోచనభృంగకులం**
**లలితవతంసకైతకశిఖేవ సుఖాకురుతే ॥**

యదుగిరి శిఖరంచే ధరింపబడినదై, వ్యక్తంగా ప్రకాశిస్తూ ఉండేదైన ప్రహ్లాదవరదుడైన శ్రీనృసింహస్వామియొక్క దివ్యాలయసీమలోని గోపురంయొక్క ఔన్నత్యం, పరిణతి చెందిన గొప్ప సుకృతాన్ని కల్గిన జనుల నేత్రాలనే తుమ్మెదలకు అందమైన మొగలిపూవు యొక్క శిఖవలె (అగ్రభాగం వలె) ఆనందాన్ని కల్గిస్తున్నది. ఆ విధంగా ప్రత్యక్షంగా దర్శింపబడేది అయిన ఈ గోపురం యొక్క ఔన్నత్యం నమస్కరింపబడుగాక!

"నరసింహగిరిం దృష్ట్వా దూరే నమత భక్తితః, యస్య దర్శనమాత్రేణ దూరం గచ్ఛతి దుష్కృతమ్" (నృసింహస్వామి వేంచేసి ఉండే పర్వతాన్ని దూరంనుండి దర్శించి భక్తితో నమస్కరించండి. దానిని దర్శించినంతలోనే పాపం దూరంగా వెళ్ళిపోతుంది) అనే యాదవగిరిమాహాత్మ్య సూక్తి స్మరణీయం.

**21.** అవ : ఇందులో యదుగిరిసమీప ప్రదేశాలను స్తుతిస్తున్నారు.

**రహసి సహరిరంసాయాతకంసారికాంతా-**
**చరణకమలసిక్తాలక్తరక్తోపకంఠాః ।**
**యదుధరణిభృతోఽమీ జన్మకాంతారపాంథ-**
**శ్రమహరతరువృష్టాః సానవో నః పునీరన్ ॥**

ఏకాంతంలో పరస్పరం క్రీడించడంకోసం వచ్చిన శ్రీకృష్ణుని పత్నులైన రుక్మిణీదేవి మొదలైన కాంతల పాదపద్మాలకు (వారు) అలంకారంగా పూసికొన్న లత్తుకరసంచేత యదుగిరి సమీపప్రాంతాలన్నీ ఎఱ్ఱగా అవుతాయి. జన్మ అనే మహారణ్యంలోని దుర్గమమార్గంలో ప్రయాణం చేసే సంసారిజనులకు కలిగే శ్రమను తీర్చే వృక్షాలతో మనోహరమైన ఆ యదుగిరి సమీపప్రాంతాలు మనలను పునీతులను చేయాలి.

ఇక్కడ "శ్రమహరతరువృక్షాః" అనే ప్రయోగం సంసారుల శ్రమను తీర్చే కల్పవృక్షంవంటివారైన శ్రీవైష్ణవులను తెల్పుతున్నదని చెప్పవచ్చు. శ్రీకృష్ణుడు తిరునారాయణస్వామిని అర్చించిన వృత్తాంతం ఆ క్షేత్రమాహాత్మ్యంలో దర్శించవచ్చు.

**22.** అవ : యదుగిరి సానుప్రదేశాలను శ్రీరామచంద్రుడు శ్రీబలభద్రస్వామి, శ్రీకృష్ణస్వామి, దత్తాత్రేయుడు, భగవద్రామానుజాచార్యులవారు మొదలైనవారు అభిమానించినందున వాటిలోని భోగ్యతాతిశయాన్ని అనుసంధిస్తూ, అక్కడే తాము నిరంతరం నివసించాలని ఆశపడుతున్నారు.

**రఘుపతిచాపకోటిదృఢకుట్టనవిస్ఫుటితోపలోచ్ఛల-**
**ద్విమలఝరీషు కృష్ణబలరోపితతకల్పమహీజరాజిషు ।**
**యతిపతిపాదరేణుపరిమర్శపవిత్రశిలాసు నిర్భరాః**
**యదుగిరిసానుసీమసు రమేమహి సాభిమతాః సమా శ్శతమ్ ॥**



యాదవాద్రి సానుప్రదేశాలు ఎటువంటివి? అంటే, శ్రీరామచంద్రుడు తన ధనుస్సుయొక్క అగ్రభాగంతో దృఢంగా ఆ సానుప్రదేశాలను తాకినందున అక్కడ బ్రద్దలైన పాషాణ ప్రదేశాలనుండి పెల్లుబికిన స్వచ్ఛమైన నీటి ప్రవాహాలను కల్గినవి. (**"పత్న్యా సహ విశాలాక్ష్యా నిత్యం నారాయణార్చనమ్, అకరోద్ది పురా రామః శ్రీమాన్ కాకుత్స్థవంశజః"** - కకుత్స్థవంశంలో జన్మించిన శ్రీరామచంద్రుడు పూర్వం నిత్యం విశాలమైన కన్నులను కల తన పత్ని అయిన సీతాదేవితో పాటు యాదవగిరిలోని నారాయణుని అర్చనను చేశాడు కదా!) అని పౌరాణికసూక్తి. యాదవాద్రిలో నివసించే సమయంలో శ్రీరాముడు ధనుష్కోటి అనే తీర్థాన్ని ఉద్భవింపజేశాడని పౌరాణిక ప్రసిద్ధి. శ్రీకృష్ణుడు, బలరాముడు నాటిన కల్పవృక్ష సమూహాలనుకల్గినవి. (శ్రీకృష్ణుడు దేవేంద్రుని ఉద్యానవనం నుండి తీసికొనివచ్చిన కల్పవృక్షంయొక్క బీజాలను తెచ్చి ఇక్కడ నాటాడని భావం) యతిపతులైన దత్తాత్రేయుల, భగవద్రామానుజుల పాదరేణువుల సంబంధంచేత ఈ సానుప్రదేశాలలోని శిలలు పవిత్రాలయ్యాయి. (దత్తాత్రేయ మహర్షి ఇక్కడే సన్న్యాసాన్ని స్వీకరించారని పురాణోక్తి. పూర్వం కృమికంఠ చోళునివల్ల కల్గిన ఉపద్రవం కారణంగా శ్వేతవస్త్రధారియై, శ్రీరంగాన్ని వీడి యాదవాద్రిని చేరిన శ్రీరామానుజులు ఇక్కడ గల పరిధానశిలపై మళ్ళీ కాషాయవస్త్రాలను స్వీకరించారని చరిత్ర ప్రసిద్ధి) ఇటువంటి వైభవాన్ని కల్గిన యదుగిరిసానుప్రదేశాలలో అభిమతజనులతో కలసి, సత్త్వోద్రేకాన్ని కల యాదవాద్రిలో నివాసం వల్ల, శ్రీవైష్ణవులతో సహవాసం వల్ల నిర్భయ నిర్భరులమై నూఱు సంవత్సరాల కాలం ఆనందిస్తాము.

**23.** అవ : ఇంతవరకు యదుగిరి సానుప్రదేశాలను అనుసంధించి, ఇక, అక్కడ ప్రవహించే కొండవాగులనుగూర్చి అనుసంధిస్తున్నారు.

**కురవకమల్లికావకుళచంపకకుందలతా-**
**ర్పితకుసుమావతంస మకరందరసోపచితాః ।**
**యదుకులదేవతాపదసరోజపరాగధరాః**
**చిర మవగాహిషీయ యదుశైలఝరీలహరీః ॥**

యాదవాద్రిలోని కొండవాగులు- ఆ కొండపైగల కురవకం, మల్లిక, వకుళం, సంపెంగ, కుందం మొదలైనవాని సుకుమారమైన తీగలకు పూచి రాలిన పూలరూపంలోని కిరీటాలతో అర్పించిన మధురసాలతో అభివృద్ధిని చెందిన నీటిని

కల్గినవి. యదుకులదైవమైన శ్రీమన్నారాయణుని పదపద్మాలలోని పరాగాన్ని కల్గినవి. (లేక, శ్రీకృష్ణుడు అచటి కొండగవాగులలో విహరించినందున ఆస్వామి పాదపద్మపరాగాన్ని ఆ కొండవాగులు కల్గి ఉన్నవి) అటువంటి పరమపవిత్రాలైన, యదుగిరిలోని కొండవాగులలో చిరకాలం స్నానమాడతాను.

**"లతార్పితకుసుమావతంసమకరందరసోపచితాః ఝరీః"** అని అన్నందున లతలు అలంకారం చేసే ప్రసాధికలని, ఝరులు నాయికలనే అర్థం సమాసోక్తి ప్రక్రియలో స్ఫురిస్తున్నది.

**24.** అవ : ఇక. యాదవాచలంలో సంబంధం కల్గిన అన్నిటినీ స్తుతిస్తున్నారు.

**పదే తత్ర విష్ణోః పరత్వానుభూత్యా**
**పరం నిర్వృతా స్తస్య సౌలభ్యలోభాత్ ।**
**యదుక్ష్మాభృదంతే వసంత్యత్ర ముక్తా**
**నుమ స్తాన్ సమస్తాన్ చరస్థాస్నురూపాన్ ॥**

శ్రీవైకుంఠంలోని ముక్తులు అక్కడ భగవానుని దివ్యమంగళ విగ్రహంలోని పరత్వంయొక్క అనుభవంతో మిక్కిలి సంతుష్టులై, ఆ విష్ణువుయొక్క సౌలభ్యాన్ని, అనుభవించడంలో గల లోభం (తీవ్రమైన ఆసక్తి) చేత ఇక్కడ యదుగిరి ప్రాంతంలో నివసిస్తున్నారు. మానవస్థావరరూపాలను పొందిన ఆ ముక్తులను అందరినీ స్తుతిస్తాము.

**25.** అవ : ఇపుడు యాదవాద్రిలోని వైకుంఠగంగ అనే తీర్థాన్ని అనుసంధిస్తున్నారు.

**అధూర్జటిజటాటవీతటకపాలసంపూరణామ్**
**అజహ్నుజఠరానలక్వథనఖిన్నయాదఃకులామ్ ।**
**అసాగరచితావనోపచిత సాస్థిభస్మోత్కరామ్**
**అనుజ్ఝితయదుక్షమాధరపదాం భజే స్వర్నదీమ్ ॥**

యదుగిరిలోని వైకుంఠగంగా తీర్థం ఎటువంటిది ? అంటే, రుద్రుని జటలనే అటవీప్రాంతంలోని బ్రహ్మకపాలాన్ని తన నీటితో పూరించనిది. జహ్నువు- అనే రాజర్షియొక్క జఠరాగ్నిచే కుతకుతలాడి ఖేదాన్ని పొందిన జలజంతుసమూహాన్ని లేనిది. కపిలమహర్షి కోపాగ్నిచే దగ్ధమైన అరవైవేల మంది సగరపుత్రుల దహన భూమిలో పోగుపడిన ఎముకలతో కూడిన వారి భస్మరాశి సంబంధాన్ని లేనిది. ఏనాడూ యదుగిరిప్రదేశాన్ని వీడనిది. ఈవిధంగా ప్రసిద్ధమైన గంగానది కంటే విలక్షణమైన వైకుంఠగంగను భజిస్తున్నాను.



**"యస్యా వైకుంఠగంగేతి నామధేయం విదు ర్బుధాః, సా హి విష్ణుపదాదేవ సాక్షాన్నిపతితా భువి"** (ఈ తీర్థంయొక్క నామధేయం వైకుంఠగంగ అని పండితులు తెలిసికొంటారు. ఆ తీర్థం సాక్షాత్తు విష్ణుపదంనుండి భూమిపై అవతరించింది) అనే యాదగిరిమాహాత్మ్యసూక్తి భావ్యం.

**26.** అవ : ఈరీతిలో యాదవగిరి పరిసరాలలో ఉండే తీర్థాలను మానసికంగా అనుసంధించి, వాటిలో ప్రధానమైన కల్యాణతీర్థాన్ని ఇపుడు స్తుతిస్తున్నారు.

**నీర్ణీచోచ్చభిదం నిరాకృతగుణావవద్యావమర్శం జనా-**
**నాప్లావ్యానుజిఘృక్షతీం సురుచిరాగాధ ప్రసన్నాద్భుతామ్ ।**
**శ్రీమద్యాదవభూధరే సుచరితోల్లాసావహా మన్వహం**
**కల్యాణీ మవగాహిషీయ కరుణాం నారాయణస్యాపరామ్ ॥**

జాతిలోని హెచ్చుతగ్గులను గమనించని రీతిలో, గుణదోషాలను పరామర్శ చేయని రీతిలో, జనులందరినీ పూర్తిగా ముంచెత్తి (స్నానం చేయించి) వారిని అనుగ్రహించగోరినది, మిక్కిలి అందమైన, తెలియరాని లోతును (గాంభీర్యాన్ని) కల్గినది, స్వచ్ఛమైన నీటిని కల్గినది, కల్మషాలు లేనిది, సాటి లేనిది అయినందున ఆశ్చర్యకరమైనది, శ్రీయాదవగిరిలో సుచరితుడనే బ్రాహ్మణునకు ఉల్లాసాన్ని కల్గించినది. (సుకృతాన్ని చేసినవారికి భగవద్గుణానుభవం, కైంకర్యమనే ఫలాన్ని కల్గించేది) అందువల్లనే తిరునారాయణస్వామియొక్క వేఱొక సరోరూపంలోని దయాగుణంవలె ఉన్నది అయిన కల్యాణిసరస్సులో ప్రతిదినం ప్రస్తుతం అవగాహనం చేస్తాను. (సుచరితవృత్తాంతం యాదవగిరి మాహాత్మ్యంలో తెలుపబడింది.)

**27.** అవ : కల్యాణితీర్థాన్నే మళ్ళీ స్తుతిస్తున్నారు.

**హరే ర్వరాహరూపిణః శ్రమాంబుసంభవం భవశ్రమాపహమ్ ।**
**భవిష్ణువిష్ణువద్ద్యుపాసితం సర శ్చరీకరోతు మంగళమ్ ॥**

వరాహమూర్తి రూపాన్ని ధరించిన హరి సముద్రంనుండి భూమిని ఉద్ధరించి నపుడు, ఆ సముద్రంలోని నీరు ఆ స్వామి దివ్యదేహానికి అంతటా అంటుకున్నది. ఆ జలం వరాహస్వామి శ్రమాంబువు (చెమట) వలె ఉన్నది. ఆ నీటినుండి కల్యాణితీర్థం ఆవిర్భవించింది. **"మగ్నోత్థితస్య జలధౌ మమాంగాద్గలితం జలమ్,**

**తేన పూర్ణమిదం తీర్థం తస్మాత్పుణ్యం పురాతనమ్"** (నేను సముద్రంలో మునిగి పైకి లేచినపుడు నాదేహంనుండి జలం జారిపడింది. ఆ నీటిలో ఈ తీర్థం నిండింది. అందువల్ల ఈ కల్యాణితీర్థం పుణ్యమైనది, పురాతనమైనది) అని పురాణవచనం. ఈ కల్యాణితీర్థం, తనలో మునిగినవారికి సంసారంలో కలిగే శ్రమను తీరుస్తుంది. తనను సేవించేవారికి అనిష్టనివారణాన్ని, ఇష్టప్రాపణాన్ని కల్గించడంలో సమర్థమైనది. గంగానదిచేత ఉపాసింపబడేది. **"ఫాల్గునే మాసి సంప్రాప్తే మాసానా ముత్తమోత్తమే, అహం కల్యాణతీర్థస్య మధ్యే వర్తే మనోరమే"** (మాసాలన్నిటిలో ఉత్తమమైన పాల్గున మాసం వచ్చినపుడు నేను కల్యాణసరస్సు మధ్యలో ఉంటాను) అని పురాణోక్తి. ఇటువంటి కల్యాణతీర్థం మనకు మంగళాన్ని మాటిమాటికి కల్గించాలి.

**28.** అవ : ఇక, యాదవాచలానికి అలంకారంవంటిది అయిన తిరునారాయణ పురాన్ని గూర్చి అనుసంధిస్తున్నారు.

**సేయం వైష్ణవసర్మహర్మ్యశిఖరోదంచత్పతాకావళీ-**
**సంఘర్ష క్షతచంద్రనిఃసృత సుధాలిప్తేవ దేదీప్యతే ।**
**శ్వేతద్వీపవివర్తమూర్తి రనఘశ్రీభూమినీళాసఖ-**
**శ్రీనారాయణచిత్తనిర్వృతికరీ నారాయణాఖ్యా పురీ ॥**

ఈ తిరునారాయణపురం- అక్కడ నివసించే శ్రీవైష్ణవుల క్రీడాసౌధాల అగ్రభాగాలలో ఎత్తుగా ఎగిరే పతాకాల సమూహాలయొక్క తాకిడి చేత గాయపడిన చంద్రునినుండి స్రవించిన (తెల్లని) సుధారసంతో పూయబడినట్లుగా గొప్పగా తెల్లగా ప్రకాశిస్తున్నది. ఈ నగరం క్షీరాబ్దిశాయి నివాసదేశమైన శ్వేతద్వీపంయొక్క వేఱొక రూపంవలె ఉన్నది. దోషవిదూరుడు, శ్రీభూమీనీళాసఖుడైన తిరునారాయణ స్వామి మనస్సుకు నిర్భరమైన ఆనందాన్ని కల్గిస్తున్నదై సర్వోత్కృష్టంగా వెల్గుతున్నది.

**29.** అవ : ఇందులో కూడా తిరునారాయణపురవర్ణనను కొనసాగిస్తున్నారు.

**అశ్రాంతోత్సవబద్ధకౌతుకయతిక్షోణీశసంపత్సుత-**
**ప్రస్థానోత్సుకపౌరయౌవతసుసంమృష్టప్రతోళీముఖామ్ ।**
**ఫుల్లత్ పల్లవతోరణచ్యుతమధుస్యందాపనీతశ్రమా-**
**శేషాగంతుజనా మిమా మనిమిషం సేవే పురీం యాదవీమ్ ॥**

ఎడతెగకుండా ఎల్లప్పుడూ జరిగే నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవసమయాలలో, నైమిత్తికాలైన యాత్రాద్యుత్సవ సమయాలలో (ఆ



ఉత్సవ ప్రక్రియలో భాగంగా) మణిబంధప్రదేశంలో హస్తసూత్రం (కంకణం) కట్టబడిన భగవద్రామానుజులు, శ్రీరామప్రియులనే (సంపత్కుమారులనే) ఇద్దఱు తిరువీథి ఉత్సవార్థం బయటకు వేంచేసే విషయంలో ఆసక్తిని కల్గిన తిరునారాయణ పురంలోని పౌరులు, యువతీసమూహం చక్కగా తిరువీథులను ఊడ్చి, లేపనాలను చేసి, రంగవల్లికలతో అలంకరిస్తారు. అపుడు వికసించే పూలతో, చిగుళ్ళతో దారిలో కూర్చిన తోరణాలలోని పూలనుండి జారిపడిన మకరందద్రవం ఆ ఉత్సవాలను సేవించాలని వచ్చిన సమస్తభక్తజనాల శ్రమ తీరుస్తున్నది. అటువంటిది, యదు వంశంలో అవతరించిన బలభద్రశ్రీకృష్ణులకు అభిమతమైన తిరునారాయణపురాన్ని సేవిస్తున్నాను.

30. అవ : తిరునారాయణపురవర్ణన సందర్భంలో ప్రసక్తమైన, ఉత్సవాలలో సారభూతమైన వైరముడి (వజ్రకిరీట) దివ్యోత్సవాన్ని అనుసంధిస్తున్నారు.

**తత్తాదృక్షగజేంద్రమోక్షణ రథారోహక్షణస్వర్ధునీ-**
**తీర్థాధ్యక్షణ పూర్వపర్వమహితే యస్మిన్ యతీంద్రాజ్ఞయా ।**
**ఆమాతంగవసిష్ఠ మేతి జనతా ముక్త్యైకరస్యాం శ్రియం**
**సోఽయం ప్రత్యహ మస్తు వజ్రమకుటీదివ్యోత్సవో వాత్సరః ॥**

భగవానుని పరత్వాన్ని సూచించేవిగా ప్రసిద్ధి చెందినవి, ఆ స్వామి గొప్పతనానికి తగిన వైభవంతో కూడినవి అయిన గజేంద్రమోక్షణోత్సవం, రథారోహణోత్సవం, కల్యాణి సరస్సుమధ్యలో జరిగే విష్ణుగంగా తీర్థసాక్షాత్కారోత్సవాది ఉత్సవాలలో, కల్యాణోత్సవ, ప్రహ్లాదమోక్షణ, లక్ష్మీప్రణయ కలహసంధానపట్టాభిషేకోత్సవం మొదలైన ఉత్సవాలతో జనసమూహం, (**"దేవాలయసమీపస్థాన్ దేవ సేవార్థమాగ తాన్, చండాలాన్ పతితాన్ వాపి స్పృష్ట్వా న స్నానమాచరేత్"** -దేవాలయసమీపంలో ఉండేవారు, భగవానుని ఉత్సవాన్ని సేవించాలని వచ్చినవారు చండాలురైన, పతితులైనా వారిని తాకినప్పటికీ స్నానం చేయనక్కరలేదు) అనే పాంచరాత్ర ప్రమాణానుసారంగా భగవద్రామానుజులు చేసిన దివ్యాజ్ఞను అనుసరించి జాతినిబట్టి మిక్కిలి తక్కువవారైన మాతంగులనుండి, బ్రహ్మమానసపుత్రుడైనందున గొప్పజాతికి చెందిన వశిష్ఠుని వరకు ఏవిధమైన జాతిలోని హెచ్చుతగ్గులను లెక్కించకుండా, పరమపదవాసులైన ముక్తులు మాత్రమే పొందదగిన భగవద్గుణాను భవకైంకర్యరూపసంపదను పొందుతున్నది. అటువంటి ఉత్సవాలలో గొప్పదైన,

ప్రతి సంవత్సరం ఒక పర్యాయం జరిగే వైరముడి ఉత్సవం అందటికి సర్వదా మోక్షానంద సిద్ధికోసం ప్రతిదినం జరగాలి.

31. అవ : ఇక, తిరునారాయణపురంలో నివసించే శ్రీవైష్ణవులను స్తుతిస్తున్నారు.

**స్వాంగీకారోపహారీకృతనతదురితాః స్వాంఘ్రిరేణుప్రభావ-**
**ప్రేక్షాసాక్షీకృతాస్మత్సహపతితచతుర్వేది సర్వాపరాధాః ।**
**శ్రీమన్నారాయణాంఘ్రిద్వయపరిచరణైశ్వర్య గర్వాదుదస్త-**
**శ్రీవైకుంఠోపకంఠా యదుగిరికటకస్వామినో మే స్వదంతామ్ ॥**

యదుగిరిలో నివసించే శ్రీవైష్ణవులు తమను ఆశ్రయించినవారిని అంగీకరించడంలో వారి (ఆశ్రితుల) పాపాలను ఉపహారంగా (కానుకగా) స్వీకరించే మహనీయులు, పాపం చేసిన మాతో సమానంగా లెక్కకట్టబడిన చతుర్వేది అనే పేరు కల్గిన, అగ్రహారవాసి అయిన బ్రాహ్మణుని సర్వాపరాధాలను తమ పాదరేణుమహిమవల్ల పోగొట్టి, తద్ద్వారా తమ పాదరేణుప్రభావం విషయంలో నమ్మకాన్ని కల్గించినవారు (లోకంలో ఏరీతిలో సాక్షి అనేవాడు వివక్షితార్థాన్ని నిశ్చయించేవాడవుతాడో, ఆవిధంగానే శ్రీవైష్ణవులు తమ పాదరేణువు ప్రభావంతో తొలగిన చతుర్వేదియొక్క సర్వాపరాధాలను పాదరేణు ప్రభావానికి సాక్షులుగా చేశారు -అనిభావం.) తిరునారాయణస్వామి శ్రీపాదాలను ధ్యానించడం, అర్చించడం- అనే ఐశ్వర్యంచేత కల్గిన సాత్త్వికాహంకార కారణంగా, భగవద్గుణానుభవ కైంకర్యాలకు ఏకాంతభూమి అయిన శ్రీవైకుంఠలోకంలోని, భగవానుడు వేంచేసి ఉండే ఉపకంఠాన్ని (సమీపప్రదేశాన్ని) సైతం ఉపేక్షించినవారు. యాదవాచలకటక ప్రదేశస్వాములైన ఈ శ్రీవైష్ణవుల పట్ల నా మనస్సు ప్రీతిని కల్గి ఉండాలి (వారిపట్ల భక్తిని కల్గి ఉండాలి). చతుర్వేది వృత్తాంతం క్షేత్రమాహాత్మ్యంలో గమనించాలి.

32. అవ : యదుగిరి నితంబ ప్రదేశాలలో (చరియలలో) నివసించే శ్రీవైష్ణవులను, వారి శుచిత్వాది గుణాలను పురస్కరించుకొని, హంసలుగా వర్ణిస్తున్నారు.

**శుచిరుచిరం మనోజ్ఞచరితం నళినాక్షదయా-**
**మృతసరసీరసార్ద్ర మనురంజితమంజురవమ్ ।**
**ఇద మిహ పక్షపాత మనిమిత్తక మాద్రియతే**
**యదుగిరిహేమసానురసికం మయి హంసకులమ్ ॥**



హంసల సమూహం -తెల్లని వర్ణాన్ని కల్గినది, ప్రకాశించేది, సుకుమారమైనది చక్కని నడకను కల్గినది, సరస్సులోని జలంలో స్నానమాడడంవల్ల ఆర్ద్రమైనది, నాసికా భాగంలో ఎఱ్ఱని రంగును కల్గినది, మనోహరంగా ధ్వనించేది, పాలను నీటిని వేఱు చేసే రసజ్ఞమైనది, ఇటువంటి హంసలతో పోల్చదగిన యదుగిరి వాసులైన శ్రీవైష్ణవకులం కూడా- **"యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరః శుచిః"** (పుండరీకాక్షుని ఎవడు స్మరిస్తాడో అతడు లోపల, బయట పవిత్రతను కల్గి ఉంటాడు) అనే రీతిలోని శుచిత్వాన్ని కల్గినది, జ్ఞానం, భక్తి మొదలైన సద్గుణాలతో స్పృహణీయమైనది, మనోజ్ఞమైన చరిత్రలను కల్గినది, పుండరీకాక్షుడనే సరస్సుచేత చల్లదనాన్ని పొందినది (భగవద్దయ తాపత్రయాతురులైన జీవులకు ఉజ్జీవనహేతువు కనుక, అది అమృతసరస్సుగా రూపించబడింది), భగవత్స్వరూప రూపగుణ విభవలీలాదులలో అనురాగాన్ని కల్గినది, మనోజ్ఞమైన వేదాంతధ్వనిని చేసేది, యదుగిరిసానుప్రదేశాలలో నివసించడంలో అభినివేశాన్ని కల్గినది. అందువల్లనే హంసల సమూహంవంటి శ్రీవైష్ణవకులం నిర్హేతుకంగానే నాపట్ల పక్షపాతాన్ని అంగీకరిస్తున్నది (నన్ను ఉజ్జీవింపజేయడంలో ఆసక్తిని కల్గి ఉన్నది).

33. అవ : ఇందులో ఆ శ్రీవైష్ణవుల పాదరేణువైభవాన్ని అనుసంధిస్తున్నారు.

**క్రేతుం నః ప్రభవంతి హంత! యతిరాడ్జన్మోత్సవోన్మస్తక-**
**ప్రేమవ్యుత్క్రమనృత్యదార్యచరణోత్క్షిప్తా యదుక్ష్మాభృతః ।**
**ధూళ్యో యాః కిల రంగవేంకటముఖ శ్రీదివ్యదేశాశ్రితై**
**రర్చ్యంతే నియమేన తీర్థవటికారూపేణ గోపాయితాః ॥**

యదుగిరిలో ప్రతిసంవత్సరం నిర్వహింపబడే భగవద్రామానుజావతారోత్సవాలలో ఉన్మస్తకమైన (అతిశయించిన) ప్రేమతో యథేచ్ఛంగా ఏక్రమం లేకుండా భక్తి పారవశ్యంతో నాట్యం చేసే ఆర్యుల శ్రీచరణాల విక్షేపాల (తాకిడి) వల్ల పైకి ఎగసిన (యదుగిరిలోని) ధూళికణాలు మమ్ములను క్రయం చేయగల్గినవి (స్వాధీనం చేసికోగల్గినవి). ఆహా ! ఎంత సంతోషం ! ఈ భాగవతరేణు ప్రభావం ఎంత గొప్పది? అంటే, శ్రీరంగం, తిరుమల మొదలైన దివ్యదేశాలలో నిత్యవాసం చేసే అభియుక్తులైన ఆచార్యులు ఈ భాగవత శ్రీపాదధూళిని తీర్థవటికల (తీర్థవళ్ళు) రూపంలో సంపాదించి, ప్రతిదినం అర్చిస్తూ, ఆ వటికలను తీర్థంతో సంభావించడం ద్వారా శ్రీపాదతీర్థాన్ని గ్రహిస్తున్నారు.

**34.** అవ : ఈవిధంగా తిరునారాయణపుర వీథివర్ణనాసందర్భంలో ప్రసక్తాను ప్రసక్తంగా వచ్చిన విషయాలను పక్కడం ముగించి, ఇపుడు యదుగిరి నారాయణ స్వామి దివ్యాలయ పురోభాగాన్ని స్తుతిస్తున్నారు.

**మధురిపుజలనిధిదృగమృతవీచీ కృతపరిచితి మురుమణిగణకీర్ణామ్ ।**
**పరిసరనతసురసదన ముపాసే యదుగిరితటభువి తదజిరవేలామ్ ॥**

యదుగిరిలో వేంచేసి ఉండే మధుసూదనుడైన తిరునారాయణస్వామి ఒక అమృతసముద్రం. ఆ స్వామి వీక్షణాలే అమృతవీచికలు. యదుగిరి సమీపప్రదేశంలో గల తిరునారాయణస్వామి మందిరంయొక్క అంగణప్రదేశమే ఆ అమృత సముద్ర తీరప్రదేశం. సముద్ర తీరప్రదేశం సదా తరంగాలతో సంబంధాన్ని కల్గి ఉండేటట్లే, అంగణ ప్రదేశం తిరునారాయణస్వామి కటాక్షతరంగ సంబంధాన్ని మాటిమాటికి పొందినది. సముద్రతీరంలో మణిగణాలు చెల్లాచెదఱుగా పడిఉండే టట్లే, ఆ అంగణ ప్రదేశంలోని మంటపప్రాకార గోపురాలు మణిగణాలతో పొదగబడి ఉన్నాయి. సమద్రతీరంలో దేవతాగణాలు ఉండేటట్లే తిరునారాయణస్వామిని సేవించడం కోసం వచ్చిన దేవతల సమూహాలు ఆ అంగణ ప్రదేశంలో నిలచి ఉంటాయి. అటువంటి ఆ అంగణ ప్రదేశాన్ని ఉపాసిస్తున్నాను.

35. అవ : ఇందులో తిరునారాయణస్వామి మందిరంలో కైంకర్యాన్ని చేసే పరిజనులను స్తుతిస్తున్నారు.

**తాంబూలదర్పణ పతద్గ్రహతాళవృంత-**
**భృంగారధౌతవసనాభరణస్రగాదీన్ ।**
**ఆబిభ్రతో యతిపతిప్రణిధీ న్విభోర్వి-**
**పంచాశతః పరిజనప్రవరాన్ భజామః ॥**

తాంబూలసహితమైన పాత్రవిశేషాన్ని, దర్పణాన్ని, తమ్మపడిగాన్ని, విసనకఱ్ఱను, భృంగారమనే జలపాత్రవిశేషాన్ని, తెల్లని వస్త్రాలను, ఆభరణాలను తులసి మొదలైనవానితో కూర్చిన పూమాలికలను, చామరాలను, ఇంకా ఇటువంటి ఆరాధనోపకరణాలను ధరించేవారు, శ్రీరామానుజుల ఆజ్ఞానుసారంగా ఆయా కైంకర్యాలను చేసేవారైన (**"ఐమ్బత్తిరువర్"**- అనే నామాన్ని కల) కైంకర్యపరులను భజిస్తున్నాము.



36. అవ : ఇక, యాదవాద్రిలోని దివ్యవిమానాన్ని స్తుతిస్తున్నారు.

**ద్రుహిణసనకయోగినారాయణాత్రేయసంరక్షితం**
**యతిపతికృపయేహ సర్వాత్మసేవ్యాం దశాం ప్రాపితమ్ ।**
**నిగమశిఖరవత్ పరబ్రహ్మగర్భం యదుక్ష్మాధర-**
**ప్రవణ మనుభవేయ మానందసంజ్ఞం విమానం ముహుః ॥**

యదుగిరిలోని తిరునారాయణస్వామి దివ్యవిమానానికి ఆనంద విమానమని పేరు. ఇది నిగమశిఖరమైన వేదాంతంతో పోలినది. వేదాంతాన్ని ప్రవచనాలద్వారా, యదుగిరిని పూజాదుల ద్వారా చతుర్ముఖబ్రహ్మ, సనకయోగి, తత్పుత్రుడైన బదరికాశ్రమవాసియైన నారాయణు డనే పేరును కల, భగవదవతారరూపుడైన ముని, అత్రిమహర్షిపుత్రుడైన దత్తాత్రేయ ముని- అనే వీరు కాపాడారు. యాదవగిరి మాహాత్మ్యంలోని **"తత స్సనత్కుమారాద్యైః సత్పుత్రైః పరివారితః, అర్చయామాస గోవింద మరవిందాయతేక్షణమ్"** (అనంతరం బ్రహ్మ సనత్కు మారుడు మొదలైన సత్పులతో కూడినవాడై, యదుగిరిలోని గోవిందుడు, పుండరీకాక్షుడైన తిరునారాయణస్వామిని అర్చించాడు) అనే వచనం ఇక్కడ స్మరణీయం. ఆ రీతిలోనే, **"యదుగిరిగత మంతర్దర్శినాం చక్రవర్తీ యదుకుల బహుమాన్యం చింతయామాస దేవమ్"** (ఆత్మసాక్షాత్కారాన్ని పొందినవారిలో గొప్పవాడైన నారాయణముని యదుగిరిలో వేంచేసి ఉండేవాడు. యాదవకులంచే గొప్పగా పూజింపబడేవాడు, లేక, యాదవకులానికి చెందిన శ్రీకృష్ణునకు మిక్కిలి పూజనీయుడైన తిరునారాయణస్వామిని ధ్యానించాడు) అనే వచనంకూడా స్మరణీయం. ఆ విధంగానే, దత్తాత్రేయుని ఉద్దేశించి **"నారాయణస్య సాన్నిధ్యే నిత్యం సత్త్వోత్తరే పునః, నారాయణాచలే చక్రే సన్న్యాసాశ్రమసంగ్రహమ్"** (శుద్ధసత్త్వ మయమైన యాదవాద్రిలో వేంచేసి ఉండే తిరునారాయణస్వామి సాన్నిధ్యంలో దత్తాత్రేయులు సన్న్యాసాశ్రమ స్వీకారాన్ని చేశారు) అని తెలుపబడింది.

ఈ ఆనందవిమానం భగవద్రామానుజుల పరమకృపవల్ల ఈకలియుగంలో జనులందఱు సేవించే దశను పొందింది. జాతికృత తారతమ్యం లేకుండా, మహోత్సవాలలో జాతి భేదం లేకుండా జనులంతా సేవించే దశను శ్రీరామానుజులు పొందించారు. శ్రీభాష్యాదిరచనద్వారా విద్యాభేదం లేకుండా అందఱు దర్శించే దశను వేదాంతానికి కల్గించారు. వేదాంతం పరమాత్మను అంతర్భవించుకొన్నట్లే,

ఈ ఆనందవిమానంకూడా పరమాత్మ స్వరూపుడైన తిరునారాయణస్వామిని అంతర్భవించుకొన్నది. ఈ విమానం యదుగిరిలో ప్రవణమైనది - అంటే - నిత్యసంబంధాన్ని కల్గినది. వేదాంతం కూడా యదుగిరి నారాయణునిపట్ల ప్రవణమైనది. ఆయన మహిమను తెల్పుతున్నది. ఈ ఆనందమయ విమానాన్ని సనత్కుమారుడు సత్యలోకం నుండి తీసికొనివచ్చాడని - **"ఇతి మత్వా తటే తస్య సరస స్స మునీశ్వరః, విమానం స్థాపయామాస విధినాఽభ్యర్చితం పురా"** ఇత్యాది యాదవగిరిమాహాత్మ్య సూక్తి తెల్పుతున్నది. ఈవిధంగా వేదాంతవంటి ఆనందమయ విమానాన్ని మాటిమాటికి దర్శిస్తాము.

37. అవ : ఇక, ఆ ఆనందమయదివ్యవిమానంలో వేంచేసి ఉండే తిరునారాయణ స్వామి చిరపరిచితుడైనా, ఇదమిత్థంగా వర్ణించి పల్కడానికి సాధ్యం కాని, వాఙ్మన సాతీతమైన దివ్యమంగళ విగ్రహాన్ని కలవాడైనందున, ఇపుడే మొట్టమొదటగా దర్శించినట్లుగా రెండు శ్లోకాలతో పల్కుతున్నారు.

**శుభోదారస్నిగ్ధాద్భుతమహితసంస్థాన మభిత-**
**స్స్ఫురంతీభి ర్భాభిః హరితయదశేషాశ్చ హరితః ।**
**పరంజ్యోతి స్సాక్షాదకరవ మిహానందనిలయే**
**విమానే మంజూషోన్మిషితమివ శాతం మరకతమ్ ॥**

శాణంపై సానపెట్టబడిన మరకతమణి నిర్దుష్టంగా ఏ దోషం లేనిదిగా-ఉంటుంది. ఆ రీతిలోనే అందటికి ఆనందాన్ని కల్గించే ఆనందమయ విమానంలో వేంచేసి ఉండే తిరునారాయణస్వామికూడా దోషవిదూరుడు. అతడు సాన పెట్టబడిన మరకతమణివలె దర్శనమిస్తున్నాడు. ఏవిధంగా? అంటే, మరకతమణి శుభకరమైనది. తిరునారాయణస్వామి కూడా తనను దర్శించేవారికి శుభకరుడు. అంటే- ఆనందాన్ని కల్గిస్తాడు. (**"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతమ్, తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే"** అని శ్రుతి పల్కుతున్నది కదా. ఇక్కడ గల **"ఇంధ-దీప్తౌ"** అనే ధాతువు ద్వారా ఆనందం ఉపలక్షింపబడుతున్నది.) మరకతమణి విలువైనది కనుక, దానిని కలవారికి సర్వస్వాన్ని పొందిస్తుంది. తిరునారాయణస్వామి కూడా (**"ఏష సర్వస్వభూత స్తు పరిష్వంగో హనూమతః"** సర్వస్వమనదగిన ఈ ఆలింగనం హనుమంతునకు ఇవ్వబడుతున్నది) అనే రీతిలో సర్వస్వాన్ని అనుగ్రహిస్తాడు. మరకతమణి



నిగనిగలాడుతూ స్నిగ్ధంగా ఉంటుంది. తిరునారాయణస్వామి కూడా అటువంటి స్నిగ్ధత్వాన్ని కల్గిఉన్నాడు. మరకతమణి చూచేవారికి ఆశ్చర్యకరంగా ఉంటుంది. తిరునారాయణస్వామి కూడా తనకంటే వేఱయిన అందటికంటే విలక్షణంగా ఉంటాడు, కనుక, **"సర్వాశ్చర్యమయం దేవమ్"** అని గీతలో పల్కినట్లుగ ఆశ్చర్యాన్ని కల్గించేటట్లు ఉంటాడు. మరకతమణి పూజనీయమై ఉంటుంది. తిరునారాయణ స్వామి కూడా దేవతిర్యఙ్మనుష్యాదిరూపాలలో దేనిని పరిగ్రహించినా, అప్రాకృత స్వరూపాన్ని కల్గి ఉన్నందున పూజనీయుడు. అంతేకాక, మరకతమణి నలు దెసల వ్యాపించే తన కాంతులతో అన్నిటిని పచ్చని వర్ణాన్ని కల్గినవిగా చేస్తుంది. తిరు నారాయణస్వామికూడా ఆ విధంగానే చేస్తాడు. అందువల్ల ఆ స్వామి, రత్నపేటికను తెఱచినపుడు ఉజ్జ్వలంగా వెలిసే గొప్ప మరకతమణివలె సర్వోత్కృష్ట తేజంతో ప్రకాశిస్తున్నాడు. అటువంటి తిరునారాయణ స్వామిని దర్శించాలనే కుతూహలాన్ని కల రెండు కళ్ళతో దర్శించి నేను ఆనందించాను.

38. **యుగపదుదితభాస్వత్కోటిధామా సుధాబ్ధి-**
**స్నపిత ఇవ సుజాతస్నిగ్ధదివ్యాద్భుతశ్రీః ।**
**భువనభవనభూషా జ్యోతిషాం జ్యోతి రేషః**
**స్ఫురతి యదుమహీభృన్మౌళిరత్నప్రదీపః ॥**

ఒకే కాలంలో ఉదయించిన కోటిమంది సూర్యుల ప్రకాశాన్ని కలవాడు, అమృతసాగరంలో స్నానం చేసినవానివలె చక్కని, చిక్కని, అప్రాకృతాలైన, చూచేవారికి ఆశ్చర్యాన్ని కల్గించే కాంతులను కలవాడు, భువనమనే భవనానికి అలంకారం, **"తస్య భాసా సర్వ మిదం విభాతి"** అనే శ్రుతిక్రమంలో చీకటిని నివర్తింపజేయడం వల్ల, ఇతరులకు ప్రకాశాన్ని కల్గించడంవల్ల అగ్ని మొదలైన తేజఃపదార్థాలకు ప్రకాశకుడు అయిన తిరునారాయణస్వామి యదుశైలశిఖరంలో గొప్ప రత్నదీపంవలె ప్రకాశిస్తున్నాడు.

**"భాస్వత్కోటిధామా"** అని ఆదిత్యతేజోదృష్టాంతంద్వారా సంభావింపబడి నందున భగవానుని తేజస్సు దుర్నిరీక్ష్యమా? అనే సందేహాన్ని **"సుధాబ్ధిస్నపిత"** ఇత్యాది సూక్తిద్వారా చల్లని ప్రకాశాన్ని కలవాడంటూ తీర్చి, **"సుజాత"** ఇత్యాదిగా ఆ తేజస్సు దర్శింపదగినదనే విషయాన్ని దృఢీకరించారు. **"శ్రీశం నమామి శిరసా యదుశైలదీపమ్"** అనే నిత్యానుసంధేయసూక్తి ప్రకృతంలో స్మరణీయం.

40. అవ : ఇందులో, సకలవేదాంతాలలో నిశ్చయింపబడిన తిరునారాయణ స్వామియొక్క పరబ్రహ్మభావాన్ని అనుసంధిస్తున్నారు.

**జగత్సంభవక్షేమశిక్షాదిదక్షం పరం క్షోణిలక్ష్మీకటాక్షైకలక్ష్యమ్ ।**
**యదుక్ష్మాధరే మోక్షదానైకదీక్షం మహః పుండరీకాక్ష మధ్యక్షయామః ॥**

జగత్తుల సృష్టి, స్థితి, లయం, ఆయా జీవుల కర్మానుసారంగా ఫలప్రదానం మొదలైనవానిని నిర్వహించడంలో సమర్థమైనది, ఉత్కృష్టమైనది, భూదేవి, లక్ష్మీదేవుల కటాక్షాలకు అద్వితీయమైన లక్ష్యం, మోక్షాన్ని ప్రసాదించడం - అనే ముఖ్యమైన వ్రతాన్ని కల్గినది, పుండరీకాలవంటి రెండు నేత్రాలను కల్గినది అయిన పరంజ్యోతిని యదుగిరిలో దర్శిస్తున్నాము.

"జగత్సంభవ" ఇత్యాదిసూక్తిద్వారా **"యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి"** ఇత్యాది శ్రుతులద్వారా, **"జన్మాద్యస్య యతః"** అనే సూత్రంద్వారా ప్రతిపాదింపబడిన పరబ్రహ్మలక్షణం తిరునారాయణస్వామి విషయంగా తెలుపబడింది. **"పరమ్"** అనే విశేషణంద్వారా భగవానుని అధీనంలో తమ కర్తవ్యనిర్వహణను చేసే చతుర్ముఖాదులకంటే తిరునారాయణస్వామికి కల వైలక్షణ్యం సూచింపబడింది. శ్రుతులలో సత్ బ్రహ్మ, ఆత్మాది శబ్దనిర్దిష్టమైన, జగత్కారణ భూతమైన పరబ్రహ్మం **"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ"** అని నారాయణానువాకంలోని సూక్తితో శ్రియఃపతిత్వాది అసాధారణ చిహ్నాలను కల నారాయణుడే- అని సూచింపబడింది. ఈ అర్థం ప్రకృతంలో **"క్షోణీలక్ష్మీ"** ఇత్యాది సూక్తిద్వారా సూచింపబడింది. **"మోక్షదానైకదీక్షమ్"** అనే ప్రయోగంద్వారా **"కిమపి కిమపి కృత్వా వ్యాజ మవ్యాజబంధుః సకలభువనరక్షా సావధానైః కటాక్షైః, స ఖలు యదుగిరిస్థః పక్షిణో వా పశూన్ వా శమితనిఖిలతాపాన్ త్రాయతే చక్రపాణిః"** అని యాదవగిరి మాహాత్మ్యసూక్తిలోని అర్థం తెలుపబడింది. **"పుండరీకాక్షమ్"** అనే ప్రయోగంద్వారా **"తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** అనే ఛాందోగ్యశ్రుత్యర్థం సూచితం. **"మహః పుండరీకాక్షమ్"** అని అనడంద్వారా విశేష్యభూతుడైన తిరునారాయణస్వామి నిర్దేశింపబడ్డాడు.

**40.** అవ : ఆశ్చర్యంతో స్తైమిత్యాన్ని (నిశ్చేష్టతను) పొందినవారై, తిరునారాయణ స్వామి రూపాన్ని పలు విధాలుగా సందేహాలంకారక్రమంలో రవి భావిస్తున్నారు.



**అయే! శ్యామోదారః కిమయ మమృతాధ్మాతజలదః?**
**తమాలద్రుః కిం వా? పృథులలితోద్దామవిటపః? ।**
**యదుక్ష్మాభృత్సానుప్రగుణితవిలాసో ను కలభః?**
**కిము క్రీడాశైలః శ్రియ ఇహ మహానీలమహితః? ॥**

ఈదివ్యరూపం నల్లని, నెమలికంఠంవలె నిగనిగలాడే, గొప్పదైన, అమృతంతో నిండిన మేఘమా ఏమి! స్థూలమైన, సుకుమారమైన, విస్తరించిన శాఖలను కల తమాలవృక్షమా? యాదవాద్రి సానువులలో అనేకరీతులలో క్రీడించే ఏనుగు గున్నయా? గొప్ప ఇంద్రనీలమణులతో కూడిన, మనోజ్ఞమైన, లక్ష్మీదేవి క్రీడించే పర్వతమా?

మొదటి పాదంలోని అమృతమయమేఘోక్తి- దర్శించేవారి తాపాలను హరించే గుణాన్ని, రెండవ పాదంలో తమాలవృక్షోక్తి- ఆశ్రయణీయత్వాన్ని, మూడవ పాదంలోని కలభోక్తి- భగవానుని సుచరితాన్నస్వీకారాదిరూపంలోని సౌశీల్యాన్ని, నాల్గవపాదంలోని క్రీడాశైలోక్తి- లక్ష్మిచే భూషితమైన వక్షఃస్థలాన్ని స్వామి కల్గి ఉండడాన్ని స్ఫురింపజేస్తున్నవి.

41. అవ : దివ్యాంబరాలతో, దివ్యభూషణాలతో, దివ్యభూషణాలతో కూడి ఉండే తిరునారాయణ స్వామిని ఇందులో అనుసంధిస్తున్నారు.

**దరీధర్తి నీలాద్రిలీలాం ముకుందో బరీభర్తి హేమస్నుతాం పీతవాసః ।**
**వరీవర్తి చక్రాంబుజం పుష్పవత్తాం చరీకర్తి శృంగశ్రియం రత్నమౌళిః ॥**

ముకుందుడైన తిరునారాయణస్వామి నీలగిరిసామ్యాన్ని మిక్కిలిగా కల్గి ఉన్నాడు. ఆ స్వామి ధరించిన పీతాంబరం, ఆ నీలగిరియొక్క బంగారు సానుప్రదేశంవలె ఉన్నది. సుదర్శనం, పాంచజన్యశంఖం సూర్యచంద్రుల సామ్యాన్ని మిక్కిలిగా పొందుతున్నవి.

**42.** అవ : ఈ శ్లోకం నుండి వరుసగా 27వ శ్లోకంతో తిరునారాయణస్వామిని కిరీటంనుండి పాదపీఠంవరకు దర్శించి ఆనందించి కీర్తిస్తున్నారు.

**ముఖాంభోజాసక్తః కిమలకతమః కోపకలుషః?**
**కిము శ్రీమచ్చక్షుస్స్వజనిభవనోత్కః కిమథవా? ।**

జగచ్చక్షు స్సాక్షాన్మిషతి యదుశైలేశమకుటీ -
మిషేణ ప్రత్యూషే తదిద ముపతిష్ఠేమహి మహః ॥

"కర్మసాక్షీ జగచ్చక్షుః" అనే రీతిలో జగచ్చక్షువైన సూర్యుడు యదుగిరిలోని తిరునారాయణస్వామి ధరించిన కిరీటమనే నెపంతో ప్రత్యక్షంగా ప్రకాశిస్తున్నాడా ఏమి! ఈవిధంగా స్వామి కిరీటాన్ని సూర్యునిగా సంభావించడంలోని కారణాలేమి? అని అంటే, స్వామి ముఖమనే పద్మంలో ఆసక్తుడై సూర్యుడు స్వామి కిరీటరూపంగా వచ్చాడా? లేక, స్వామి అలకలు (ముంగురులు) అనే చీకటిపట్ల కోపాన్ని పొందిన వాడై వచ్చాడా? "చక్షు స్సూర్యో అజాయత" అనే శ్రుతిరీతిలో తన పుట్టిల్లు అయిన శ్రీమన్నారాయణుని నేత్రంలో ఉత్సుకతను కలవాడై వచ్చాడా? సంసారమనే కాళరాత్రికి సుప్రభాతమైన ఈ సమయంలో ఎదురుగా సాక్షాత్కరించే కిరీటరూపం లోని ఆదిత్యుడనే తేజస్సు దరికి చేరదాం.

ఇందులో స్వామి ధరించిన కిరీటంయొక్క ఆధిరాజ్యసూచకత్వం, నిరతిశయ తేజోరూపత్వం సూచింపబడినవి.

43. అవ : తిరునారాయణస్వామి ముంగురులు వర్ణింపబడుతున్నాయి.

న్యంచన్మౌళిమణిప్రభావనమితం ప్రోద్యన్ముఖేందుద్యుతి-
ప్రత్యావర్తిత మూర్ధ్వపుండ్రవిమలచ్ఛాయావిభక్తాకృతి ।
పార్శ్వోచ్ఛృంఖలశంఖచక్రరుచిభిః ప్రాయో విశీర్ణం యదు-
క్ష్మాభృద్వల్లభచూర్ణకుంతలతమః ఫాలాంత మాలంబతే ॥

తిరునారాయణస్వామి ముంగురుల సమూహం దట్టమైన తమస్సువలె ఉన్నది. అది, కింది వైపుకు ప్రసరించే కిరీటమణుల కాంతులచే అధోముఖంగా ప్రసరించేటట్లు చేయబడింది. కాని, తరువాత స్వామిముఖేందుకాంతులచే వెనుకకు తిరిగి ఊర్ధ్వముఖంగా వ్యాపించేటట్లు చేయబడినదై (కిందకు, పైకి ప్రవహించడం వల్ల) గుండ్రని సుడుల రూపాన్ని పొందింది. స్వామిఫాలభాగంలో గల ఊర్ధ్వపుండ్రాల స్వచ్ఛమైన కాంతులతో రెండుగా కుడి ఎడమలలో విభాగింప బడింది. పిమ్మట స్వామి కుడిఎడమ భుజాలలో విశృంఖలంగా వ్యాపించి ప్రకాశించే సుదర్శనపాంచజన్యాల కాంతులతో మిక్కిలిగా చెల్లాచెదురు అయినది. ఈ విధంగా ఏ రీతిలోను గతి లేనిదైన స్వామి ముంగురులనే తమస్సు చివరకు స్వామి యొక్క లలాటప్రదేశాన్ని ఆశ్రయించింది.



44. అవ : ఈ శ్లోకంలో కిరీటకాంతి అనుసంధింపబడుతున్నది.

అమీ యదుధరాధరేశ్వరకిరీటరత్నాంకురాః
పరత్వముఖరా ముహుర్ముహు రభీషయిష్యంత నః ।
మృదుస్మితసుధారసోక్షితకటాక్షలీలాయితా-
న్యకృత్రిమసుశీలతాం సపది నావదిష్యన్యది ॥

తిరునారాయణ స్వామి యొక్క మందస్మితమనే సుధారసంతో తడుపబడిన కటాక్షాల ప్రసారాలు ఆ స్వామియొక్క సహజమైన సౌశీల్యగుణాన్ని వెంటనే పల్కి ఉండకపోతే, తిరునారాయణస్వామి పర్వతాన్ని మిక్కిలిగా చాటింపు వేసే, ప్రత్యక్షంగా దర్శనమిచ్చే యదుగిరీశుని కిరీటంలో పొదిగిన రత్నాలనుండి అంకురాలవలె మాటిమాటికి వెలువడే కాంతులు, ఆశ్రయించడానికి ఉన్ముఖులమైన మనలను మిక్కిలి భయపడేటట్లు చేసి ఉండేవి. (తిరునారాయణస్వామి కిరీటంచేత వ్యక్తీకరింపబడే పరత్వగుణాన్ని కనపడనీయకుండా చేసే, ఆ స్వామి మందస్మితం చేత వ్యక్తమయిన సౌశీల్యం ఆశ్రితులు ఆశ్రయించడంలో సౌకర్యాన్ని కల్గిస్తున్నదని భావం.)

45. అవ : ఇక, తిరునారాయణస్వామి ముఖవర్ణన వరుసగా మూడు శ్లోకాలతో చేయబడుతున్నది.

అనిమిత్తదయామృతసిక్తమృదుస్మితచంద్రిక మస్తసమస్తతమః ।
యదుశైలపతేః ముఖ మిందుసఖం ప్రమదం మమ దృక్కుముదం కురుతే ॥

తిరునారాయణస్వామియొక్క నిర్హేతుకకృప అనే అమృతంతో తడుపబడిన ఆ స్వామి చిఱునవ్వు రూపంలోని వెన్నెలను కల్గినది, బాహ్యాభ్యంతరాల తమస్సును పోగొట్టేది, చంద్రునితో సమానమైనది అయిన ఆ స్వామి ముఖం నా కన్నులనే కలువలకు మిక్కిలి ఆనందాన్ని కల్గిస్తున్నది.

46. దృశో ర్విశాల మాయతం భ్రువోశ్చ నీల మానతం
స్మితే మృదూద్గతం సితం రదేషు సాంద్ర ముజ్జ్వలమ్ ।
స్ఫురద్వికాసి గండయోః చలం విలంబికుంతలే
యదుక్షమాధరేశితుః ముఖం సుఖం కరోతి నః ॥

యదుగిరిప్రభువు ముఖం- విశాలమైన, దీర్ఘమైన కన్నులను కల్గినది, నల్లని వంగిన కనుబొమలను కల్గనది, మృదువుగా కొంచెం వెలువడిన, స్వచ్ఛమైన మందహాసాన్ని కల్గినది, సాంద్రమైన, మెఱిసే పలువరుసను కల్గినది, ప్రకాశించే, వికాసాన్ని కల్గిన కపోలాలను కల్గినది, అల్లల్లాడుతూ వేలాడే ముంగురులను కల్గినది. ఆ ముఖం మనకు ఆనందాన్ని కల్గిస్తున్నది.

47. అవ : తిరునారాయణస్వామిముఖం సౌగంధ్యాన్ని, సౌకుమార్యాన్ని కల్గినది అయినందున లక్ష్మీదేవి చేతులతో లాలించే క్రీడాకుసుమకందుకంగా ఇందులో ఉత్ప్రేక్షిస్తున్నారు.

నీలభ్రూమరుకాగ్ర మాయతదృగంభోజం మిషన్నాసికా-
చాంపేయం ధవళోర్ధ్వపుండ్రకపటోదంచచ్ఛిఖా కైతకమ్ ।
ఉత్ఫుల్లాధరపల్లవం క్షితిరమాలీలోచితం కంధరాకాండో-
దంచి యదుక్షమాధరపతేః మన్యే ముఖం కందుకమ్ ॥

యదుగిరిపతి అయిన తిరునారాయణస్వామిముఖం, నల్లని కనుబొమలనే మరుకాగ్రపుష్పాలను కల్గినది. విశాలమైన కన్నులనే తామరపూలను కల్గినది, ముక్కు అనే సంపెంగపూవును కల్గినది తెల్లని ఊర్ధ్వపుండ్రాల రూపంలోని, ఉన్నతంగా ప్రకాశించే మొగలిపూరేకులను కల్గినది. వికసించే అధరాలనే చిగుళ్ళను కల్గినది. కంఠమనే కాడలో ప్రకాశిస్తున్నది. అటువంటి స్వామి ముఖాన్ని భూదేవి యొక్క, లక్ష్మీదేవులు ఆఘ్రాణించడం మొదలైన విలాసాలకు తగిన, వివిధ పుష్పాలతో కూర్చిన కందుకమని సంభావిస్తాను.

48. అవ : ఇందులో లలాటవర్ణన చేయబడుతున్నది.

స్ఫురచ్చక్షుర్మీనాత్ శ్రవణలలితావర్తమహితాత్
యదుక్ష్మాభృత్సానుప్రణయిముఖలావణ్యజలధేః ।
సుధాసూతే రోష్ఠద్వయరుచిరవీచీవిషమితాత్
ఉదేతి భ్రూవేలావనపిహితభాగోఽళికశశీ ॥

యదుగిరినివాసరసికుడైన తిరునారాయణస్వామి యొక్క ముఖకాంతి ఒక సముద్రం. ఆ సముద్రం చలించే నేత్రాలనే మత్స్యాలను కల్గినది. గుండ్రంగా ఉండే చెవులనే అందమైన సుడులతో శ్లాఘనీయమైనది. అమృతశబ్దవాచ్యమైన మోక్షాన్ని ప్రసాదించేది, రెండు పెదవులనే అందమైన తరంగాలతో నిమ్నోన్నత మైనది. ఆ ముఖకాంతి అనే సముద్రంనుండి లలాటమనే (అర్ధ)చంద్రుడు కనుబొమలనే సముద్రతీరంలోని వృక్షసమూహంతో ఆవరింపబడినవాడై ఉదయిస్తున్నాడు.



49. అవ : స్వామి ముఖంలోని శ్వేతమృత్తికతో దిద్దబడిన తిలకం ఇందులో వర్ణింపబడుతున్నది.

భ్రూమధ్యతః ప్రతిపదిందుకలావదాతః
చేతో ధినోతి తిలకో యదుశైలబంధోః ।
లాలాటకాంత్యమృతసంగ్రహణాయ లక్ష్మీ-
నిక్షిప్తమౌక్తచషకశ్రియ మాదధానః ॥

తిరునారాయణస్వామి రెండు కనుబొమల మధ్యలో దిద్దబడిన, శుద్ధపాఢ్యమినాటి చంద్రునివలె తెల్లనిది అయిన తిలకం మన మనస్సును ఆనందింపచేస్తున్నది. అది, భగవానుని లలాటంలోని కాంతి అనే అమృతాన్ని సంగ్రహించడంకోసం లక్ష్మీదేవి నిక్షిప్తం చేసిన జలసంగ్రహణపాత్ర విశేషమైన చషకంయొక్క శోభను కల్గి ఉన్నది.

50. అవ : వరుసగా రెండు శ్లోకాలతో కటాక్షాలు వర్ణింపబడుతున్నాయి.

భ్రూసేతుబంధవిధృతాక్షితటాకకుల్యా
కల్యా కటాక్షసరణి ర్యదుశైలనేతుః ।
నిమ్నోన్నతస్థలజలాదిభిదానపేక్ష -
మాప్లావయత్యము మిమం కరుణా సకుల్యా ॥

సమర్థమైనది, భగవానుని కరుణతో సమానమైనది అయిన యాదవాద్రి విభుని కరుణాసరణి, ఆ స్వామి ముఖంలోని రెండు కనుబొమలనే రెండు సేతువుల చేత ధరింపబడిన, రెండు తటాకాల నుండి పుట్టిన కృత్రిమసరిత్తు (కాలువ) వలె తోస్తున్నది. అది ఎత్తుపల్లాలు, స్థలజలప్రదేశాలు మొదలైన తారతమ్యాలను గమనించకుండా ఆ నిత్యవిభూతిని, ఈ లీలావిభూతిని ముంచెత్తుతున్నది.

భగవత్కటాక్షమనే జలం శుద్ధసత్త్వమయమైన నిత్యవిభూతిలోని నిత్యముక్తులపట్ల కూడా ప్రావణ్యాన్ని కల్గిఉంటుంది కనుక ఊర్ధ్వంగా కూడా

ప్రసరిస్తుంది. అందువల్ల స్వామి కనుబొమలనే సేతుబంధాలు ఊర్ధ్వదిశలో ఉండడం పొసగుతుంది. భగవానుని దయ **"వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్"** అని, **"విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్"** అనే రీతిలో నిర్హేతుకమైనది, కనుక, ఆదయ సర్వవిషయకమైనట్లే, భగవత్కటాక్షసరణి కూడా సర్వవిషయకమేనని భావం. (ఈ శ్లోకంలో **"కిమపి కిమపి కృత్వా వ్యాజ మవ్యాజబంధుః సకలభువనరక్షాసావధానైః కటాక్షైః"** ఇత్యాది యాదవాచల మాహాత్మ్యసూక్త్యర్థం అనుసంధింపబడింది.)

51. **అకస్మాదస్మాకం ప్రచురపరితాపప్రశమనైః**
**కటాక్షోర్మిక్షేపై రనవధికృపాసౌరభవహైః ।**
**సుధాసింధు స్స్వక్షా దయ మిహ యదుక్ష్మాధరతటే**
**స్వసేవాసామ్రాజ్యోపయిక మభిషేకం వితనుతే ॥**

**"యతో వాచో నివర్తంతే"** ఇత్యాదిగా అవాఙ్మానసగోచరంగా శ్రుతిచే కీర్తింపబడిన తన సౌలభ్యగుణంతో జనులందటికి సేవింపదగినవాడై ఉండే తిరునారాయణస్వామి ఒక అమృతసముద్రం. ఆ సముద్రం, యాదవగిరి తటప్రదేశం నుండి నిర్హేతుకంగా, సమృద్ధిగా ప్రవహించేవి, ఆధ్యాత్మికాధి దైవిక ఆధిభౌతికాలనే తాపత్రయాన్ని పోగొట్టేవి, అంతు లేని ఆస్వామి కృపాగుణానికి సౌరభాన్ని కల్గించేవి అయిన కటాక్షాలనే తరంగాలతో తన భక్తులకు తనకు సర్వవిధకైంకర్యం చేయడమనే సామ్రాజ్యానికి ఉపాయభూతమైన పట్టాభిషేకాన్ని చేస్తున్నది (భక్తులు తనకు సర్వవిధకైంకర్యాన్ని చేసికొనే యోగ్యతను కల్గిస్తున్నది- అని భావం.)

52. అవ : భగవన్ముఖవిలాసాలను అనుసంధించే తన మనోవృత్తిని వర్ణిస్తున్నారు.

**తన్మందస్మితవిస్మితం తదలకావృత్తానువృత్తం ముహుః**
**తద్బింబాధరరాగరక్త మనుతత్సౌగంధ్య సమ్మోదితమ్ ।**
**తద్భ్రూవిభ్రమలబ్ధవిభ్రమశతం తద్దృక్తరంగోర్మికం**
**మచ్చేతో యదుశైలవల్లభముఖచ్ఛాయోన్ముఖం వర్తతే ॥**

నా మనస్సు, తిరునారాయణస్వామి ముఖంయొక్క చిఱునవ్వుతో విస్మయాన్ని పొందినదై, స్వామి గుండ్రని ముంగురులలో సుడులు తిరుగుతున్నదై, (వాని చుట్టూ పరిభ్రమిస్తున్నదై), మాటిమాటికి ఆస్వామియొక్క దొండపండువంటి అధరంలోని ఆరుణ్యంలో (ఎఱ్ఱదనంలో) అనురాగాన్ని కల్గినదై, ప్రతిక్షణం ఆ స్వామియొక్క సౌగంధ్యగుణంచేత సమ్మోదాన్ని పొందినదై, ఆ స్వామియొక్క కనుబొమల విలాసాలను దర్శించడంవల్ల విభ్రమాన్ని పొందినదై, ఆస్వామి చూపులనే తరంగాలవల్ల ఊర్మిళమై (తరంగాలు మాటిమాటికి లేచేటట్లు మాటి మాటికి సంతోషపరంపరలను పొందినదై), యదుశైలవల్లభుని కాంతిపట్ల ఔన్ముఖ్యాన్ని కల్గినదై ఉన్నది. (ఈ శ్లోకంలో **"స్మితవిస్మితం, సౌగంధ్యసమ్మోదితం. ఆవర్తానువర్తం, తరంగోర్మిళం, విభ్రమలబ్ధవిభ్రమమ్"** ఇత్యాది ప్రయోగాలలోని చమత్కారం గమనించదగినది.)

53. అవ : తిరునారాయణస్వామి కర్ణకుండలాలు అనుసంధింపబడుతున్నాయి.

**కర్ణికామకరయుగ్మ ముదగ్రం కర్ణపాశబడిశం వినిగీర్య ।**
**వేష్టతే యదుగిరీశముఖాంశూత్కృష్యమాణ మిద మంసతటాకాత్ ॥**

ఈ కర్ణాభరణాలనే (మకరకుండలాలనే) మొసళ్ళ జంట, పైకి చాచిన ముఖాన్ని కల్గినదై, కర్ణపాశాలనే చేపలు పట్టేవానిని మింగి, భుజాలనే తటాకంనుండి యదుగిరిప్రభువైన తిరునారాయణస్వామి ముఖకాంతులనే దారాలతో పట్టుకోబడినదై, కుండలాల రూపంలో గుండ్రంగా తిరుగుతున్నది.

54. అవ : స్వామికంఠం వర్ణింపబడుతున్నది.

**పాంచజన్య ముపనీయ సరూపం రూపసౌష్ఠవవివేచనచుంచుః ।**
**యాదవాచలపతిర్గళకంబుం తారహారకలితం కిమతానీత్? ॥**

యాదవగిరిపతి అయిన తిరునారాయణస్వామి, రూపాతిశయతారతమ్య వివేచనను చేసేవాడై, కంఠంతో సమానమైన పాంచజన్యం దగ్గరకు వెళ్ళి పరిశీలించి చూచి, అంతకంటే గొప్పదైన శంఖంవంటి తన కంఠాన్ని మెచ్చి, శుద్ధమైన ముత్యాల సరాలతో దానిని అలంకరించాడా! ఏమి? (లోకంలో సమానవస్తువుల వ్యక్తులలోని తారతమ్య పరీక్షను చేసేవారు, వాటిలో గొప్పవ్యక్తికి, లేక, గొప్పవస్తువునకు తగిన బహుమానాన్ని ఇవ్వడం ప్రత్యక్షసిద్ధం కదా.)

55. అవ : గత శ్లోకంలో పాంచజన్యప్రసక్తి వచ్చినందున, మిగిలిన దివ్యాయుధాలైన సుదర్శనచక్రాదులను అనుసంధిస్తున్నారు.

**పార్శ్వోదంచన్యంచత్కుంచద్భుజకల్పవిటపమంజర్యః ।**
**శంఖరథాంగగదాభయముద్రా భద్రాయ యాదవాద్రీందోః ॥**

కుడి ఎడమలలో ఎత్తుగా పైకి ఉన్నవి, క్రింది దశలో ఉన్నవి, మడచి ఉన్నవి అయిన తిరునారాయణస్వామి భుజాలనే కల్పవృక్షశాఖలలో పూచిన పూలగుత్తులవలె ఉండే ఆ స్వామి ధరించిన శంఖం, చక్రం, గద, అభయముద్ర - అనే ఆయుధాలు మనకు క్షేమాన్ని కల్గించాలి.

56. అవ : స్వామి భుజాల వర్ణన వరుసగా మూడు శ్లోకాలతో చేయబడుతున్నది.

**శ్రీభూమీకుచకుంభనిర్భరపరీరంభప్రమోదాదివ**
**శ్రీదివ్యాయుధభవ్యభూషణపరామర్శావలేపాదివ ।**
**తారుణ్యాద్భుతయౌవనవ్యతికరోత్సాహాదివామీ యదు-**
**క్ష్మాభృద్వల్లభబాహవ స్సుపృథులోదగ్రాః పరం జాగ్రతి ॥**

శ్రీదేవి, లక్ష్మీదేవులు కుంభాలవంటి తమ స్తనాలతో గాఢంగా ఆలింగనం చేసికొన్నందున కల్గిన గొప్ప ఆనందంవల్ల, శోభిల్లే దివ్యాయుధాల, ప్రకాశించే దివ్యాభరణాల సంస్పర్శచేత కల్గిన గర్వంవల్ల, యౌవనం అంకురించే దశ అయిన తారుణ్యం, దాని ప్రగల్భదశ అయిన యౌవనం- అనే ఈ రెండు దశల కలయిక కారణంగా కల్గిన ఉత్సాహంవల్ల, మిక్కిలి బలిష్ఠాలు, విశాలాలు అయిన యాదవవిభుడైన తిరునారాయణస్వామి బాహువులు ఉత్కర్షతో కూడినవై, జగద్రక్షణలో జాగరూకతతో ఉన్నవి.

57. **విటపాః కిల కల్పపాదపానాం మధుపావర్జితపల్లవప్రసూనాః ।**
**యదుశైలపతేః భుజాః సువృత్తాః ఫలవర్గాన్ సువతేఽత్ర సూరిభోగ్యాన్ ॥**

యదుశైలపతి అయిన తిరునారాయణస్వామియొక్క బాహువులు ఎల్లప్పుడు తుమ్మెదలను కల్గిన చిగుళ్ళతో, పూలతో కూడుకొన్న కల్పవృక్షశాఖల వలె ఉన్నవి. అవి సువృత్తాలు, (గుండ్రని ఆకారాన్ని కల్గినవి, చక్కని వర్తనాన్ని కల్గినవి అని భావం. విస్తరించిన కల్పవృక్ష శాఖలు గుండ్రంగా ఉంటాయి. ఇవి మంచి వర్తనాన్ని కల్గి ఉంటాయి), కల్పవృక్ష శాఖలు కోరిన ఫలాలని ఇచ్చేటట్లే, సూరి భోగ్యాలైన తన గుణానుభవ కైంకర్యాదులనే ఫలాలను స్వామి బాహువులనే కల్పవృక్షశాఖలు ఈ యదుగిరిలో భక్తులను అనుగ్రహిస్తున్నవి.

58. **ఆభ్యా మంకయతేతి వోపనయనతః శ్రీశంఖచక్రే ఉభౌ**
**ఏతా వాశ్రయతేతి వక్తి గదయా నిర్దిశ్య పాదౌ పరః ।**



**మా భైష్టేత్యపరో వ్యనక్తి యదుభూభృద్వల్లభాస్మాదృశామ్**
**ఆద్యాచార్య! చతుర్భుజైః ప్రగుణయస్యాచార్యకప్రక్రియామ్ ॥**

"ప్రత్యక్షంగా దర్శన మిచ్చే ఈ శంఖచక్రాలతో మీ భుజమూలలను చిహ్నితాలుగా చేసికొనండి"- అని పల్కుతున్నట్లుగా ఈ నీ రెండు భుజాలు భక్తులను శంఖచక్రాలవద్దకు తీసికొనిపోతున్నవి. నీ వేఱొక బాహువు "సాక్షాత్తుగా దర్శనమిచ్చే ఈ రెండు శ్రీచరణాలను ఆశ్రయించండి" - అని సిద్ధోపాయాలైన శ్రీచరణాలను గదతో నిర్దేశిస్తూ పల్కుతున్నది. మఱొక బాహువు "భయపడకండి" అనే అర్థాన్ని అభయముద్రతో వ్యక్తం చేస్తున్నది. ఓ యదుగిరిపతీ! ప్రథమాచార్యా! నీ నాల్గు భుజాలతో ఈ విధంగా పూర్వం తెల్పిన రీతిలో ఆచార్యకృత్యాన్ని నీవు నిర్వహించే విషయాన్ని తెల్పుతున్నావు. (ఈ శ్లోకంలోని **"ఏతా వాశ్రయత", "మా భైష్ట"** అనే ప్రయోగాలద్వారా శ్రీకృష్ణ చరమశ్లోకార్థం అనుసంధింపబడింది.)

59. అవ : భగవానుని వక్షఃస్థలవర్ణన రెండు శ్లోకాలతో చేయబడుతున్నది.

**స్వతః శ్యామోదరం తరుణతులసీదామహరితం**
**సితం ముక్తాహారైః మణివరరుచా భాస్వరమిదమ్ ।**
**రమాపాదాలక్తారుణ మిహ యదుక్ష్మాధరపతేః**
**ఉర శ్చిత్తే ధత్తే మమ రుచివిభేదా న్నవనవాన్ ॥**

సహజంగానే శ్యామలవర్ణం కల్గి ఉన్నందున నెమలి కంఠరంగువలె మిలమిల మెఱిసేది, తరుణ తులసీ మాలికతో పసుపు పచ్చని రంగును కల్గినది, ముత్యాల హారాలతో తెల్లనిది, గొప్ప మణుల కాంతితో మిక్కిలి ప్రకాశవంతమైనది, లక్ష్మీదేవి పాదాలకు అలంకరింపబడిన లత్తుకతో ఎఱ్ఱనిది అయిన యదుగిరిపతియొక్క వక్షఃస్థలం (దానిని ధ్యానించే) నా మనస్సులో ఎప్పటికప్పుడు కొత్తవి అయిన రుచివిశేషాలను (వివిధకాంతులను, వేర్వేరు అభిలాషలను) వృద్ధిచేస్తున్నవి.

60. అవ : స్వామి వక్షఃస్థలాన్ని శ్లిష్టవిశేషణాలతో పరమపదంగా రూపిస్తున్నారు.

**శ్రీకాంతకల్యాణగుణానుషక్త ముక్తావళీసంస్తుతదివ్యధామ ।**
**వక్షో యదుక్షోణిధరేశ్వరస్య మన్యే పరం వ్యోమ పరార్ధ్యభూమ ॥**

బంగారు దారాలతో కూర్చబడిన ముత్యాల సరాలతో నిండినది, అప్రాకృత శోభను కల్గినది, లక్ష్మీదేవితో ప్రకాశవంతమైనది, భక్తులకు ఆనందాన్ని కల్గించేది

అయిన యదుగిరివిభుని వక్షఃస్థలాన్ని - తిరునారాయణస్వామియొక్క సౌశీల్య వాత్సల్యాదిగుణాలపట్ల ఆసక్తిని కల ముక్తుల సమూహంతో నిండినది, దివ్యాలైన మహామణిమంటపస్థానాలను కల్గినది, గొప్ప విస్తృతిని కల్గినదైన పరమపదంగా భావిస్తాను.

61. నిగిరదపి జగంతి క్షామ ముద్యద్బుభుక్షం
సుచరితసుతభిక్షాస్వాదసంపూర్ణకామమ్ ।
యదుధరణిధరేందో స్తుంద మాదౌ యశోదా-
కలితకనకదామగ్రంథిలక్ష్మ ప్రతీక్షే ॥

లోకాలను కబళీకరించుకొన్నది అయినా కృశమైనది, ఇంకా ఇంకా భుజించాలనే కోరికను కల్గినది, సుచరితుడనే బ్రాహ్మణుని కుమారుడైన నారాయణుడు బిచ్చమెత్తి సంపాదించిన అన్నాన్ని ఆస్వాదించడంవల్ల అభిలాష తీరినది, (సకల భువనాలను భుజించినా తీరని స్వామి భోజనాభిలాష భక్తుడైన నారాయణుడు సమర్పించిన భిక్షాన్నంతో తీరినదని భావం.) పూర్వం శ్రీకృష్ణావతార కాలంలో యశోదాదేవి బంగారు దారాలతో కట్టినందున ఏర్పడిన గుర్తులను (కాయలను) కల్గినది అయిన యాదవగిరిపతి ఉదరాన్ని అనుకూల భావంతో నిత్యం ధ్యానిస్తాను. (శ్లోకంలోని పూర్వార్ధం ద్వారా వాత్సల్యం, ఉత్తరార్ధం ద్వారా సౌలభ్యం స్ఫురిస్తున్నవి. సుచరిత వృత్తాంతాన్ని క్షేత్రమాహాత్మ్యంలో గమనించాలి.)

62. అవ : స్వామి నడుము వర్ణింపబడుతున్నది.

శ్రీయాదవాచలపతేః కలయే వలగ్నం
కక్ష్యావనద్ధకనకత్సరుఖడ్గవల్లి ।
గాఢం నికృంతదివ నిష్ఠురకర్మబంధ-
నిర్బంధబంధురచతుర్విధదేహబంధుమ్ ॥

తిరునారాయణస్వామి నడుమును మధ్యబంధనపట్టిక అలంకరింపబడింది. (వడ్డాణం వంటి) ఆ ఆభరణంలో బంగారు పిడిని కల, లత ఆకారంలోని ఖడ్గం పొదగబడింది. అటువంటి యాదవగిరిపతియొక్క మధ్యభాగం (నడుము), జీవులు చేసిన కర్మల బంధం కారణంగా తప్పక జన్మించవలసినవి, ఉన్నతంగా, అధమంగా ఉండేవి అయిన సురనరతిర్యక్ స్థావరాల రూపంలోని నాల్గువిధాలైన దేహాల సంబంధాన్ని దృఢంగా, నిశ్శేషంగా ఖండిస్తున్నదని భావిస్తాను.



63. అవ : ఇందులో స్వామి పీతాంబరవర్ణన చేయబడుతున్నది.
విద్యుద్భ్రామ్నా తడిత్వానివ నవతరణిచ్ఛాయయేవాంజనాద్రిః
వేలాహైమస్థలీభిః జలధిరివ నభ స్సాంద్రసాంధ్యశ్రియేవ ।
ఆక్రీడః కర్ణికారైరివ కనకకుథేనేవ దంతావళో౽సౌ
దేవః పీతాంబరేణ ప్రథయతి సుషమాం యాదవక్ష్మాధరేందుః ॥

పీతాంబరాన్ని ధరించిన, యదుగిరిలోని భక్తులను ఆహ్లాదపరచే తిరునారాయణస్వామి- పలు మెఱపుతీగలను కల మేఘంవలె, ఉదయించే సూర్యుని కాంతిని కల అంజన (కాటుక) పర్వతంవలె, కనకమయాలైన తీరప్రదేశాలను కల సముద్రంవలె, దట్టమైన సంధ్యారాగలక్ష్మిని కల ఆకాశంవలె, ఎఱ్ఱని కర్ణికార పుష్పాలను కల ఉద్యానవనంవలె, బంగారు తివాచీతో కప్పబడిన ఏనుగువలె ప్రకాశిస్తున్నాడు.

64. అవ : స్వామి ఊరువులు వర్ణింపబడుతున్నాయి.
ఏవం ప్రాయానుపూర్వీ యదపి కరికరే స్నిగ్ధతా దూరదూరే
రంభాస్తంభే ప్రసక్తా యదపి చ కియతీ స్నిగ్ధతా క్వానుపూర్వీ ।
స్యాతాం స్నైగ్ధ్యానుపూర్వ్యౌ కృతకమరకతస్తంబకే నో మృదుత్వం
మన్యే మృగ్యోపమానే యదుశిఖరిపతే రూరుకాండప్రకాండే ॥

ప్రారంభంలో లావుగా, క్రమంగా సన్నంగా ఉండే తిరునారాయణస్వామి ఊరువుల రూపంలోని ఆనుపూర్వి ఏనుగు తొండంలో కన్పించినప్పటికీ, స్వామి ఊరువులకు గల మృదుత్వం ఏనుగు కంఠానికి లేదు. అరటిబోదెలలో స్నిగ్ధత అనే గుణం ఏదో కొంచెం ఉన్నప్పటికీ, వాటిలో స్వామి ఊరువుల రూపంలోని ఆనుపూర్వి ఎక్కడ ఉన్నది? లేదు. ఈ స్నిగ్ధత, ఆనుపూర్వి- అనే రెండు గుణాలు మరకతమణిమయమైన స్తంభంలో ఉన్నప్పటికీ, స్వామి ఊరువులకు గల మృదుత్వం దానికి లేదు. అందువల్ల యదుగిరిపతి అయిన తిరునారాయణస్వామి యొక్క గొప్ప ఊరువులకు సామ్యం లోకంలో దుర్లభం. లోకంలో ఊరువులకు ఉపమానంగా చెప్పబడే కరికర, రంభాస్తంభ, మరకతస్తంభాలకంటే స్వామి ఊరువులు విలక్షణాలని భావం.

65. అవ : తిరునారాయణస్వామి పిక్కలు వర్ణింపబడుతున్నాయి.
కిం కాహళ్యౌ? కిం ను పూగీకుహళ్యౌ? శ్రీభూవాహ్యే కిం సమీచ్యౌ కళాచ్యౌ? ।
ముగ్ధస్నిగ్ధోదారదివ్యానుపూర్వ్యౌ కిం వా జంఘే యాదవక్ష్మాధరేందోః ॥

(కంటికి ఎదురుగా సాక్షాత్కరించే తిరునారాయణస్వామి జంఘలు (పిక్కలు)) కాహళి అనే వాద్యవిశేషాలా? లేక, పోక చెట్టు పూచిన పూల గుత్తులా? ఏమి? లేక, శ్రీదేవిభూదేవుల సంవాహనం చేయదగిన (పట్టుకొనదగిన) పతద్గ్రహి పాత్రలా? లేక, అద్భుతసౌందర్యాన్ని, స్నిగ్ధతను, సౌకుమార్యాదిగుణాలను, అప్రాకృతమైన ఆకారక్రమవిశేషాన్ని కల యదుగిరి నారాయణస్వామి పిక్కలా?

66. అవ : యదుగిరినారాయణస్వామి శ్రీచరణాలు మూడు శ్లోకాలతో వర్ణింపబడుతున్నాయి.

**విభోః పాదాంభోజం తదిద మశరణ్యైకశరణం**
**పరం ప్రాప్యం ప్రాప్తం యదుగిరిశిఖాశేఖరసఖమ్ ।**
**యదామర్శాదాశు ద్రవతి భృశ మాకాశమవశా -**
**దపి గ్రావా జీవత్యపి మిషతి దగ్ధామిషమపి ॥**

ఏ శరణం (దిక్కు) లేనివారికి గొప్ప దిక్కు, పరమప్రాప్యం, యదుగిరి నారాయణస్వామి శిరోభూషణంతో పోలినది. ముల్లోకాలను ఆక్రమించినదిగా ప్రసిద్ధి చెందినది, ప్రత్యక్షంగా దర్శించదగినది అయిన (యదుగిరి) ప్రభువు యొక్క శ్రీచరణకమలం నాకు లభించింది. ఈ శ్రీచరణాల స్పర్శవల్ల ఆకాశం అమూర్తం (రూపం లేనిది, చైతన్యం లేనిది) అయినా కల్గిన ఆనందపారవశ్యంచేత మిక్కిలి ద్రవిస్తుంది. శిలలు కూడా ప్రాణాన్ని పొందుతాయి. దగ్ధమైన మాంసపిండం కూడా కళ్ళు తెరుస్తుంది. (ఈ శ్లోకంలోని ఉత్తరార్ధంలో - గంగోత్పత్తి, అహల్యాశాప విమోచన, పరీక్షిత్ జీవన వృత్తాంతాలు రమ్యంగా ప్రస్తుతాలు.)

67. **సుచరితసుమతిసహితపరిచరణప్రణయ మననుగుణమివ పరిగణయన్ ।**
**యదుగిరిపరిబృఢచరణ మశరణః శరణ మగమ మిహ పరిచరణపరః ॥**

ఫలాన్ని కోరకుండా, వర్ణాశ్రమోచిత కర్మలను ఆచరించడమనే సదాచారం (కర్మయోగం), తత్త్వయాథాత్మ్యజ్ఞానం, లేక, ప్రజాపతి వాక్యంచేత తెలుపబడిన, ప్రత్యగాత్మ యొక్క ఉపాసన రూపమైన జ్ఞానయోగం - అనే వీటితో కూడినది భగవానుని విషయంలోని ప్రావణ్యం (భక్తిరూపంగా పరిణమించిన జ్ఞానం- వేదనధ్యాన ఉపాసనాది శబ్దాలతో వ్యవహరింపబడే కర్మజ్ఞానసహకృతమైన భక్తియోగం) భగవచ్ఛేషత్వ పారతంత్ర్యరూపలక్షణాన్ని కల ఆత్మకు తగనిది అని



తలచినవాడనైన, ఏదిక్కు లేని నేను భగవత్కైంకర్యమే పరమప్రయోజనంగా తలచి, యదుగిరి నారాయణస్వామి శ్రీచరణాలను ఉపాయంగా ఆశ్రయించాను.

68. **క్షమాలక్ష్మీకల్పవ్రతతివితతాం నాతిశిశిరాం**
**అనుష్ణా మభ్యర్ణోన్మిషదమృతసౌగంధ్యసుభగామ్ ।**
**భవవ్యధ్వభ్రాంతిప్రభవపరితాపప్రశమనీం**
**శ్రయే పాదచ్ఛాయాం యదుగిరితటీకల్పకతరోః ॥**

వృక్షం దానిపై పాకిన లతలవల్ల విస్తరించినట్లే. భూదేవి, లక్ష్మీదేవులనే కల్పలతల సంబంధంవల్ల విస్తరించినది. భరించరాని చల్లదనం లేనిది (సుఖాన్ని కల్గించే స్పర్శను కల్గినది) వేడిమి లేనిది, సమీపంలో ప్రసరించే జలసౌరభంతో మనోహరమైనది (నీటిలో పుట్టిన తామరల సువాసనతో మనోహరమైనది- మోక్షపరిమళ రూపమైన ఆనందంతో మనోహరమైనది), వృక్షాలు బాటసారుల దుర్గమ మార్గ శ్రమను తీర్చేటట్లే, సంసారమనే దుఃఖాన్ని కల్గించే దారిలో పరిభ్రమించండంవల్ల మిక్కిలి కల్గిన తాపత్రయాన్ని ముముక్షువులకు నశింపజేసేది అయిన, యదుగిరిలో కల్పవృక్షంవంటి తిరునారాయణస్వామి శ్రీపాదాల నీడను ఆశ్రయిస్తున్నాను. ( **"నాతిశిశిరామ్, అనుష్ణామ్"** - అనే విశేషణాల ద్వారా **"వాసుదేవ తరుచ్ఛాయా నాతిశీతా న ఘర్మదా"** అనే సూక్త్యర్థం అనుసంధింపబడింది.)

69. అవ : ఇంతవరకు యదుగిరిలోని మూలమూర్తిని ఆమౌళిపాదం దర్శించి, స్తుతించి, సింహావలోకనన్యాయంలో ఒకేసారి ఆ స్వామియొక్క అన్ని అంగాలను ఆమౌళిపాదంగా స్తుతిస్తున్నారు.

**ఉద్యన్మౌళి ముదారఫాల ముచితశ్వేతోర్ధ్వపుండ్రం శుభో-**
**దంచద్భ్రూలత మాయతాయతదృగంభోజం సుజాతస్మితమ్ ।**
**కంబుగ్రీవ ముదగ్రబాహువిటపం లక్ష్మీలసద్వక్షసం**
**వందే సుందరమధ్యమోరుచరణం శ్రీయాదవాద్రీశ్వరమ్ ॥**

ఊర్ధ్వదిశలోని తన కిరణాల ప్రసారంవల్ల పైకి ఉద్యమిస్తున్నట్లుగా ఉండే కిరీటాన్ని కలవాడు, మిలమిల మెరిసే లలాటాన్ని కలవాడు, ప్రకాశించే ముఖమండలాన్ని కలవాడు, తగిన, తెల్లని, శ్వేతమృత్తికతో దిద్దిన ఊర్ధ్వపుండ్రాలను కలవాడు, శుభకరమైన, అందమైన, లతలవంటి కనుబొమలను కలవాడు, మిక్కిలి

విశాలంగా ఉండే తామరలవంటి కన్నులను కలవాడు, చక్కగా వ్యక్తమయే చిఱునవ్వును కలవాడు, శంఖంవంటి కంఠాన్ని కలవాడు, పొడుగైన వృక్షశాఖలవంటి బాహువులను కలవాడు, లక్ష్మితో ప్రకాశించే వక్షస్సును కలవాడు, అందమైన నడుమును, గొప్ప శ్రీచరణాలను కలవాడైన శ్రీయదుగిరి నారాయణస్వామిని నమస్కరిస్తున్నాను.

70. అవ : ఈ విధంగా తిరునారాయణస్వామిని ఆమౌళిపాదం కీర్తించి, పాదాదిమౌళి పర్యంతంగా మళ్ళీ కీర్తిస్తున్నారు.

ఉత్ఫుల్లపద్మపద ముల్లసదూరుకాండ-
ముద్దామకాంచి ముపవీతిసువర్ణచేలమ్ ।
ఆజానుబాహు మరుణాధర మాయతాక్ష-
మాశాస్మహే సపది యాదవశైలనాథమ్ ॥

బాగా వికసించిన తామరపూవువంటి శ్రీపాదాలను కలవాడు, మిక్కిలి ప్రకాశించే గొప్ప ఊరువులను కలవాడు, గొప్ప మొలనూలును కలవాడు, ఉపవీతంగా అలంకరింపబడిన బంగారు ఉత్తరీయాన్ని కలవాడు, ఆజానుబాహువు, ఎఱ్ఱని అధరాన్ని కలవాడు, విశాలమైన నేత్రాలను కలవాడైన యదుగిరి తిరునారాయణుని వెంటనే దర్శించి ఆనందించగోరుతున్నాను.

71. అవ : ఇందులో పరమకారుణికుడైన యదుగిరినారాయణస్వామి భక్తులకు చేసే ఉపకారాలను అనుసంధిస్తున్నారు.

శమయతి తమ స్సూతే సత్త్వం ధినోతి శుభాం ధియం
ఘటయతి సతాం సక్తిం దత్తే సదార్యసమాశ్రయమ్ ।
భవపథపరిభ్రాంతిం రుంధే వ్యనక్తి పరం పదం
యదుగిరిశిఖారూఢం జ్యోతిః కిమప్యతిమానుషమ్ ॥

యాదవాచల శిఖరంలో ఉద్భవించిన, అతిమానుషమైన "నారాయణపరో జ్యోతిః" అని కీర్తింపబడిన జ్యోతిస్సు (తిరునారాయణ రూపంలోని పరంజ్యోతిస్సు) భక్తుల తమోగుణాన్ని పోగొడుతున్నది, వారికి సత్త్వగుణాన్ని కల్గిస్తున్నది. మంచి బుద్ధిని (జ్ఞానాన్ని) కల్గిస్తున్నది. "అస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదుః" అని వేదంచే కీర్తింపబడిన బ్రహ్మవేత్తలతో సంబంధాన్ని, సమీపవాసాన్ని కల్గిస్తున్నది. సదాచార్యసమాశ్రయణాన్ని అనుగ్రహిస్తున్నది. సంసారమార్గంలో పరిభ్రమణాన్ని నివారిస్తున్నది. ఉత్కృష్ట సిద్ధోపాయమైన తనను వ్యక్తీకరిస్తున్నది.

లౌకికమైన జ్యోతిస్సు పక్షంతో- తమస్సు = అంధకారం, సత్త్వం = సత్త్వగుణం చేత ఉపలక్షింపబడిన మంచిచెడ్డల ఆలోకం, శుభాధీః = పదార్థాలలో సదసద్వివేకం, సతాం సక్తిః = గ్రహించదగిన మంచి వస్తువులపట్ల ఆసక్తి, సదార్యసమాశ్రయం - వీరు సాత్త్వికులు, వీరు సదాచార్యులని తలచి వారిని ఆశ్రయించడం, భవపరిపథభ్రాంతి- సన్మార్గాన్ని దర్శించలేనందున కల్గిన భ్రాంతి, పరం పదం- ఉత్కృష్టమైన స్థానం- అని ఇత్యాదిగా అర్థాలను గ్రహించాలి. ఈ పదాల అర్థసామర్థ్యంవల్ల లోకంలో ప్రసిద్ధాలైన సూర్యుడు మొదలైన జ్యోతిస్సుల వ్యాపారం ఇక్కడ ధ్వనిస్తున్నది. అటువంటి లౌకిక జ్యోతిస్సుల కంటే విలక్షణమైన జ్యోతిస్సు - యదుగిరి శిఖరంలోని జ్యోతిస్సు - అని భావం.

72. అవ : భక్తులపట్ల తిరునారాయణస్వామి ప్రేమపారవశ్యాన్ని అనుసంధిస్తున్నారు.

అవ్యాజం దయతే స్మరత్యుపనయత్యాలోకతేఽంగీకరో -
త్యుత్సంగే కురుతే ప్రసీదతి ముహుర్మూర్ధాన మాజిఘ్రతి ।
ఆనందా ననుభావయత్యభిమతైః దాస్యామృతైః ప్లావయ-
త్యేష శ్రీయదుశైలమంగళనిధిః నారాయణోఽస్మత్కులమ్ ॥

యదుగిరిలోని మంగళనిధి అయిన ఈ తిరునారాయణస్వామి ఆశ్రితుల మైన మనలను "ఏష హ్యేవానందయతి" అనే శ్రుతి రీతిలో ఆనందింపజేస్తున్నాడు. గుణి అయిన తన విషయంలోనివి కనుక అమృతంవలె భోగ్యాలైన తన కైంకర్యాలతో ముంచెత్తుతున్నాడు. (తనకు ఇష్టమైన రీతిలో మనలను వినియోగించు కొంటున్నాడు) "ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాఽప్యుపజాయతే" అనే రీతిలో నిర్హేతుకంగా దయ చూపుతున్నాడు. "అహం స్మరామి మద్భక్తమ్" అనే రీతిలో తల్లి బిడ్డను స్మరించినట్లు మనలను ప్రేమతో స్మరిస్తున్నాడు. "ఆనయైనం హరిశ్రేష్ఠ" అనే రీతిలో తన సాన్నిధ్యాన్ని పొందిస్తున్నాడు. చాలాకాలం అనుభవించిన విశ్లేషం తరువాత పుత్రుని చూచిన తండ్రివలె సంభ్రమంగా మనలను వీక్షిస్తున్నాడు. పోగొట్టుకొన్న సొత్తు లభిస్తే దానిని స్వామి అభిమానించినట్లు మనలను అభిమానిస్తున్నాడు. "అంకే భరత మారోప్య" అనే క్రమంలో మనలను తన ఒడిలో కూర్చుండబెట్టుకుంటున్నాడు. మాటిమాటికి

మనపట్ల ప్రసన్నుడవుతున్నాడు. వాత్సల్యాతిశయంవల్ల మన శిరస్సును మూర్కొంటున్నాడు. (ఈ శ్లోకంలో వివిధక్రియాప్రయోగాలవల్ల తిరునారాయణ స్వామియొక్క మార్దవ, ఆర్జవ, సౌహార్ద, స్వామ్య, కారుణ్య, వాత్సల్య, సౌశీల్య, సౌలభ్యాది గుణాల అతిశయం అనుసంధింపబడింది.)

73. అవ : ఈ రీతిలో మూలమూర్తి అయిన తిరునారాయణస్వామిని అనుసంధించిన తరువాత, రామప్రియనామధేయుడైన ఉత్సవమూర్తిని కీర్తిస్తున్నారు.

**ప్రేమార్ద్రయా కమలయా క్షమయా సమేత-**
**మంసాంసఘట్టన రసోత్పులకాంగభాగమ్ ।**
**ప్రాక్దక్షిణే తదిహ సంయమిసార్వభౌమ-**
**సంపత్ప్రసూత మపరం వపు రావిరస్తి ॥**

తనపట్ల ప్రేమతో ఆర్ద్రమైన మనస్సును కల శ్రీదేవిభూదేవులతో కూడి ఉండేది, తన భుజాలకు దివ్యదేవేరులిద్దఱి భుజాలతో కల్గిన తాకిడివల్ల మనస్సులో కల్గిన సంతోషాతిశయంచేత రోమాంచాన్ని పొందినది, భగవద్రామానుజుల భాగ్యాతిశయంవల్ల వ్యక్తమైనది అయిన **"తద్విష్ణోః పరమం పదమ్"** అని శ్రుతి ప్రసిద్ధమైన శ్రీమన్నారాయణుని దివ్యరూపాంతరం (ఉత్సవమూర్తి) మూలమూర్తికి తూర్పుదక్షిణ దిశలో మన నేత్రాలకు గోచరమవుతున్నది.

74. అవ : యదుగిరినారాయణస్వామియొక్క పరత్వసౌలభ్యాలను, ఆశ్రిత పారతంత్ర్యాన్ని అనుసంధిస్తూ, ఆ గుణాలలో వ్యామోహాన్ని పొందుతున్నారు.

**శ్రీభూస్తనశ్రుతిశిరోయతిశేఖరాంక -**
**శ్రీయాదవాచలశిఖాసులభోపలంభమ్ ।**
**ఆపన్నతాపహర మాశ్రితకామధేను-**
**మాశాస్మహే కమపి పూరుష మంబుజాక్షమ్ ॥**

శ్రీదేవి భూదేవి వక్షఃప్రదేశంలో, వేదాంతాలలో, భగవద్రామానుజుల ఒడిలో, యదుగిరి శిఖరంలో సులభంగా దర్శన మిచ్చేవాడు, ఆపన్నుల తాపాలను పోగొట్టేవాడు, ఆశ్రితులకు కామధేనువు, **"యతో వాచో నివర్తంతే"** అనే రీతిలో స్వరూపరూప గుణవిభూతి లీలాదులలో అపరిచ్ఛేద్యుడు, సకలాంతర్యామి అయిన శ్రీమన్నారాయణుని దర్శించాలని ఆశపడుతున్నాము.



శ్రీభూస్తనాలలో ఉన్నవాడని అన్నందున శ్రియఃపతిత్వం, వేదాంతాలలో ఉన్నాడని అన్నందున వేదాంత వేద్యత్వం - వీటిద్వారా పరత్వం తెలుపబడింది. యాదవాచలంలో ఉన్నాడని అన్నందున సౌలభ్యం అనుసంధింపబడింది. **"అంబుజాక్షం కమపి పూరుషమ్"** అని అన్నందున **"సహస్రశీర్షా పురుషః", "య ఏషోంతరక్షిణి పురుషో దృశ్యతే", "భగవానితి శబ్దోఽయం తథా పురుష ఇత్యపి, నిరుపాధీ చ వర్తేతే వాసుదేవే సనాతనే"** అనే శ్రుతిస్మృతివచనాల అర్థం యదుగిరినారాయణస్వామి విషయంగా అనుసంధింపబడినట్లయినది.

75. అవ : రామప్రియులను ఆమౌళిపాదం స్తుతిస్తున్నారు.

**ఉత్తుంగం ముకుటే విశాల మళికే వక్రం భ్రువో రాయతం**
**నేత్రాంతే రుచిరం కపోలఫలకే స్మేరం ముఖాంభోరుహే ।**
**స్ఫీతం వక్షసి సంస్థులం భుజవనే మృగ్యం వలగ్నే సుసం-**
**శ్లిష్టం పాదయుగే యతీంద్రహృదయావాసం మహః సంశ్రయే ॥**

కిరీటాగ్రంలో ఉన్నతమైనది, లలాటంలో విశాలమైనది, కనుబొమలలో వక్రతను కల్గినది, నేత్రాల చివరలో దైర్ఘ్యాన్ని కల్గినది, ఫలకాలవంటి చెక్కిళ్ళలో భాస్వరమైనది, పద్మాలవంటి నేత్రాలలో వికాసాన్ని కల్గినది, వక్షస్సులో సమృద్ధ (విశాల)మైనది, బాహుపంక్తిలో విస్తృతమైనది, నడుముభాగంలో సన్ననిది, పాదయుగంలో పరస్పరసాదృశ్యాన్ని కల్గినది, యతీంద్రుల హృదయమనే దివ్యమందిరంలో నివాసాన్ని కల్గినది అయిన తిరునారాయణస్వామి అనే పరంజ్యోతిని ఆశ్రయిస్తున్నాను.

76. అవ : పూర్వాచార్యులచే అనుసంధింపబడిన ఈ రూపమే శరణ్యమని పల్కుతున్నారు.

**హస్తారవిందకలితాభయశంఖచక్ర మబ్జాసనాహితపదాబ్జ ముదగ్రమౌళి ।**
**ఆవిఃస్మితం సువదనం యతిరాజసూనోః సంస్థానమేవ శరణం శరణార్థినాం నః ॥**

పద్మాలవంటి హస్తాలలో అభయముద్రను, శంఖచక్రాలను కలవాడు, పద్మాసనంలో నిలిపిన శ్రీపాదాలను కలవాడు, ఉన్నతమైన కిరీటాన్ని కలవాడు, బయటకు వెలువడే చిఱునవ్వును కల చక్కని ముఖాన్ని కలవాడు, యతిరాజ సంపత్కుమారనామధేయుడైన రామప్రియుని సంస్థానమే (ఈ రూపమే) శరణు

వేడే మనకందఱికి రక్షకం. "తిరుక్కైయిలే పిడిత్త దివ్యాయుధ జ్ఞళుమ్" ఇత్యాది ముముక్షుప్పడి గ్రంథంలోని చూర్ణికయొక్క భావం ప్రకృతంలో అనుసంధేయం.

77. అవ : అభినివేశాతిశయంవల్ల చూపులు రామప్రియుల దివ్యదేహంలో ఎక్కడెక్కడ ప్రసరిస్తున్నాయో, అక్కడక్కడ వేఱు విషయాన్ని భావించకుండా, యతిరాజసంపత్కుమారులను ఆపాదచూడం దర్శించాలి- అని ప్రార్థిస్తున్నారు.

అంచత్కిరీట మలకావృతఫాల మాయ-
న్నేత్రాబ్జ మంకురితహాస ముదగ్రనాసమ్।
విష్వగ్భుజం విపులవక్షస మీక్షిషీయ
సంపత్సుతం తత ఇతః పురతోఽభితశ్చ ॥

గొప్ప కాంతిని వెలువరించే కిరీటాన్ని కలవాడు, ముంగురులతో ఆవరింప బడిన ఫాలాన్ని కలవాడు, దీర్ఘమైన నేత్రాలను కలవాడు, కొంచెం వెలువడే చిఱునవ్వును కలవాడు, ఉన్నతమైన నాసికను కలవాడు, విశాలవక్షఃస్థలాన్ని కలవాడైన యతిరాజసంపత్కుమారులను అక్కడ ఇక్కడ, ముందు వెనుక, సర్వత్ర మనం దర్శించాలి.

78. అవ : ఇక, స్తోత్రాన్ని పరిసమాప్తి చేస్తూ, తిరునారాయణస్వామి కల్యాణ గుణానుభవానికి ఉపయోగించేది, స్వయంగా పరమప్రాప్యమైనది అయిన తిరునారాయణపురంలోని నిత్యవాసాన్ని ఆశిస్తున్నారు.

జనో యత్సీమాంతే యతినృపతివార్తామహిమవిత్
కుటీం కుర్వన్నిష్టే పరమపదవాటీవితరణే ।
తదార్యాగారాంతావవకర మపనేతుః కిల సమాః
శతం భోగస్థానం భవతు మమ నారాయణపురమ్ ॥

"యదుశైల నిత్యవసతిః" అనే భగవద్రామానుజుల సూక్తియొక్క, "క్షణమపి నివసంతః కేవలమ్" అనే పౌరాణిక సూక్తియొక్క, "కర్మజ్ఞానాదులలో శక్తిలేని ముముక్షువు యాదవాద్రిలో స్థిరనివాసాన్ని చేయాలి'' అనే ఆద్యుల సూక్తియొక్క మహిమను తెలిసికొని, అందులో విశ్వాసాన్ని కలవాడైన, ముముక్షువు ఆ యాదవా చల సమీపంలో ("వైకుంఠవర్ధనం నామ క్షేత్రం తత్ సత్య ముచ్యతే, ప్రమాణం తస్య విజ్ఞేయం పరితో యోజనద్వయమ్" అనే ప్రమాణానుసారంగా యాదవాద్రికి



రెండు యోజనాలదూరంలో ఎక్కడైనా) చిన్నగుడిసెను నిర్మించుకొని, అక్కడ నివసిస్తూ, తాను తరించడమేకాక, పరమపదంలో గృహపంక్తిని తనను ఆశ్రయించిన వారికి వితరణ చేయడంలో సమర్థుడవుతున్నాడు. అటువంటి తిరునారాయణ పురంలో నివసించే మహనీయులైన ఆచార్యుల గృహాలలో తృణాదులను తొలగించే సమ్మార్జన కైంకర్యాన్ని చేసే, నాకు ఆ దివ్యదేశం, ఆ తిరునారాయణస్వామియొక్క గుణానుభవకైంకర్యాలకు స్థానం కావాలి.

79. అవ : ఈవిధంగా యదుగిరినారాయణస్వామి కైంకర్యరూప ఫలాన్ని అభ్యర్థించి, స్వదోషాలను స్మరించి, ఆశ్చర్యపడి భయపడి, యదుగిరి నారాయణ స్వామిని కరుణించమని ఆచార్యపురుషకార పురస్సరంగా అర్థిస్తున్నారు.

అచింతయిత్వా మద్వృత్త మాలోక్యాచార్యసంతతిమ్ ।
దయానిధే! నిధేహి త్వద్దాసదాస్యశ్రియం మయి ॥

ఇతరుల దుఃఖాన్ని చూచి సహించలేక పోవడమనే దయకు నిధివంటి ఓ యదుగిరినారాయణస్వామీ ! నా చరిత్రను చూడకుండా (నా ఆచార్యులనుండి నీవరకు గల) ఆచార్యపరంపరను చూచి, నాకు నీ దాసులకు దాస్యం చేయడమనే సంపదను స్థిరంగా కల్గించు.

యదుగిరినారాయణస్తవం సంపూర్ణం

శ్రీకౌశికాన్వయనృసింహగురో స్తనూజమ్
తత్సేవయాప్తనిగమాంతయుగార్థతత్త్వమ్ ।
శ్రీశ్రీనివాసగురువర్యదయైకపాత్రం
శ్రీశైలదేశిక మహం శరణం ప్రపద్యే ॥

కౌశికగోత్రులైన నరసింహాచార్యులవారి కుమారుడు, ఆ నృసింహాచార్యుల వారి సేవవల్ల ఉభయవేదాంతార్థతత్త్వాన్ని గ్రహించినవారు, శ్రీనివాసాచార్యులవారి అభిమానానికి పాత్రం అయిన తిరుమలాచార్యులవారిని నేను శరణుపొందు తున్నాను.

# అనుబంధం

భగవద్రామానుజులకు తిరునారాయణపురం పట్ల, అచట వేంచేసి ఉండే తిరునారాయణస్వామిపట్ల గల భక్తిప్రపత్తులు అనన్యసామాన్యాలు. వారు, తిరువాయ్మొழி ప్రబంధంలోని "ఒరునాయకమ్" (4-1) అనే దశకాన్ని ఇచటి స్వామి విషయంగా సమర్పించారని ప్రసిద్ధి. ఆ దశకంలోని పాశురాల తాత్పర్యం నివేదింప బడుతున్నది.

**1.** అవతారిక :- ఏకాధిపత్యాన్ని చెలాయించిన ప్రభువులే అధికారాన్ని భిక్షువులై క్లేశాన్ని పొందుతున్నారు. అందువల్ల జీవులతో నిరుపాధికమైన సంబంధాన్ని కలవాడై, నిత్యంగా లక్ష్మిని కల నారాయణుని శ్రీచరణాలను ఆశ్రయించండి- అని అంటున్నారు ఈ పాశురంలో.

ఒరు నాయకమాయ్ ఓడ ఉలగుడనాణ్డవర్
కరునాయ్ కవర్న్ద కాలర్ శిదైగియ పానైయర్
పెరునాడు కాణ ఇమ్మైయిలే పిచ్చైతామ్ కొళ్వర్
తిరునారణన్ తాళ్ కాలమ్పెఱ చ్చిన్దిత్తుయ్మ్మినో

సకలభూమికి ఎదురు లేని, అద్వితీయమైన ఆధిపత్యాన్ని కలవారై, చిరకాలం తమ అధికారం ప్రవర్తించేటట్లుగా లోకాన్ని పాలించినవారుకూడా, ఆ రాజ్యాన్ని కోల్పోగానే లజ్జను పొంది, రాత్రి వేళలో బిచ్చమెత్తుకొని జీవించడంకోసం బయలుదేరుతారు. భిక్షకోసం అన్వేషిస్తూ చీకటిలో వీథిలోని నల్లకుక్కను చూడకుండా దానిని వారు తొక్కినపుడు అది వారి కాలును కఱుస్తుంది. ఎందుకూ పనికిరానిది అని పారవేసిన పగిలిన బానను భిక్షపాత్రగా చేసికొని, తాము పాలించిన ఈ సమస్తజగత్తు చూస్తూ ఉండగానే ఈ జన్మలోనే సిగ్గును విడచి బిచ్చాన్ని యాచించి పొందుతారు. అందువల్ల ఐశ్వర్యం అస్థిరమైనది కనుక, నిత్యంగా సిరిని కల నారాయణుని శ్రీచరణాలను ఆలస్యం చేయకుండా అనుసంధించి ఆశ్రయించి ఉజ్జీవించండి. (అందువల్ల శ్రియఃపతి అయిన నారాయణుని శ్రీచరణాలే ఆశ్రయణీయం, ప్రాప్యం ఉపాయం, ఉపేయం).



**2.** అవ : ఐశ్వర్యానికి భంగం కల్గడమే కాదు, తాను అభిమానించే వారితోకూడా వియోగం కల్గుతుంది. అందువల్ల సర్వాధిక శేషి అయిన శ్రియఃపతి ఆశ్రయించండి- అని ఇందులో అంటున్నారు.

ఉయ్మిన్ తిఱై కొణర్న్దు ఎన్డ్రు ఉలకాణ్డవర్ ఇమ్మైయే
తమ్మిన్ శువై మడవారై ప్పిఱర్ కొళ్ళ త్తామ్ విట్టు
వెమ్మిన్ ఒళి వెయిల్ కానగమ్పోయ్ క్కుమైత్ తిన్బర్గళ్
శెమ్మిన్ ముడి త్తిరుమాలై విరైన్దడి శేర్మినో.

"మీరు కప్పాన్ని తీసికొని వచ్చి నాకు చెల్లించి ఉజ్జీవించండి"అని సామంత రాజులతో పల్కి లోకాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించిన చక్రవర్తులు కూడా, ఈవిధంగా జీవించిన జన్మలోనే తమకు చెందినవారు, తమకు చాలా ఇష్టమైనవారు, ఆనందాన్ని కల్గించేవారు, తమ విషయంలో పారతంత్ర్యాన్ని కల్గిన అంతఃపుర స్త్రీజనాన్ని ఇతరులు వచ్చి స్వాధీనం చేసికోగా, వారిని విడచిపెట్టి ఆ ప్రదేశం నుండి వెళ్ళిపోయి, చాలా వేడిమిని కల్గిన, చూచినవారి కళ్ళను మిఱుమిట్లు కల్గించే ఎండను కాచే అడవులలోకి పోయి నివసిస్తారు. అక్కడకూడా వారు తమ శత్రువులచే పీడింపబడతారు. అందువల్ల మణులతో ఎఱ్ఱని కాంతిని కల్గిన, అప్రతిహతమైన తేజస్సు కల్గిన కిరీటాన్ని ధరించిన శ్రియఃపతి శ్రీచరణాలను త్వరగా ఆశ్రయించండి.

**3.** అవ : తమ పాదాలలో వాలిన ప్రభువులను ఒక వస్తువుగా లెక్కించని సార్వభౌములు కూడా "ఇతడు ఒకచేతనుడు" అని ఇతరులు భావించని అధమ స్థితిని పొందుతారు. అందుచేత పరమభోగ్యుడైన శ్రీకృష్ణుని శ్రీచరణాలను ఆశ్రయించండి- అని అంటున్నారు.

అడిశేర్ ముడియినరాగి అరశర్గళ్ తామ్ తొழ
ఇడిశేర్ మురశఙ్గళ్ ముఱ్ఱత్తియమ్ప ఇరున్దవర్
పొడి శేర్ తుగళాయ్ ప్పోవర్గళ్ ఆదలిల్ నొక్కెన
కడిశేర్ తుழాయ్ముడి క్కణ్ణన్కழల్కళ్ నినైమినో

కిరీటశిరస్కులైన ప్రభువులు వచ్చి తమ పాదాలలో నమస్కరించగా, పిడుగువలె ధ్వనించే మృదంగాది వాద్యాల ధ్వనిని వింటూ ఆసక్తులై ఉండి, ఆ

ప్రభువులను గమనించని చక్రవర్తులుకూడా కాలాంతరంలో ధూళిధూళిగా, ఏమాత్రం గౌరవం లేనివారుగా అవుతున్నారు. అందువల్ల వెంటనే పరిమళాన్ని కల్గిన తులసిచే అలంకరింపబడ్డ కిరీటాన్ని కల శ్రీకృష్ణుని శ్రీచరణాలను ధ్యానించండి.

**4.** అవ : ఐశ్వర్యం స్థిరంగా నిలచి ఉండేది కాదు. గౌరవం శాశ్వతంగా నిలువదు. ఆయుస్సు శాశ్వతం కాదు. భోక్తలుకూడా సపరివారంగా ఏనాడో ఒకనాడు నశించిపోతారు. అందువల్ల విరోధినిరసనశీలుడైన శ్రీకృష్ణుని శ్రీచరణాలను ఆశ్రయించండి- అని అంటున్నారు.

నినైప్పాన్‌పుగిల్ కడలెక్కలిల్ నుణ్మణలిన్ పలర్
ఎనై త్తోఱుగఙ్గళుమ్ ఇవ్వులకాణ్డు క*ళి*న్దవర్
మనైప్పాల్ మరుఙ్గఱ మాయ్‌దలల్లాల్ మ*ఱ్ఱు*క్కణ్డిలమ్
వనైత్తాళ్ మదకళిఱట్టవన్ పాదమ్ పణిమినో.

లెక్కించడం ఆరంభిస్తే, అనేకయుగాలుగా ఈ లోకాన్ని పాలించి నశించిపోయినవారిని లెక్కిస్తే వారి సంఖ్య సముద్రతీరంలోని ఇసుక పరమాణువుల వలె లెక్కకు మించి ఉంటారు. వారు నివసించిన గృహాలు, పరిసరాలు ఏమీ తేడా లేకుండా అన్నీ నశించిపోతాయి తప్ప నిత్యంగా నిలచి ఉండడాన్ని చూడలేము. కనుక, తాళవృక్షంవలె విస్తరించిన పాదాలను కల మత్తగజాన్ని (కువలయాపీడాన్ని) సంహరించినవాని శ్రీచరణాలను ఆశ్రయించండి.

**5.** అవ : తాము అభిమానించే స్త్రీలతో పొందే భోగం అస్థిరం. కనుక, అభిరూపుడైన భగవానుని తిరునామాన్ని అనుసంధించి ఉజ్జీవించాలని చూడండి- అని అంటున్నారు.

పణిమిన్ తిరువరుళెన్నుమ్ అఞ్జీద ప్పైమ్పూమ్ పళ్ళి
అణిమెన్ కు*ళ*లార్ ఇన్బక్కలవి యముదుణ్డార్
తుణిముమ్బునాల ప్పల్లే*ళై*యర్ తామ్ ఇ*ళి*ప్ప చ్చెల్వర్
మణి మిన్ను మేని నమ్మాయవన్ పేర్ శొల్లి వా*ళ*మినో.

“అందమైన చల్లని, విశాలమైన ఈ పూల సెజ్జపై నివసించి ఆనందించండి”- అని (తాము) ఆదరంతో పలికినప్పటికీ తాము అభిమానించే స్త్రీలు ఆ మాటలను



లెక్కించకుండా కేశాలంకరణను చేసికొంటూ, ఆభరణాలను ధరిస్తూ, అనాదరం స్ఫురించేటట్లు వర్తిస్తారు. ఆ అనాదరణలోనే రసికులు ఆనందాన్ని పొందుతారు. అటువంటి స్త్రీజనాన్ని సైతం ఇతరులు వచ్చి స్వాధీనం చేసికొన్నపుడు, వారిపట్ల ఆశను పోగొట్టుకోలేక వారిని విడువలేక అనుసరిస్తారు. అపుడు తాము ధరించే వస్త్రం పొడుగు చాలనందువల్ల తమ శరీరం ముందు భాగాన్ని కప్పుకోవాలని ప్రయత్నించినపుడు అది వెనుక భాగానికి చాలకుండా ఉంటుంది. అపుడు పూర్వం తమ పట్ల ఎంతో ఆదరాన్ని చూపించిన ఆ స్త్రీజనం అనాదరాన్ని చూపిస్తూ, హేళన చేస్తూ పల్కుతారు. ఆ మాటలనుకూడా వీరు “మన విషయంలోని ప్రేమవల్లకదా ఈ విధంగా అంటున్నారు” అని భావిస్తూ ఆశాపాశంతో వారిని విడవకుండా వెంటపడతారు. అందువల్ల నీలరత్నంవలె కాంతిని కల తిరుమేనిని కల, ఆశ్రితవ్యామోహాన్ని కల వారిని తిరునామాలను అనుసంధించి ఉజ్జీవించండి.

**6.** అవ : ఈ లోకంలో స్థిరంగా నిలచి ఉండే వారెవరూ లేరా ? అంటే, సృష్టికాలం నుండి ఈనాటివరకు ఒకేరూపంగా జీవించినవారెవరూ లేరు. స్థిరమైన జీవనాన్ని కోరేవారు క్షీరాబ్ధిశాయికి శేషభూతులు కండి- అని అంటున్నారు.

వా*ళ్*న్దార్‌గళ్ వా*ళ్*న్దదు మామ*ళై*మొక్కలిల్ మాయ్‌న్దు మాయ్‌న్దు
ఆ*ళ్*న్దార్ ఎన్టల్లాల్ అన్టు ముదల్ ఇన్టఱుతియాయ్
వా*ళ్*న్దార్‌గళ్ వా*ళ్*న్దే నిఱ్పర్ ఎన్బదిల్లై నిఱ్కుఱిల్
ఆ*ళ్*న్దార్ కడఱ్పళ్ళి అణ్ణలడియవరామినో.

లోకంలో గొప్పగా జీవించినట్లుగా భావించినవారి జీవితంకూడా పెద్ద వర్షంలోని నీటి బుడగవలె నశించి, నశించి అధోగతిపాలు అయ్యారు తప్ప, పుట్టిననాటినుండి ఈనాటివరకు ఏకరూపంగా జీవిస్తూ ఉన్నవారు ఎవరూ లేరు. స్థిరమైన జీవనాన్ని పొందాలి అని భావిస్తే లోతైన సముద్రాన్ని పడుకగా కల్గిన సర్వస్వామికి దాసులు కండి.

**7.** అవ : ఐశ్వర్యానికి మీరు పలికే అస్థిరమనే దోషం ఉన్నప్పటికీ, అన్న పానాదులకు ధారకాలు, భోగ్యాలై ఉండే ఆకారం ఉన్నది కదా ! అని అంటే, అవికూడా అస్థిరాలే, అందువల్ల సర్వస్మాత్‌పరుడైనవాని గుణాలను అనుసంధించండి- అని అంటున్నారు.

ఆమిన్ శువైయవై ఆటోడు అడిశిల్ ఉణ్డార్‌న్దపిన్
తూమెన్‌మొழி మడవార్ ఇరక్క పిన్నుమ్ తుற்றువార్
ఈమిన్ ఎమక్కొరు తుற்றెన్ఱు ఇడఱువర్ ఆదలిల్
కోమిన్ తుழாయ్‌ముడి యాదియఞ్జోది కుణజ్గళే.

షడ్రసోపేతాలు, హృద్యాలైన అన్నం మొదలైన పదార్థాలను భుజించి, తృప్తిచెందిన తరువాతకూడా ప్రేమను, పలుకులో తీయదనాన్ని కల్గినందువల్ల కాదనడానికి వీలులేని అందమైన యువతులు “ఇదిగో ఇది నా ముద్ద తిను” అంటే కాదనలేక కష్టపడి దానిని భుజిస్తారు. కాని, సంపద నశించినపుడు ఆ స్త్రీలవద్దకే పోయి “మీరు అందఱు నాకొక ముద్ద పెట్టండి” అని అంటే వారు పెట్టకపోయినా, వారి వాకిళ్ళలో విడువకుండా తిరుగుతారు. అందువల్ల జగత్కారణభూతుడై, నిరవధికమైన సౌందర్యాన్ని కలవాడై, తులసిచే అలంకరింపబడిన శ్రియఃపతి యొక్క కల్యాణగుణాలను **“సోఽశ్నుతే”** అని, **“ఓవాద ఊణాక ఉణ్”** అనే రీతిలో అనుభవించండి.

**8.** అవ : రాజ్యం అస్థిరంగా ఉండడానికి కారణం- పురుషుడు అస్థిరంగా ఉండడంవల్ల కదా! అతడు స్థిరంగా ఉంటే అది కూడా స్థిరంగా ఉంటుంది కదా! అని అంటే, అయినా, ఈ రాజ్యాదిభోగాలు భగవానుని ఆశ్రయించకపోతే నిలువవు. ఒకవేళ ఆశ్రయించి పొందినా, అవి తమ స్వభావాన్ని బట్టి నిలకడగా నిలువవు. అందువల్ల అతనినే ఆశ్రయించండి -అని అంటున్నారు.

కుణఙ్గొళ్ నిఱైపుగழ் మన్నర్ కొడైక్కడన్ పూణ్డిరున్దు
ఇణఙ్గి యులకుడనాక్కిలుమ్ ఆజ్గవనై యిల్లార్
మణఙ్గొణ్డ పోగత్తు మన్నియుమ్ మీళ్‌వర్‌గళ్ మీళ్‌విల్లై
పణఙ్గొళ్ అరవణైయాన్ తిరునామమ్ పడిమినో.

శీలాదిగుణాలకు ఆకరమైనవారై, ఆ గుణాలను లోకం కీర్తించడంవల్ల పూర్ణమైన కీర్తిని కలవారైన ప్రభువులు తమకు గల సంపద లోకానికి ఉపయోగించే ఔదార్యమనే స్వభావాన్ని కలవారై, లోకులతో కలసి వర్తించినా, ఆ భగవానుని అనుగ్రహంవల్ల ఆ ఐశ్వర్యాన్ని వారు పొందకపోతే అది నిలువదు. నిత్యమైన ఐశ్వర్యాన్ని పొందినా, నిలకడా నిలువని ఆ ఐశ్వర్యంయొక్క స్వభావంచేత దానిని



కోల్పోతారు. అందువల్ల **“న చ పునరావర్తతే”** అనే ప్రాప్యాన్ని పొందడమే తగినది. తన స్పర్శచేత వికసించిన పడగలను కల్గిన ఆదిశేషుని పడుకగా కల్గినవాని తిరునామాలను అనుసంధించండి.

**9.** అవ : ఇంతవరకు ఐహికభోగం అస్థిరమని అన్నారు. ఈ పాశురంలో, శరీరాన్ని క్లేశింపజేసి తపస్సు చేసి ఆ తపఃఫలం ద్వారా స్వర్గాన్ని పొందాలన్నా, దానికోసం కూడా భగవదనుగ్రహం కావాలి. ఒకవేళ ఆ స్వర్గం ప్రాప్తించినా, అది తన స్వభావం వల్ల నిలచి ఉండదు- అని అంటున్నారు.

పడిమన్ను పల్‌కలన్ పற்றோడఱుత్తు ఐమ్బులన్ వెన్లు
శెడిమన్ను కాయమ్ శెற்றார్‌గళుమ్ ఆజ్గవనై యిల్లార్
కుడిమన్ను మిన్ శువర్క్క మెయ్‌దియుమ్ మీళ్‌వర్‌కళ్ మీళ్విల్లై
కొడిమన్ను పుళ్ళుడై అణ్ణల్‌కழల్‌గళ్ కుఱుగుమినో.

క్షేత్రాదులను, పలు ఆభరణాలను నిస్సంగంగా విడచి, విషయాంతరాలలో ఆసక్తాలైన పంచేంద్రియాలను తమ వశం చేసికొని, కఠినమైన తపస్సుద్వారా శరీరాన్ని కృశింపజేసినవారుకూడా తపస్సుకు ఫలంగా చిరకాలం నిలచి ఉండే, నరకం కంటే విలక్షణమై ప్రకాశించే స్వర్గాన్ని పొందినా, భగవానుని అనుగ్రహం లేకపోతే అది సిద్ధించదు. సిద్ధించినా దానిని కోల్పోతారు. అందువల్ల ఆశ్రితులను తనకు నిరూపకంగా కల సర్వాధికుని శ్రీచరణాలను ఆశ్రయించాలని చూడండి.

**10.** అవ : ఇహలోకంలోని ఐశ్వర్యం, స్వర్గానుభవం అస్థిరమని ఇంతవరకు అన్నారు. కైవల్యం ఇటువంటిదికాదుకదా. అది స్థిరమైనపురుషార్థం కదా ! అని అంటే, అది ఐశ్వర్యం, స్వర్గాల కంటే విలక్షణమైనదే అయినా, భగవదానందంతో పోలిస్తే దానిలో ఇది ఏకదేశమే కనుక చాలా నీచమైనది. అందువల్ల భగవానుని ఆశ్రయించాలని చూడండి- అని ఇందులో అంటున్నారు.

కుఱుగమిగ ఉణర్వత్తొడు నోక్కి ఎల్లామ్ విట్టు
ఇఱుగలిఱప్పెన్నుమ్ ఞానిక్కుమ్ అప్పయనిల్లైయేల్
శిఱుగ నినైవదోర్ పాశముణ్డామ్ పిన్నుమ్ వీడిల్లై
మఱుగలిల్ ఈశనై పற்றి విడావిడిల్ వీడఃదే.

మనస్సును విషయాంతరాలలో ఆసక్తం కాని రీతిలో ప్రత్యక్ విషయంలో ఆసక్తం చేసి, జ్ఞానస్వరూపమైన ఆత్మతో ప్రావణాన్ని కల్గి ఉండేటట్లు చేసినవాడై, మిగిలిన అన్నిటినీ విడచి కైవల్యాన్ని పొందే కైవల్యనిష్ఠునకుకూడా స్వయం ప్రయోజనరూపమైన భగవదుపాసనం (అంతిమస్మృతి) లేకపోతే, ఆ కైవల్యాన్ని పొందడం వీలు కాదు. అందువల్ల కైవల్యం దుస్సాధం కనుక, ఈశ్వరసాపేక్షం కనుక, భగవదనుభవంతో పోల్చినపుడు అది చాలా అధమం కనుక, అపురుషార్థం కనుక, భగవత్కైంకర్యాన్నే పరమప్రాప్యంగా తలచి ఆశ్రయించండి.

**11.** అవ : ఈ దశకాన్ని అభ్యసించినవారు ఐశ్వర్యాది క్షుద్రపురుషార్థాలను విడచి, భగవత్కైంకర్యాన్నే భోగంగా కల్గినవారు కాగలరు. -అని అంటున్నారు.

**అఃదే ఉయ్య ప్పుగుమాఱెన్ఱు కణ్ణన్క*ழ*ల్‌గళ్ మేల్**
**కొయ్ పూమ్ పొ*ழి*ల్ శూ*ழ்* కురుగూర్‌చ్చడకోపన్ కు*ற்றే*వల్‌గళ్**
**శెయ్‌కోలత్తాయిరమ్ శీర్‌త్తొడై ప్పాడల్ ఇవై పత్తుమ్**
**అఃకామల్ కఱ్పవర్ ఆ*ழ్*తుయర్ పోయ్ ఉయ్యప్పాలరే.**

ఉజ్జీవించడానికి తగిన ఉపాయం అదే- అని నిశ్చయించుకొని, ఆశ్రిత సులభుడైన శ్రీకృష్ణుని శ్రీచరణాలలో, నిత్యవసంతంగా భాసించే తోటలను చుట్టూ కల్గిన తిరునగరికి నిర్వాహకులైన నమ్మా*ழ*్వార్లు చేసిన ఈ వాచిక కైంకర్యరూపమైనది, అందమైన కవిత్వానికి ఉండదగిన అలంకారాలలో ఏకొఱత లేనిది, భగవత్కల్యాణ గుణాలనుకూర్చి పలుకబడినది అయిన దశకాన్ని పూర్తిగా తప్పకుండా అనుసంధిస్తే ఐశ్వర్యకైవల్యాదులలోని దోషం తెలుస్తుంది. అపుడు వాటివల్ల కలిగే దుఃఖం పోయి, ఉజ్జీవించే స్వభావాన్ని కలవారు కాగలరు. (భగవానుని ప్రాప్యంగా ప్రాపకంగా ఆశ్రయించి ఉజ్జీవిస్తారు.)



### శ్రీనారదపురాణాన్తర్గత

# శ్రీమద్యాదవగిరిమాహాత్మ్యమ్

## వ్యాసాదీనాం బదరీవనస్థనారాయణసమీపగమనమ్

ఏకదా మునయ స్సర్వే హ్యైకాన్త్యేన వ్యవస్థితాః । ప్రాపుర్నారాయణం దేవం నరనారాయణాశ్రమే ॥ 1 ॥ వ్యాసో వసిష్ఠః కపిలో మార్కణ్డేయశ్చ కాశ్యపః । అత్రిర్దక్షో భరద్వాజోవిశ్వామిత్రశ్యశౌనకః ॥ 2 ॥ గౌతమోజమదగ్నిశ్చపులస్త్యః కుమ్భసమ్భవః॥ వాల్మీకిర్వామదేవశ్చవైశమ్పాయనభార్గవౌ ॥ 3 ॥ ఏతేచాన్యేచము నయస్సర్వేవిష్ణు పరాయణాః । సర్వేవేదార్థతత్త్వానాం నిర్ణేతారోయు గేయుగే ॥ 4 ॥ తేతత్రమునిరూపేణ లిష్ఠన్తంమునిసత్తమాః । నారాయణం నమశ్చక్రుర్నరం చైవతతః పరమ్ ॥ 5 ॥ తుష్టుపుశ్చహృషీ కేశంత తన్సవ్యం స్తవప్రియమ్ । శ్రుతిసిద్ధాన్తసిద్ధాభిస్స్తుతిభిస్తోత్ర కోవిదాః ॥ 6 ॥ ఋషయః ॥ భగవన్దైవదేవేశనమోనారాయణాయతే । రక్షకస్త్వంహి విశ్వస్యశేషీ చాసి శ్రియఃపతే ॥ 7 ॥ మాతాపితృసహస్రేభ్యోవత్సలోసిచదేహినామ్ । అవలమ్బ్యసమస్మాకరకంకరుణాతవకేవమ్ ॥ 8 ॥ భవన్తంశరణంప్రాప్తాభవసన్తాప హారిణమ్ । పశ్యన్తిసూరిభిస్సార్థంతద్విష్ణోఃపరమం పదమ్ ॥ 9 ॥ అగ్నౌప్రోతమిషీ కాణాంతూలంయద్వత్ప్రమాయతే । త్వామాశ్రిత్యప్రదూయన్తేపాప్మానస్తద్వదేవనః ॥ 10 ॥ ఆలోకయకటాక్షైస్త్వమనుకంపాబ్ధివీచిభిః । అస్మానపి పరాంభక్తిం వహత స్త్వత్పదామ్బుజే ॥ 11 ॥ ఇత్థం నానావిధైః స్తోత్రైస్స్తుతస్సపురుషోత్తమః । ఉవాచముని శార్దూలాన్గురుభిర్వాక్యవిస్తరైః ॥ 12 ॥ స్వాగతంభవతామద్యసుఖమస్త్వధికంహివః ॥ యుష్మా కందర్శనేనాహంపరితుష్యామిభూయసా ॥ 13 ॥ మద్భక్తాహిమమ ప్రాణామమాత్మాజ్ఞానినాంవరాః । తల్లాభాదపరంలాభం నచమన్యేకదాచన ॥ 14॥ భవదాగమనేకార్యం బ్రూతయూయంమమాఖిలమ్ । సంశ్రితత్రాణహేతుర్మేసర్వో రూప పరిగ్రహః ॥ 15 ॥ మునిభిశ్చోదితస్తత్రపారాశర్యోమునిస్తతః । సర్వంవిజ్ఞాప యామాసవమాగమన కారణమ్ ॥ 16 ॥ వ్యాసః మన్త్రాణాంపరమోమన్త్రోయోయమ ష్టాక్షరాత్మకః । ఉపదేష్టాసితస్యత్వంతవశిష్యాస్తతోవయమ్ ॥ 17 ॥ దైవతంత్వం గురుశ్చత్వం మాతాచత్వం పితాచనః । నహినారాయణా దన్యః కశ్చిద్బన్ధుర్మనీషి ణామ్॥18॥ అజ్ఞాతజ్ఞాపనం యత్స్యాదప్రవృత్తప్రవర్తనమ్ । సర్వంచభవ దాయత్తమస్మాకం పురుషోత్తమ ॥ 19 ॥ కలిరద్యమహీంసర్వామాక్రమ్యఖిలువర్తతే

। అత స్తద్దోషనిర్ముక్తంస్థానంత్వంవక్తుమర్హపి ॥ 20 ॥ యత్రైతేపరయాభక్త్యా సేవిష్యన్తే భవత్పదమ్ । మునయః మలాకాన్తకమలాకరలాళితమ్ ॥ 21 ॥ ఇతి

శ్రీయాదవగిరి ప్రశంసా

తద్వచనంశ్రుత్వాభగవాన్భక్తవత్సలః । స్థానంసగుణమాఖ్యాతుంసన్తోషాదుప చక్రమే ॥ 22 ॥ శ్రీనారాయణః ॥ అస్తిదక్షిణదేశీయః కశ్చిదాస్తికసంశ్రయః । నారాయణ గిరిర్నామసంసారార్ణవతారకః ॥ 23 ॥ సహ్యాద్రేస్సగిరిః పూర్వస్సహ్యాజాయాప్తథోత్తరః । దూరాదాలక్ష్యతేకృజ్రైర్దుఃఖసాగర సేతుభిః ॥ 24 ॥ తత్రార్చనవిధానే నతపసాచాధి దైవతమ్ । అభ్యర్చ్యవివిధాన్కామాన్ లభతేకమలాసనః ॥ 25 ॥ అత్రోపదేష్టురూపేణ వర్తేబదరికాశ్రమే । ఉపదేష్టవ్యరూపేణవర్తేత్రమహీధరే ॥ 26 ॥ హృదయం మతత్సానం శ్రుతీనాంనయ సంశుభమ్ । మునీనామపిసర్వస్వం ముక్తేశ్చ ప్రథమాఙ్కురమ్॥27॥ దక్షిణోత్తరభేదేనద్వావేతౌహిమమాశ్రమా । సత్త్వోత్తరాణాంభూయస్త్వాత్సతుపర్వోత్తరో గిరిః ॥ 28 ॥ గుణత్రితయభేదేన ప్రకృతిర్భిద్యతేన్నృణామ్ । నారాయణాద్రినిష్ఠా నాం నరజోస్తికుతస్తమః ॥ 29 ॥ శ్రీరఙ్గేవృషభాద్రౌచక్షేత్రేసత్యవ్రతేమమ । విష్ణు లోకేచయా ప్రీతిస్సాప్రీతిస్తత్రజాయే ॥ 30 ॥ తత్రశేషశ్చతనుతేశేషవృత్తింయుగే యుగే। అశేషశేషిణేమహ్యాం శేషాశనముఖైస్సహ ॥ 31 ॥ అనన్తః ప్రథమం రూపంలక్ష్మణశ్చ తతః పరమ్ । బలభద్రస్తృతీయశ్చకలౌకశ్చిద్భవిష్యతి ॥ 32 ॥ అర్చితః కృష్ణ రామాభ్యాంతత్రాహం ద్వాపరేయతః । తేనయాదవశైలోయతిలోకేషుకథ్యతే ॥ 33 ॥ సహస్ర శిఖరస్సోయం సాక్షాచ్ఛేషాత్మకోగిరిః । వైకుణ్ఠాదపియత్రాహంరమయాసహితో రమే ॥ 34 ॥ వైకుణ్ఠాద్యఖిలస్థానసారస్యయదుభూభృతః । సేవయాకృత్స్నమత్త్వాన సేవాప్యన్తర్భవిష్యతి ॥ 35 ॥ వైకుణ్ఠవాసిన స్సర్వేశేషశేషాశనాదయః । తిర్యక్స్థావరజన్మా నిశ్రయన్తే యదుభూధరే ॥ 36 ॥ అహంచబదరీభూత్వాతస్యశైలస్యమూర్ధని । వసామి మునిశార్దూలైర్వన్దితస్సనకాదిభిః ॥ 37 ॥ పశవఃపక్షిణ స్తత్రప్రాకృతాశ్చాపిమానవాః। దూరతోపినమస్యన్తేక్రూరైశ్శమనకిఙ్కరైః ॥ 38 ॥ యాదవాద్రేర్జిగమిషాయేషాం కేషాం చవిద్యతే । తేషాందేసేయమభటానగచ్ఛన్తికదాచన ॥ 39 ॥ భవన్తస్తత్రగత్వైవభవస న్తాపశాన్తయే । కాలేకాలేచసేవన్తాంకల్యాణం తీర్థమద్భుతమ్ ॥ 40 ॥ యత్రతీర్థేని మజ్జన్తోయతయస్సంశితవ్రతాః । ఉన్మజ్జన్తిభవామ్భోధికల్లోలకలహాన్తరాత్ ॥ 41 ॥ పుష్కరేనతథాప్రీతిర్నగఙ్గాయాంన యామునే । యథాకల్యాణతీర్థస్యతీర్థేకల్యాణ చేతసామ్ ॥ 42 ॥ తీర్థేతత్రామలేస్నాత్వాముచ్యన్తేసర్వకిల్బిషైః ॥ నాస్తికశ్చకృతఘ్నశ్చ



పరీవాదరతోపిచ ॥ 43 ॥ పరప్రశంసానిష్ఠశ్చ స్వప్రశంసాపరాయణః । యజ్ఞ విఘ్న కరశ్చాపి వేదాధ్యయనదూషకః ॥ 44 ॥ పరదారానురక్తశ్చపాకభేదకరోపిచ । పరద్రవ్యాపహారీచపాషణ్డాగమతత్పరః ॥ 45 ॥ శూద్రాన్నభక్షకశ్చాపిశ్వాదీనాముపలా ళకః । ధర్మనిక్రయశీలశ్చశ్రార్ధభుగ్గ్రామయాజకః ॥ 46 ॥ దేవతార్దవ్యహారీచ దర్పడమ్భాదిసంయుతః ॥ నిత్యంనగరవాసీచనృపసేవోపజీవకః ॥ 47 ॥ కన్యావిక్రయ కారీచకాకవత్సర్వభక్షకః । గవాంక్లేశకరశ్చాపిబ్రాహ్మణానాంచనిన్దకః ॥ 48 ॥ విష్ణు భక్తివిఘాతీచవృషలీపతిరేవచ । శౌచాచారవినిర్ముక్తశ్శరణాగతఘాతకః ॥ 49 ॥ ఏతైరన్యైశ్చ ముచ్యన్తే పాపైః పాపరతాజనాః । నరసింహగిరింత త్రదూరేన మతభక్తితః ॥ 50 ॥ యస్యదర్శనమాత్రేణ దూరంగచ్ఛతిదుష్కృతమ్ । ప్రహ్లాదోహిమహాభాగః ప్రణయంమయిధారయన్ ॥ 51 ॥ ప్రతిష్ఠాంకారయామాసత త్రమాం సింహ రూపిణమ్ । ఆరోహన్తిగిరింయేతు తేచసేవార్థినోమమ ॥ 52 ॥ నావరోహన్తిసంసార సాగరావర్తగహ్వరే । ధర్మమర్థచంకామంలభన్తేమోక్షమన్తతః ॥ 53 ॥ అజ్ఞానవారకోనామ కశ్చిదశ్వత్థపాదపః । తీర్థస్యపశ్చిమేభాగే కల్యాణస్యావలోక్యతే ॥ 54 ॥ అమ్బరీషో వికుక్షిశ్చపురారుక్మాఙ్గదస్తథా । శుకశ్చపుణ్డరీకశ్చయదన్తే మాముపాసత్ ॥ 55 ॥ పఞ్చభాగవతస్థానమతస్తత్స్థానముచ్యతే । ముచ్యన్తేహిచతతత్సానదర్శనాపదిపాతకైః ॥ 56 ॥ అహంహిమమభక్తానాందదామినిఖిలంఫలమ్ । కల్యాణసరసః పూర్వం నరసింహగిరేరధః ॥ 57 ॥ క్షేత్రంసిద్ధికంపుంసాంవారాహంస్థానముచ్యతే । వరాహ రూపిభగవాన్వసుధామవలోకయన్ ॥ 58 ॥ యత్రశ్రుతీనాముత్తం సంశ్లోకద్వయము పాదిశత్ । వైకుణ్ఠవర్ధనం నామక్షేత్రంతత్సత్యముచ్యతే ॥ 59 ॥ ప్రమాణం తస్య విజ్ఞేయం పరితోయజనద్వయమ్ । యావద్దృష్టి పథంయాతిపర్వతోయం మునీశ్వరాః ॥ 60 ॥ తావత్ప్రమాణకం సర్వంముక్తి క్షేత్రం తదుచ్యతే । శుద్ధసత్త్వమయం తత్ర విమానంమమదృశ్యతే ॥ 61 ॥ ఆనన్దమయమిత్యేవయస్య సామాపికథ్యతే ॥ నమస్కారే2పికింతస్యకీర్తనాద్దర్శనాదపి ॥ 62 ॥ ఆజన్మమరణం యత్స్యా దఘం తదపినశ్యతి । అవతీర్ణంహివైకుణ్ఠాదాద్యేకృతయుగేచతత్ ॥ 63 ॥ జగతాముపకారా యస్వయం సంకల్పతోమమ । పశ్చాదపివిమాన్యప్రాకారాన్తరమధ్యతః ॥ 64 ॥ సుదర నంచలక్ష్మీశ్చవర్తే తేసర్వకామదే । యేతత్రమార్జనంచక్రుర్యేచతత్రోపలేపనమ్॥ 65॥ దీపప్రదానం యే చాపి యేవాస్థణ్డిలమణ్డనమ్ । చామరస్మేరపార్శ్వాస్తేధత్రచ్ఛా యాశ్రితాః పునః ॥ 66 ॥ చక్రవర్తిపదంర్పలిప్యమోదన్తే పుత్రపౌత్రకైః । అధికారావసానే తుదదామ్యహమనుత్తమమ్ ॥ 67 ॥ అవిశేషం ఫలం తేషాంశేష శేషాశనాదిభిః ।

అశేష చిదచిద్వస్తు శేషిణోమమకాఙ్క్షితమ్ ॥ 68 ॥ భక్తిః కేవలమన్యైస్తుపరీక్షేభావ బంధనమ్ । విశుద్ధాంమృత్తికాంతత్రలలాటేధారయన్తియే ॥ 69 ॥ అన్యేష్వపియథా స్థానమఙ్గేషుయత చేతనః । సద్యస్సంశుద్ధరూపేభ్యస్తేభ్యోబిభ్యాతి దానవాః ॥ 70॥ భూతప్రేతపిశాచాశ్చతథావేతాళజాతయః । శ్వేతద్వీపాత్థగేశేనశుద్ధమృద్ధ్వయమా హృతమ్ ॥ 71 ॥ యాదవాద్రావినిక్షిప్తమక్షయం తన్మమాజ్ఞయా । సత్త్వస్యప్రకృతి శ్శుద్ధాశుద్ధా త్రాపిన్మృత్తికా ॥ 72 ॥ అతస్సత్త్వమయం స్థానమాదరాదధిగచ్ఛథ ॥ ఉత్త

అష్టతీర్థమహిమానువర్ణనమ్

రత్రాస్యశైలస్యధారానిర్మలరూపిణీ ॥ 73 ॥ కాచిత్పతతికల్యాణీకాఙ్క్షితార్థ ప్రదాయినీ । యస్యావైకుణ్ఠగఙ్గేతినామధేయం విదుర్బుధాః ॥ 74 ॥ సాహివిష్ణు పదాదేవసాక్షాన్ని పతితాభువి । యేపిబంతిజలంభక్త్యాయేవాతత్తీరవాసినః ॥ 75॥ విజ్ఞానంప్రాప్యమోదన్తే తేవై వైకుణ్ఠపాసిభిః । త్రివిక్రమస్యపాదాబ్జే బ్రహ్మణాక్షాళితే సతి ॥ 76 ॥ ఆసీద్ధరజటాజూటమాలావిష్ణు పదీనదీ । విరజాతోయమాదాయతతోవై కుణ్ఠవాసినః ॥ 77 ॥ పునఃప్రక్షాళయామాసుః పుణ్యాతీర్థాభిలాషిణః । తత్తీర్థం పతితం కిఞ్చిత్పార్శ్వేయాదవభూభృతః ॥ 78 ॥ సాహివై కుణ్ఠగఙ్గేతిధారాతత్రనిగద్యతే । భక్తి సారోమహాయోగీమత్పదైక స్తుతివ్రతః ॥ 79 ॥ తత్రత్యోమత్పదుంధ్యాయన్ చిరం వైకుణ్ఠమాపసః । తస్యాంవైకుణ్ఠగఙ్గాయాం ప్రోక్షణైర్మమరోధకాః ॥ 80 ॥ కామాది దోషానశ్యన్తిశ మాద్యాభాన్తిసద్గుణాః ॥ నయనాదపవర్గస్యనయనం స్థానముచ్యతే॥ 81 ॥ తత్రకేశవసాన్నిధ్యంకృతిమోషన్వతే సదా । నారాయణ హ్రదం ప్రాహుర్నయ నేతీర్థమద్భుతమ్ ॥ 82 ॥ అయత్నాదేవజాయన్తేయదన్తేమన్త్రసిద్ధయః । క్లేశాపహారిణం పుంసాం కేవలందర్శనాదపి ॥ 83 ॥ కేశవంనయనస్థంత్తంధ్యాత్వైవవిబుధోత్తమః విరక్తోవిష్ణుచిత్తస్తునారాయణపదద్వయమ్ ॥ 84 ॥ శరణం ప్రాప్యతత్రైవజగామ పరమం పదమ్ । నారాయణహ్రదస్నానంనరకాఙ్గార నాశనమ్ ॥ 85 ॥ నారాయణాఙ్ఘ్రి స్మరణంజనయేన్మరణేనృణామ్ । దక్షిణే చాస్యసరసః కల్యాణస్యోత్తరేశుభే ॥ 86॥ తీర్థంపారాశరం పుణ్యంభాసతేమధురోదకమ్ । మన్నియోగేనమద్భక్తః పురాతత్ర పరాశరః ॥ 87 ॥ పురాణం వైష్ణవంచక్రేతతటేతీర్థస్యతస్యహి । మైత్రే యకుణ్డమిత్యస్య తీర్థస్య తీర్థస్యకతిచిద్బుధాః ॥ 88 ॥ దక్షిణాపథదేశీయాన దవ్యాఖ్యాంపురావిదః । ఉత్తరాపరభాగేనశైలస్యాస్యప్రసర్పతి ॥ 89 ॥ పరీతాయజ్ఞవృక్షైశ్చ యాదవీతిహానదీ । ఖాదిరైశ్చపలాశైశ్చతత్రత్యైరేవపావనైః ॥ 90 ॥ యేయజన్తిపరంధామలభన్తే తేహిమా



మకమ్ । యాదవేన్ద్రోమహీపాలస్తస్యాస్తీ రేతపశ్చరన్ ॥ 91 ॥ ఐన్ద్రం పదమవాప్యాథ క్రమాన్ముక్తిం పరామగాత్ । తస్యయాదవశైల స్యపార్శ్వేదక్షిణతస్సితామ్ ॥ 92 ॥ పరిధానశిలాంద్రుష్ట్వాప్రణమన్తిద్విజోత్తమాః । యస్యాః ప్రణామం కుర్వాణాః ప్రణమ్యన్తే సురాసురైః ॥ 93 ॥ సాహిసత్త్వమయీపుంసాం సద్యస్సత్త్వం ప్రయచ్ఛతి । పురాహిశాక్య పాషణ్డకాణాదాద్యామహీతలే ॥ 94 ॥ త్రైయ్యాం వైయ్యాకులీంచక్రుర్వక్రైర్వచనవిస్తరైః । అన్తేవాసిభి రామ్నాయైస్సాకం మానుషరూపధృత్ ॥ 95 ॥ త్రిదణ్డధారీభూత్వాహం నిరాస్థమహమీదృశాన్ ॥ దత్త్వాత్రేయస్యమేతత్రతదాకాషాయసఙ్గహః ॥ 96 ॥ అతోమత్పరిధానేనశిలాయానామకథ్యతే । యేతత్రపరిగృహ్ణన్తినరాః కాషాయ శాటికామ్ ॥ 97 ॥ మద్భావేననమస్యాస్తేమద్భక్తేషూత్త మోత్తమాః । వేదానుసాది శంతత్రశిష్యాణామహమర్థతః ॥ 98 ॥ తస్మాత్పుష్కరిణీంత్రత్రవేదపుష్కరిణీంజగుః । ఉపత్యకాయాంశైలస్యతస్యాం పశ్చిమభాగతః ॥ 99 ॥ దర్భతీర్థమితిఖ్యాతం తీర్థ మస్తిమహత్తరమ్ । మమసన్న్యాసిరూపస్యయత్రాసీద్దర్భనగ్రహః ॥ 100 ॥ శాణ్డిల్యో పిమునిశ్రేష్ఠస్తత్రమామార్చయత్పురా । పఞ్చరాత్రస్యకృత్స్నస్య యఏవాసీత్ప్రవర్తకః॥ 101 ॥ పాఞ్చకాలికధర్మోపియేనా భూద్విశదీకృతః ॥ ప్రయాణకాలేతత్రత్యైర్దర్భైర్యే ల్పమాశ్రితాః ॥ 102 ॥ తేహిసంసారదుఃఖేభ్యోముక్తాయాస్యన్తిమత్పదమ్ । గిరేః పశ్చిమస్తీర్థం దివ్యన్యచ్చదృశ్యతే ॥ 103 ॥ పలాశతీర్థమిత్యాహుర్యస్యనామపురావిదః । విశ్వామిత్రేణశప్తావాంవసిష్ఠకులజన్మనామ్ ॥ 104 ॥ యత్రాసీన్మత్ప్రసాదేనపురాశాప విమోక్షణమ్ । తస్యచోత్తరతః కిఞ్చిత్తీర్థస్యాప్తిమహత్తరమ్ ॥ 105 ॥ పద్మతీర్థమితి ఖ్యాతం తీర్థం పద్మో పలాలితమ్ । సనత్కుమారోమునిభిస్సనకాద్యైస్సమన్వితః॥ 106॥ యత్రపద్మముపాదాయపు రామామభ్యపూజయత్ । పద్మతీర్థసముద్భూత పద్మాక్షమణిమాలికామ్ ॥ 107 ॥ కణ్ఠేబిభ్రతియేనిత్యం తేహివైకుణ్ఠగామినః । ఇతి కల్యాణతీర్థస్యపరితః పాపనోదకామ్ ॥ 108 ॥ అష్టతీర్థమిమాం ప్రాహురష్టాక్షర మయాంబుధాః । స్మృత్వాపియస్యాశ్శుద్ధ్యన్తికింపునర్మజ్జనాదిభిః ॥ 109 ॥ సాహిసర్వే షుతీర్థేప్రశస్తాకథ్యతేబుధైః । తత్తీరతులసీకాష్ఠ మణిభిర్యేవిభూషితాః ॥ 110 ॥ శుద్ధ్య న్తితేషాంద్రుష్ట్వైవ మహాపాతకినోనరాః । యతయోమాం నిషేవన్తేయదు శైలస్య మూర్ధని॥ 111 ॥ స్థానాన్తరేకృతం పుణ్యంపుణ్యస్థానేదశోత్తరమ్ । పుణ్యస్థానేచ యత్పుణ్యం పుష్కరేతచ్ఛతోత్తరమ్ ॥ 112 ॥ సహస్రగుణితంతచ్చప్రయాగేతు కృతం భవేత్ । సాళగ్రామే కృతంతచ్చేద్భవేత్కోటిగుణంపునయతయోమాం నిషేవన్తేయదు శైలస్యమూర్ధని ॥ 113 ॥ శతకోటిగుణం తస్మాత్కృతం యాదవభూధరే । తత్రాపి

మమభక్తానాం సన్నిధౌక్రియతే యది ॥ 114 ॥ తద్దృష్టిపరిపూతంతత్కోటికోటిగుణం భవేత్ । దుర్దర్శనమరాతీనాం మామకానాం సుదర్శనమ్ ॥ 115 ॥ పాలనాయగిరే స్తస్యపరిభ్రమతితేజసా । యస్తుయాదవశైలస్థాన్మద్భక్తాన్పీడ యిష్యతి ॥ 116 ॥ సుదర్శనమహాజ్వాలామాలాశలభ ఏవనః । ద్వాపరాన్తే కలిస్తత్ర ప్రవేష్టుం ద్రుతమాగతః ॥ 117 ॥ వేత్రదండధరైస్సద్యస్తాడితో మమకిఙ్కరైః । వత్సరం వా2థమాసంవాపక్షం సప్తదినానివా ॥ 118 ॥ త్రిరాత్రమే కరాత్రం వాయోవ సేద్య దుభూధరే । సఏవమమభక్తస్స్యాన్నాన్యః ప్రియతరోమమ ॥ 119 ॥ యస్తుఫాల్గుణ మాసస్య పౌర్ణమాస్యాం నిషేవతే । యామం వాపితదర్ధం వామాంతత్రయదు భూధరే॥ 120 ॥ అనుగచ్ఛామితం నిత్యం జననీవస్తవంధయమ్ । గత్వాయాయం మునిశ్రేష్ఠా స్తత్రకృత్వామమార్చనమ్ ॥ 121 ॥ ఉపలభ్యపరాంభక్తిం సంసృతింసన్తరిష్యథ । గత్వా గత్వానివర్తన్తేసర్వేధర్మపరాయణాః ॥ 122 ॥ మాంప్రాప్యననివర్తన్తేయాదవాద్రిని వాసినమ్ । ఇత్యుక్త్వావిరతేదేవే ముదితామునయశ్చతే ॥ 123 ॥ ప్రణమ్యపునర ప్యాహుః ప్రణతోత్తారకం హరిమ్ । నారాయణనమస్తే స్తునరాణామయనం భవాన్॥ 124 ॥ సఙ్క్షే పాద్యచుశైల్య మాహాత్మ్యంకథితంత్వయా । తదిదం విస్తరాచ్ఛ్రోష్యం హినః పరమాగతిః । ఇత్యుక్తస్తైర్మునిశ్రేష్ఠైః ప్రత్యువాచతతో హరిః ॥ 125 ॥ సనత్కుమారోభగవాన్సర్వం శ్రుత్వాపితామహాత్ । తస్యశైల్యమాహాత్మ్యం నారదాయతతో బ్రవీత్ ॥ 126 ॥ సఏవభవతామేదద్వక్తుమర్హతినారదః ॥ ఇత్యుక్త్వా న్తర్దదేతత్రమునీనాం భావితాత్మనామ్ ॥ 127 ॥ పురతః పుణ్డరీకాక్షః పూర్ణషాడ్గుణ్య లక్షణః ॥ 128 ॥ ఇతికిల మునిముఖ్యానీరయిత్వావచోభిః పరిణతమివలక్ష్మ్యాః ప్రార్థితా నాం ఫలానామ్ । యదుగిరిగతమ న్తర్దర్శినాం చక్రవర్తీ యదుకులబహుమానన్యం చిన్తయామాసదేవమ్ ॥ 128 ॥

ఇతిశ్రీ నారదీయే పురాణే జ్ఞానకాండే శ్రీమద్యాదవగిరి
మాహాత్మ్యే విష్ణుఋషిసంవాదే సఙ్క్షేపతో
యాదవాద్రిప్రశంసాదికథనం నామ ప్రథమోధ్యాయః ॥